







ఓం

శ్రీగురుభ్యోనమః

పరిపూర్ణ ప్రబోధామృతమను

# కేనోపనిషత్తు

(భావార్థము వివరములతో సహా)

సంకలనకర్త


శ్రీమదచల ఋషి ప్రబోధానందమల్లు వెంకటార్య రాజయోగి శిష్యుడు

**మంత చిన్నయ్య** ఎం.ఎ., బి.యిడి.,

సంపాదకులు

సత్యశోధనాచార్య నిత్యానంద **కురుబసుబ్బారాయుడు**

అనంతపురము జిల్లా



**2004**

శ్రీ శ్రీ శ్రీ శివరామ దీక్షిత గురూపపీఠము

పరిపూర్ణ బోధ గ్రంథమాల - 4

ఓం

శ్రీగురుభ్యోనమః

## పరిపూర్ణ ప్రబోధామృతమను

# కేనోపనిషత్తు

(భావార్థము వివరములతో సహా)

సంకలనకర్త

శ్రీమదచల ఋషి ప్రబోధానందమల్లు వెంకటార్య రాజయోగి శిష్యుడు

**మంత చిన్నయ్య** ఎం.ఎ., బి.యిడి.,

సంపాదకులు

సత్యశోధనాచార్య నిత్యానంద **కురుబసుబ్బరాయుడు**

అనంతపురము జిల్లా

2004

శ్రీ శ్రీ శ్రీ శివరామ దీక్షిత గురూపపీఠము

శ్రీ గురుభ్యోనమః

# కేనోపనిషత్తు



# ఓం

## శ్రీ గురుభ్యోనమః

శ్లో॥ అజ్ఞాన తిమారాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితంయేన తస్మై శ్రీ గురువేనమః!

లోకంలో అధికులు అర్థాన్వేషణకై పలురకములైన మార్గములను అనుసరించెదరు. ఏ కొందరో ఆత్మాన్వేషణకై ప్రయత్నింతురు. పై రెండు అంశములు పొందుటకు చతుర్విధ పురుషార్థములైన ధర్మార్థ కామమోక్షలులు ముఖ్యమైనవి.

వీనిలో మొదటిదైన, ధర్మమును చక్కగా నాచరించినచో, మిగిలినవి సులభముగ పొందుటకు వీలుకలుగును. "ధర్మోరక్షతి రక్షితః" యను ఆర్యోక్తి సుప్రసిద్ధము. "సత్యంవద ధర్మంచరా" యను శ్రుతి ప్రకారము సత్యము వచించుటకు, ధర్మంగా నడుచుకొనుటకు ఏర్పరచబడినది. సత్య వాక్కునకు కట్టుబడినవాడు ధర్మాచరణగావించును. ధర్మము వివిధ పరిస్థితులందు సమయ సందర్భమును బట్టి వ్యక్తిత్వమును బట్టి వేర్వేరుగాతోచును. ఉదా॥ ప్రభుత్వ ధర్మము, తండ్రి కుమారుల ధర్మము, సతి పతుల ధర్మము, గురు శిష్యుల ధర్మము - ఇచ్చట యెవరి ధర్మము (బాధ్యత) వారు చక్కగా నాచరించిన సమాజమందు సుఖశాంతులు వర్ధిల్లును.

## ధర్మాచరణకై జ్ఞానము ప్రధానాంశము

జ్ఞానము, లౌకిక, అలౌకికమని రెండు విధములుగా కలదు. లౌకిక జ్ఞానము (ప్రాపంచిక) కలవారు యధికముగా ప్రవృత్తి కర్మలనే చేయుచుందురు - ఏలననగా వీరు ఏ పని చేసిన ఫలితము నాశించియే చేయుదురు - దీనికి భిన్నముగ అలౌకిక జ్ఞానులు, నివృత్తి కర్మ, యనగా ఏకర్మ చేసినా ఫలాసక్తి లేకుండగ భగవాదర్పణ బుద్ధిచే కర్తృత్వ రహితముగా చేయుదురు. దీనినే భగవద్గీతలో దిగువ విధమున విశదపరచబడినది.

**శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,**
**మా కర్మఫలహేతుర్భూర్మాతేసఙ్గోఽ_స్త్వకర్మణి** భ-గీ - 2-47

సర్వ సాధారణముగ, మనుజుడు, నేను యీ పనిని చేయుచున్నానని తలంచుటచే కర్తయగుచున్నాడు. కర్త తానైనపుడు కలుగు చేటు పాటులకు తానే భోక్తకదా, మంచిదానికి తాను, చెడుకు యితరులు లేక భగవంతుని కర్తగా చెప్పెదరు. ఇది సమంజసము కాదు.

ఇచ్చట **"నేను"** యనేది ఏది? దీనిని బాగుగా పరిశీలించవలెను. పారమార్థిక దృష్టిలో చెప్పుటకు, సరియైన జ్ఞానము కావలయును. ఇచ్చట జ్ఞానము, నేను, యనునవి రెండుగా తోచును. కాని భాగవతుల కృష్ణదాసుగారు యీ రెండు ఒకటేయని సెలవిచ్చినాడు. దిగువ సూచించిన కందముచే స్పష్టమగును.

**కం॥ జ్ఞానము నేనన నొక్కటె। జ్ఞానము నే వేరటంచు। గన బోకు సుమీ।**
**జ్ఞానము వచ్చును బోవును। జ్ఞానాతీతమును తాను। గాంచిన దాకన్॥ 128**

మనకు అందుబాటులో గల దశోపనిషత్తులలో "కేనోపనిషత్తు" ఒకటి. ఈఉపనిషత్తులోగల మంత్రములకు, శ్రీ చిన్మయానంద మంత చిన్నయ్యగారు భావార్థమును చాల స్పష్టముగా తెలిపినారు. మొత్తముపై "నే" నెవరుయని తెలిసితె, అంతా తెలిసినట్లెయని తాత్పర్యము కలుగకమానదు. ఈ గ్రంథకర్త యింతకు పూర్వమే మూడు "ఉపనిషత్తులైన గురువాక్యోపనిషత్తు, సర్వసారోపనిషత్తు మరియు అనంతోపనిషత్తు" లకు, తన భావార్థమును తెలిపినారు. ఇవి పరిపూర్ణాచలగురు సూచన కల్గిన వారికి, బోధ దృఢీకరణకై యెంతయో దోహదపడును. ఎంతయో శ్రద్ధ మరియు దీక్షచే **"కేనోపన నిషత్తుకు** భావార్థమును వ్రాసినందులకు, వారిని మనస్ఫూర్తిగా అభినందించి ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు

**శ్రీ శివరామ దీక్షిత**
అచల సద్రూప పీఠ రాజయోగా శమము,

**ప్రబోధానంద వెంకటార్యులు**



శ్రీ గురుభ్యోనమః

## శ్రీశ్రీశ్రీ శివరామదీక్షిత గురూపపీఠము,

గద్వాల

శ్రీ మదచలర్షిదయానంద పాన్నాల రాజయోగీంద్రుల పాదకమల సేవకులు శ్రీ మదచలర్షి రామడుగు శివరామ దీక్షితాచల గురుపీఠ ప్రచారకులు శ్రీ పరిపూర్ణానంద బూసానరసింహార్య, చౌదరిగూడెమువారు. వీరి ముఖ్య శిష్యులు శ్రీమల్లు వెంకటరెడ్డి గారు. వీరికి కేంద్ర పీఠము వారు ప్రబోధానందను దీక్షను నొసగిరి. ఈ ప్రబోధానందుల వారి శిష్యుడే శ్రీ మంత చిన్నయ్యగారు. వీరు నన్ను బాగానెరుగుదురు. నేనెరిగినను ముఖ పరిచయమంతగా లేకుండెను. గురు వాక్యోపనిషత్తు వాఖ్యాన గ్రంథమును పంపిరి. వారి నామము పరిచయమైనది. మాసోదరులు బూసానర్సింహార్యుల వారి శిష్య ప్రశిష్యులని అవగత మొనర్చుకొంటిని. తరువాత శ్రీ మంతావారు అనన్తోపనిషత్తు, సర్వసార పూర్ణోపనిషత్తు వ్రాత ప్రతులను నాకు పంపుచు వీనిని పరిశీలించి గుణ దోషములను దెలియజేయుచు నా సందేశమిమ్మని కోరిరి. అపుడు నేను అనారోగ్యకారణమున హైదరాబాదు కామినీ నర్సింగ్ హోమ్ నందు చికిత్స పొందుటచే మా సోదరులగు శ్రీ సత్యశోధనాచార్య నిత్యానంద కురుబ సుబ్బరాయుడు గారి కాదేశించితిని. వారు నా మాటను తల దాల్చి "అనంత దర్శనము" "సర్వసార పూర్ణోదయం" అను ఉపనిద్భాషణములు వ్రాసిపంపిరి.

ఇప్పుడు కేనోపనిషత్తును కూడ సుబ్బరాయునకే పంపుడని కోరగా వారు నటులేజేసిరి. శ్రీ సుబ్బరాయులవారు పరిశీలించి అనుశీలనా వ్యాసమును వ్రాసిపంపిరి. చూచితిని. సంతసించితిని. ఇంకేమి చెప్పవలె? శ్రీ మంత చిన్నయ్యగారు ప్రశిష్యతుల్యుడు. వారి నిరంతర వ్యాసరచనా శీలతకు హృదయ మొప్పొంగి పులకించినది. అభినందించక తప్పలేదు. అందువలన **"గురుదీక్షాదక్ష"** అను నామముతో అతనిని ఆశీర్వదించుచున్నాను.

21-3-2004

**అమలానంద పాటల పండరినాథ్**
గద్వాల



ఓం

శ్రీ రాజయోగి సద్గురు పరబ్రహ్మణే నమః

# "కేనోపనిషత్తు - బ్రహ్మ విజ్ఞాన పరిషత్తు"

## సంపాదకీయం - అనుశీలనము
## సమాలోచనాత్మక పరిశీలనా పీఠిక

కేనోపనిషత్తు అష్టోత్తర శతోపనిషత్సముదాయంలో రెండవది. ఈయుపనిషత్తు సామవేదమునకు సంబంధించినదై యలరారుచున్నది. దీనికి " **తలవకారోపనిషత్తు**" అను నామాంతరము గలదు. సామవేదమునకు సహస్ర శాఖ (1000) లున్నవి. ఆశాఖలలో తలవకార శాఖ యొకటి. అందు తొమ్మిది యధ్యాయములున్నవి. చివరిదైన తొమ్మిదవ యధ్యాయమే ఈకేనోపనిషత్తు, అందువలన తలవకారోపనిషత్తను నామాంతరము బొందినది. మరి యొక కారణం. సకల వేదాలకు ఆచార్యుడు వేదవ్యాస మహర్షి. ఆయన దగ్గర వేయి శాఖల సామ వేదాన్ని, జైమిని మహర్షి (వ్యాసుల వారి శిష్యుడు) అధ్యయనం చేసి తన శిష్యుడైన " **తలవ కారుడు**" అనునతనికి ఉపదేశం చేసినాడు. అందువల్ల సామవేదమునకు జైమినీయ బ్రాహ్మణం అనియూ, తలవకారుడు ప్రచారం చేయుటచేత **తలవకార బ్రాహ్మణం** అని ప్రాచుర్యాన్ని పొందినది. ఉపదేశ కర్తల కన్నను ప్రచారకుల పేరిట తత్కృతులు బహుళ వ్యాప్తిలోనికి వచ్చు యాచారము వేదకాలంలో ఎక్కువగా వున్నందువల్ల సామవేద సంహితకు తలవకార సంహితయని, తలవకార బ్రాహ్మణమని ప్రచారములోనికి వచ్చినది. కేనోపనిషత్తు సామవేదీయ మగుటచేత దీనికి "**తలవకారోపనిషత్తు**" అను నామధేయం ఏర్పడినది.

సామవేద సంహితా విభాగంలో

**మం॥ సామఖిలం సకలవేద గురోర్మునీంద్రాద్**
**వ్యాసాదవాప్య భువియేన సహస్ర శాఖమ్।**
**వ్యక్తం సమస్తమపి మంగళ గీత రాగం**
**తం జైమినిం తలవకార గురుం నమామి॥**

పై మంత్రము దర్శనమిస్తున్నది. సహస్ర శాఖలుగల సామవేద సంహితకు ప్రచారకులు జైమిని మరియూ **తలవకారగురుడు** అని మంత్రం వివరిస్తున్నది.

వేదాలు నాలుగువున్నట్టే ప్రతి వేదంలోనూ నాలుగు విభాగాలుంటాయి.

**మొదటి విభాగం సంహిత :**

సంహిత అంటే మంత్రాల సంకలనం **(Anthology)** వివిధ దేవతలు అనగా ఇంద్రుడు, వరుణుడు, అశ్వినీ దేవతలు, యముడు, సరస్వతీ, లక్ష్మీ, పార్వతి యిత్యాది

దేవతల కృపాకటాక్షములకై గానం చేయబడు చందోబద్ధ మైన దేవతాస్తోత్రముల సంపుటియే సంహిత.

ప్రతి మంత్రమునకూ దేవత, ఋషి ఛందస్సూ వుండును. మరియూ మంత్రముల నుచ్చరించు ఉదాత్త, అనుదాత్త, స్వరితములనే స్వర ఉచ్చారణా విధానములుండును. వీటిలోనే తిరిగి మండలములు, ప్రపాఠకములు, సూక్తులు అధ్యాయములుగా వేద సంహితా విభాగం ఏర్పడి యున్నది. నాలుగు వేదాలకు వరుసగా నాలుగు సంహితలుండును.

**1. ఋక్సంహిత 2. యజుస్సంహిత 3. సామ సంహిత 4. అధర్వ సంహిత**

అసలు వేదం అంటే మంత్రాల సముదాయమే. ఋక్సంహితలోని మంత్రాలను ఋక్కులు అంటారు. "ఋచ్" అనే ధాతువు నుండి ఉత్పన్నమైనమాట. "ఋక్" అంటే స్తోత్రంగా ఉపయోగించే మంత్రం అని అర్థం. ఇట్లనే యజుర్వేదంలో **యజుస్సులు**, సామవేదంలో **సామాలు**, అధర్వ వేదంలో **అంగరస్‌లు** అనబడే మంత్రాలు వుంటాయి.

**రెండవది బ్రాహ్మణాలు :**

"బ్రహ్మ" అంటే వేదకాలంలో మంత్రం అనే అర్థమే రూఢిగా వుండేది. అటువంటి బ్రహ్మలకు అనగా వేద మంత్రాలకు వివరణగా యుద్భవించిన సాహిత్య విభాగానికి **బ్రాహ్మణాలని** పేరు వచ్చినది. ఇవి పూర్తిగా గద్య రూపం. గద్య వాఙ్మయం అయినా వీటిని గూడా మంత్ర రూపంగానే పఠించెదరు. **'కౌషీతకీ బ్రాహ్మణం, ఐతరేయ బ్రాహ్మణం, తాండ్య బ్రాహ్మణం'** యిత్యాదులు.

**మూడవ విభాగం అరణ్యకాలు :**

ప్రతి వేదంలోనూ సంహిత బ్రాహ్మణాల తర్వాత **అరణ్యకాలు** అనే విభాగం వస్తుంది. వాటి పేరును బట్టి అవి అరణ్య సంబంధమైనవి అని అర్థం చేసుకొనవచ్చును. అది వర్ణాశ్రమ ధర్మాలు స్థిర పడిన కాలం. బ్రహ్మచర్య గృహస్థాశ్రమాల తర్వాత వానప్రస్థాశ్రమం అంటే వనవాసం చేయడం. మనిషి బ్రతికి యున్నంత కాలం కర్మాచరణ తప్పదు.

**ఆ॥వె॥ కర్మల నొనర్చుచునె యీ జగమ్మునందు**
**బ్రతుక గోరుము శతవత్సరములు వత్స**
**మానవుడవైన నీకిట్లు మనుట కంటె**
**పంథ మరిలేదు దీన పాపంబు రాదు.**

"కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః ............................" అను ఈశావాస్యోపనిషత్తు మంత్రమునకు ఆంధ్రానువాదమే పై పద్యం. వివరణ అవసరం లేకనే పద్య భావము స్ఫుటమగుచున్నది గదా. కనుక వానప్రస్థంలో చేయదగిన తపోధ్యానాది కర్మలకు సంబంధించిన విధులను నిర్దేశించునవి అరణ్యక గద్యవాఙ్మయము అని నిర్ణయం.

**అరణ్యకములకు మరి యొక అర్థ వివరణ:**

"అరణి" అనగా రావి, పలాశ (**జువ్వి చెట్టు**) సమిధలతో మధించి యజ్ఞారంభాన్ని చేయడానికి అవసరమైన అగ్నిని పుట్టించే ప్రాచీన ఋషుల యజ్ఞపరికరం అని అర్థం. అరణి నుండియే యజ్ఞము, వేదములు పుట్టినవి. కనుక "అరణి మధనము" వలె ప్రాచీన ఋషులు చేసిన "**బ్రహ్మజిజ్ఞాస**" అనే మధ స్వరూపమైన తపస్సుతో పుట్టినవే అరణ్యకములు. వీటి స్వరూపము బ్రాహ్మణములకూ, ఉపనిషత్తులకు మధ్యరూపంలో వుండును.

**నాల్గవ విభాగం : ఉపనిషత్తులు :**

వేద వాఙ్మయంలో చతుర్థ విభాగం ఉపనిషత్తులు. ప్రతి వేదానికీ ముందుగా సంహిత తర్వాత బ్రాహ్మణాలు, తర్వాత అరణ్యకాలు, ఆఖరున ఉపనిషత్తులు వస్తాయి. వేదాల ఆఖరులో వస్తాయి కనుక ఉపనిషద్వాఙ్మయానికి వేదాంతం అనే పేరు వచ్చింది. అంతేకాక ఉపనిషత్తు వాఙ్మయానికి "**పారమ్యం**" అనే పదము కూడా వేద పరిభాషలో ప్రయోగింపబడినది. "పారమ్యం" అనగా ఆవలిది, చివరిది అని అర్థం. మిగిలిన మూడు విభాగాలు దేవతల స్తోత్రాలు, యజ్ఞయాగాది కర్మ కాండకు సంబంధించినవైతే, ఉపనుషత్తులు కేవలం జ్ఞానకాండకు సంబంధించినవి.

ఒక విధంగా ఉపనిషత్తులు వేదాలపై పరోక్షరూపమైన తిరుగుబాటు వంటివని వర్ణింపవచ్చు. అనగా ఉపనిషత్తులు వేదాలలోని అంతర్భాగాలే. వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తాయి. అయితే అంగీకరించినట్టే అంగీకరించి వైదిక కర్మకాండను సంపూర్ణంగా నిరసిస్తాయి. వేదాలు నిర్దేశించిన యజ్ఞయాగాలు, ఐహిక సుఖ సౌభాగ్యాల కోసం దేవతలను ప్రార్థించి, స్తోత్రం చేసి, వారిని వశపరచుకోవడానికి ఉద్దేశించినవి. అంతేగాక యజ్ఞయాగాలు ఒక్కొక్కచోట జంతుబలులతో, నరమేధం వంటి అనాచార, దురాచారములతో కూడియున్నవి. అందుచేత ఆ కర్మకాండ కన్న ఉన్నతస్థాయికి చెందిన పరమాత్మతత్వమును వర్ణింపజేయు జ్ఞాన కాండను ఉపనిషత్తులు అభిమానించి ప్రచారం గావించినవి. భారతీయ తత్వ శాస్త్రానికి అవే మూలం. అయిననూ ఋగ్వేద నాసదీయ సూక్తం వంటి సూత్రాలలో వేదాలు అంధః రూపమగు శుద్ధ చైతన్య తత్వమగు పరమాత్మ దర్శనమును, తదాతీతమగు అచల పరిపూర్ణపరబ్రహ్మ దర్శనమును గావించుటలో "**నాసదీయసూక్తం**" వేద వాఙ్మయానికే తలమానికం. బహుశా ప్రపంచ వాఙ్మయ చరిత్రలోనే విలక్షణం విశిష్ఠం అయిన ఒక గొప్పసూక్తం అని చెప్పక తప్పదు. దీనిని గూర్చి మున్ముందు తెలుసుకుందాం.

ఉపనిషత్ "**అంటే దగ్గర కూర్చోవడం**" అని అర్థం. ఉప = సమీపమున, ని = చక్కగా, షత్ = కూర్చోవడం అని పద విభాగం యొక్క అర్థం.

1. ఎవరి దగ్గర ? గురువు దగ్గర. 2. ఎందుకు కూర్చోవడం? తత్వచర్చకోసం, బ్రహ్మజ్ఞాన సముపార్జన కోసం. 3. ఈవిశ్వం ఏమిటి? 4. ఎవరు దీనిని సృష్టించినారు? 5. మానవుడు ఎందుకు జన్మిస్తున్నాడు? 6. మానవ లక్ష్యం ఏమిటి? 7. అంతిమ సంతిమ సత్యం

ఏమిటి? 8. ఏ ఒక్క సత్యం తెలుసుకుంటే సమస్తం తెలుసుకున్నట్టు అవుతుంది? 9. తెలుసుకునేది ఎవరు? 10. తెలుసుకోబడేది ఏది ? = తెలుసుకునేది నీవే, తెలియబడేది నీయొక్క నిజస్వరూపమే. నీవు రహితమైన పిదప శేషించునది ఏది? **"తన్నివృత్తిమోక్షః"** తన రహితమునందే మోక్షం అంటే తానెవరు? పునరావృత్తి రహిత శాశ్వత మోక్షమేది? అను ప్రశ్న పరంపర ఉపనిషత్ అను పదమునందే అంతర్గతమై వున్నది. ఉపనిషత్తులు మొత్తం 1180. అయితే లభ్యమయినవి మాత్రం 108 అని అంత్యోపనిషత్తగు **ముక్తికోపనిషత్తు** నందు, వాటి పేర్లతో సహా శ్రీరామ చంద్రమూర్తి ఆంజనేయస్వామికి తెలిపినట్లు ప్రామాణిక మున్నది. కానీ ప్రస్తుతము **200** ఉపనిషత్తులు లభించుచున్నవని **(The Theosophical Publishing House, Adyar, Chennai)** వారు తెలియజేసి యున్నారు. ఈవిషయమునే కైలాస ఆశ్రమస్వామి విద్యానందగిరి స్వాములవారు సైతం బలపరచి యున్నారు. ఉపనిషత్ పదమునకు.

**1. విశరణము = శిథిలమొనర్చునది. 2. గతి = బ్రహ్మమును పొందించునది. 3. అవసాదనము = జనన మరణాదులను నాశనము గావించునది అని అర్థముకూడా వున్నది.** అనగా **1. భవబీజమును (జన్మ బీజమును) శిథిలమొనర్చి, 2. బ్రహ్మసాక్షాత్కారము పొందించి, 3. జనన మరణములను నాశన మొనర్చునట్టిది ఉపనిషత్తు అని అర్థం.** కాని శంకరాచార్యులవారు మండకోపనిషత్తు భాష్యమునందు ఉపనిషత్తనగా నిట్లు నిర్వచించియున్నారు.

**"ఉపనిషద్వేద్యాక్షర విషయం హి విజ్ఞాన మిహ పరావిద్యేతి**
**ప్రాధాన్యేన వివక్షితం నోపనిషచ్ఛబ్ద రాశిః" ("శాంకర భాష్యం")**

ఉపనిషత్తులందు తెలియదగిన అక్షర విషయక విజ్ఞానమే ముఖ్యముగా నిట "పర విద్య" యను పదము వలన చెప్పబడినది. ఉపనిషత్తు లనబడు శబ్దజాలము కాదు. ఈభాష్య వచనములను బట్టి ఉపనిషత్తులయందు బోధింపబడిన నాశరహితమగు బ్రహ్మము మాత్రమే పరవిద్య అను శబ్దముచే గ్రహింపదగినది. అయితే పరా, అపరా అను రెండు విద్యలకతీతమయినది అచల పరిపూర్ణపరబాహ్యము. ఈ అచల సిద్ధాంత మౌలిక బీజములు విస్తారంగా ఉపనిషత్తులయందు నిక్షిప్తమైయున్నవి. కావున, అపరా విద్యలగు కర్మ మరియు యోగ మార్గములకు, పరా విద్యా స్వరూపములగు సాంఖ్య, తారక, అమనస్క, మహావాక్య, అవాంతర వాక్య నిరూపితమగు అద్వైత వార్తీకాది సిద్ధాంత ప్రతిపాదితమగు సృష్టికారణ బ్రహ్మమున కతీతమగు అచల పరిపూర్ణపరబాహ్య దర్శనమును **(ఉనికిని)** విస్తారముగా ప్రబోధించునవి **"ఉపనిషత్తులను"** పద ప్రయోగమున కొప్పిదమైవున్నవి. అనగా అచలపరిపూర్ణ దర్శన మాత్రంచేతనే, సృష్టి కారణ బ్రహ్మ భ్రాంతిని పారద్రోలి శాశ్వత జన్మరాహిత్య సిద్ధిని ప్రబోధించునవి ఉపనిషత్తులని అర్థము. ఈశావాస్యోపనిషత్తునందు ఇట్లు పరాపర విద్యల కతీతమగు కర్మ, జ్ఞాన రహిత కర్తృత్వరహిత కర్మాచరణ రూప అశరీర

పద్ధతియే జన్మరాహిత్యమున కేకైక మార్గమను ప్రబోధ యున్నది గమనించుడు.

**మం॥ "అంధం తమః ప్రవిశంతి యేఽ విద్యాముపాసతే**
**తతోభూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః"**

పై మంత్రము నందు కేవల కర్మోపాసన మరియు అష్టాంగ యోగ మార్గసహితమైనది యగు అవిద్యారూపమగు అపరావిద్య అజ్ఞానాంధకారమున బడవేయుననియూ, కేవల పరావిద్యా రూపమగు జ్ఞానోపాసన అంతకంటెను మిక్కిలి అంధకారమున బడవేయుననియూ, కావున జన్మరహితము నభిలషించు ముముక్షువు, పరా, అపర విద్యల కతీతమగు జ్ఞానకర్మ రహితమగు కర్మకౌశలమును అవలంబించుచూ, తానే లేనను కర్తృత్వరహిత కర్మాచరణ ద్వారా జన్మరహిత స్థితిని బొందవలెనని ప్రబోధించుచున్నది. పైమంత్రభావమునే శ్రీమద్భాగవత కృష్ణ దేశిక ప్రభువులు తమ కందార్థములలో యిమిడ్చి, గ్రంథ నిర్మిత విధానమును శీర్షికలో యిట్లు వచించుచున్నారు.

**కం॥ ఆగామీ కథ యెట్లన॥ బాగుగ వివరింతు చెవుల॥ పండువు గాగన్ ఆగమనిగమోపనిష త్సాగర మధి తార్థమవల॥ సాంగోపాంగముగాన్॥ దయతో వినుడీ॥ సాంగోపాంగముగాన్॥ ప్రాగర్థ చరమార్థ యోగాములకు సం॥ యోగము గావించి నేగుర్తెరిగినదంత ....."**

ఆగమములు అనగా షడంగ, షడ్దర్శనాది శాస్త్రములు. నిగమములనగా వేదములు, ఉపనిషత్తులలో చెప్పబడిన ప్రాగర్థం = అపరావిద్యలు, చరమార్థం = పరావిద్య.

**శో॥ ప్రాగర్థం ప్రకృతీదేహం, చరమార్థంతు ఆత్మయో॥**

పరా అపరా విద్యలను సంయోగముచేసి కర్మసన్యాస (కర్మభ్రాంతి రహితం) జ్ఞాన లేక మోక్ష సన్యాస (బ్రహ్మైక్యభ్రాంతి రహితం) రూప అశరీర కర్మాచరణ పద్ధతిని, గురు ముఖంగా నేను గుర్తెరిగి, ఆరూఢత నొంది, మీకు తెలియజేస్తున్నాను అని సెలవిచ్చి యున్నారు, శ్రీ కృష్ణదేశిక ప్రభువులు.

## ఇక కేనోపనిషద్విషయం

ఇంతకు మునుపే చెప్పబడిన రీతిగా అష్టోత్తర శతోపనిషత్తులలో కేనోపనిషత్తు రెండవది. సామవేదమునకు సంబంధించిన దీయుపనిషత్తు. ఇందులో నాలుగు భాగములు (అధ్యాయములు) గలవు. మొదటి ప్రకరణమున 9 మంత్రములు. రెండవ ప్రకరణమున 5 మంత్రములు, మూడవ ప్రకరణమున 12 మంత్రములు. చతుర్థ ప్రకరణమున 9 మంత్రములు మొత్తం నాలుగు ప్రకరణములలోనూ కలిసి 9+5+12+9=35 మంత్రములు గలవు. మొదటి రెండు భాగాలు సంవాద రూపంలో ఇంద్రియదర్శన విచారణ ద్వారా ఆత్మతత్వానికి ఎలాగ చేరుకోవటమనేది వివరిస్తాయి. మనస్సును, ఇంద్రియాల కార్యకలాపాల నుండి వివక్షించి వేరు పరచడం ద్వారా ఆత్మను లేదా శుద్ధ చైతన్యాన్ని ఎట్లు సాక్షాత్కరించుకోవడమనేది వివరిస్తాయి. ఇంద్రియాలు ఆత్మను దర్శించడానికి బొత్తిగా సామర్థ్యం లేనివని వివరింపబడినది. మూడవ భాగంలో పై రెండు భాగాల్లోని సూత్రాలనే

కథారూపంగా వర్ణించినది. ఇందులో దేవతలే ఇంద్రియాలు. ఇక నాల్గవ భాగంలో కర్మపక్షంగా, కర్మపక్షంగానూ బ్రహ్మను గూర్చిన ధ్యానమూ, దాని ఫలితాలు వున్నాయి.

ఈఉపనిషత్తు **"కేనేషితం పతతి ప్రేషితం మనః"** అన్న ప్రశ్నతో ప్రారంభమైనది. "కేన" అనగా దేనిచేత అని అర్థం. ఆరంభంలోనే "కేన" అన్న పదముండుటవల్ల ఆపదం మీదుగానే "కేనోపనిషత్తు" అను నామధేయమేర్పడినదని వ్యాఖ్యాన కర్తలగు మహనీయుల అభిప్రాయం. "ఈశావాస్యం" అని ప్రారంభమైనందున "ఈశావాస్యోపనిషత్" అను పేరు వచ్చినట్లే, నిదిగూడ పై రీతిగనే యని విజ్ఞుల అభిప్రాయం.

కాని **"కేనర్షి" " కేనుడు"** అను ఋషిపుంగవుడు సామవేదాన్ని దర్శించి, తన దర్శనాను భవాతులను యిందు పొందుపరచి, లోకానికి ఉపనిషద్రూపంగా, అనుగ్రహించినందువల్ల ఆ ఋషి సత్తముని పేరట ఈఉపనిషత్తు **"కేనోపషత్తు"** అను నామధేయం దాల్చినదన్న గుప్త, సత్య విషయం **"ఉపనిషత్తులు-విశ్వరూప దర్శనం"** అన్న బృహద్గ్రంథంలో ద్యోతకమవుతున్నది. కఠోపనిషత్తు "కఠుడు" అను ఋషి ప్రోక్తమగుటవల్ల కఠోపనిషత్తను నామము దాల్చినట్టుల మరియూ తిత్తిరి పిట్టల కథ నటు ప్రక్కనుంచితే **"తిత్తిరి"** అను ఋషి వల్లభుని ప్రోక్తమగుటచే తైత్తిరియోపినిషత్తను నామము దాల్చినట్టులగానూ, "కేనర్షి" పేరట కేనోపనిషత్తు ప్రకటితమగుటలో నతిశయోక్తి లేదు.

ఇక కేనోపనిషత్తు పఠనాత్పూర్వము పఠనానంతరము విధిగా పఠించదగ్గ శాంతి మంత్రములు రెండున్నాయి. గురు శిష్యులిరువురూ ఈక్రింది రెండు మంత్రాల్ని ఏక కాలంలో పఠించెదరు.

**1 వ. శాంతి మంత్రం:**

**ఓం సహనావవతు సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై**
**తేజస్వినా వధీత మస్తు, మా విద్విషావహై**
**ఓం శాంతిః శాంతిః శాంతిః** (కృష్ణ యజుర్వేద శాంతి మంత్రం)

**అర్థం** :- అతడు (పరమాత్మ) మా గురుశిష్యులను కాపాడునుగాక, మేమిరువురం బ్రహ్మానందం అనుభవిస్తాముగాక. మేమిరువురం బ్రహ్మానంద ప్రాప్తికి కావలసిన బలం పొందుతాముగాక, మా అధ్యయనం తేజస్వంతం అవుతుందిగాక, మేము పరస్పరం ద్వేషించుకొనకుండా వుందుముగాక!

**2. వ శాంతి మంత్రం:**

**ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుశ్శ్రోత్రమథోబలమింద్రియాణిచ సర్వాణి,**
**సర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం,**
**మామా బ్రహ్మనిరాకరో దనిరాకరణమస్త్వ,**
**నిరాకణం మేఅస్తు తాదాత్మని నిరతే య ఉపనిషత్సుధర్మాస్తే మయిసన్తు తేమయిసన్తు"**
(సామవేద శాంతి మంత్రం)

**అర్థం :-** ఇది శిష్యుని ప్రార్థన : నా అవయవాలన్నీ దృఢంగా వుండునుగాక. అలాగే నావాక్కు, శ్వాస, చక్షువులు, శ్రోత్రాలు, ఇంకా సర్వేంద్రియాలు, బలోపేతమగునుగాక. ఉపనిషత్తులో చెప్పబడినదంతా బ్రహ్మమే (నాజీవిత వ్యాప్తులన్నీ సాధించడానికి కావలసిన నాకు కలుగుతుంది గాక).

నేను బ్రహ్మను నిరాకరించను. నన్ను గూడ బ్రహ్మ నిరాకరించకుండా (వదలకుండా) వుంటాడు గాక. మేము పరస్పరం నిరాకరించుకొనకుండా వుందుము గాక. ఉపనిషత్తులు ఏయే ఉత్తమ ధర్మాలను ప్రవచిస్తున్నాయో, అవన్నీ ఆత్మనిరుతులైన నాలో స్థిరంగా నిలచి వుంటాయి గాక!

ఔపనిషదమైన జ్ఞానం పట్ల శిష్యునికి గల శ్రద్ధాసక్తులు ఈమంత్రంలో సుస్పష్టం. అంతేగాదు "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అన్నట్టు శరీరం జ్ఞానసాధనకు ప్రధానం. శరీరం, దాని అంగోపాంగాలు అన్నీ శక్తిమంతాలై దృఢంగా, బలిష్ఠంగా వుంటేనే బ్రహ్మజ్ఞానార్జనకు మానవుడు అర్హుడౌతాడు. **"ఈసురోమని మనుషులుంటే, దేశమేగతి బాగుపడునోయ్"** అన్న గురజాడ వాక్యం మేరకు బలహీనులు, రోగ పీడితులు ప్రాపంచిక కర్మలకు ఎలా అనర్హులవుతారో అలాగే బ్రహ్మజ్ఞానానికిన్నీ, ఉపవాసాలు చేస్తూ వాయుభక్షణ చేస్తూ శరీరాన్ని కృశింపజేసి, తపస్సు చేస్తేనే మోక్షప్రాప్తి అవుతుందన్న అపోహ వేదకాలంలోనే కాదు, ఉపనిషత్కాలంలోగానీ లేదు. తర్వాత కాలంలో ఎప్పుడో, ఎలాగో ప్రవేశించింది.

నిజానికి శరీరం, అవయవ వ్యాపారాలు ఎంత బలిష్ఠంగావుంటే అంతగా బ్రహ్మనిరతి ప్రాప్తిస్తుందని పై మంత్రం బోధిస్తున్నది. బుద్ధ భగవానుడు సయితం మొదట శరీరాన్ని తపోనిష్ఠలో శుష్కింపజేసి, తర్వాత దాని అవాంఛనీయతను గ్రహించినాడు. ఇటీవలి కాలంలో స్వామి వివేకానంద సయితం మోక్ష సాధనకు దేహాన్ని శుష్కింప జేయడాన్ని నిరసిస్తూ అలా చేసేవాడికంటే ఫుట్‌బాల్ ఆటగాడు (శరీర సౌష్ఠవం చక్కగానున్న) బ్రహ్మ జ్ఞానానికి ఎక్కువ అర్హుడని వ్రాక్కుచ్చినాడు. **దేవాలయాన్ని** ఎంత పవిత్రంగా, పరిశుభ్రంగా వుంచుకుంటామో **దేవాలయాన్ని (ఆత్మకు నిలయం దేహం)** కూడా అంతే శుచిగా, శుభ్రంగా, పరిపుష్టంగా వుంచుకోవాలన్నది పై మంత్రం యొక్క ఆంతర్యం. **"దేహోదేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః" (ఉత్తరగీత)** అంతే తప్ప మనం మన చిలుం పట్టు (చిలుము గొట్టాలు త్రాగే) బైరాగుల్లాగా, హిప్పీల్లాగా మలిన దేహాలతో, వుండడం సరైన పద్ధతిగాదని పై సామవేద శాంతి మంత్రం ప్రబోధ చేయుచున్నది.

**ఆ॥వే॥ కడుపు బోరగించి, కన్నులు ముకుళించి**
**బిఱ్ఱ బిగుసుకున్న బీద యోగి**
**యముని బారి గొట్టె యతడేమి చేయును,**
**విశ్వదాభిరామ వినురవేమ॥**

మరియు

**"ఒడలు బడలజేసి యోగుల మనువారు**
**మనసుకల్మషంబు మాన్పలేరు**
**పుట్టమీద గొట్ట భుజగంబు జచ్చునా, విశ్వదాభిరామ వినురవేమ।**

ఆహార, పానీయాదులు విసర్జించి శరీరము శుష్కింపజేసి యోగ మార్గంలో శరీరాన్ని బిఱ్ఱ బిగించిన యోగు లెల్లరు చిత్త వృత్తిని చిక్క బట్టలేరు. మనస్సును శ్వాసతో చేర్చి బంధింతురే గాని, మనసు అను వస్తువును రహిత పరచలేరు. **మనోరహితవే (మనోలయంగాదు) జన్మరాహిత్యమని** అచల ఋషి వేమన జన్మరహితమునకు రాచబాట జూపినాడు. రాకపోకలేని అచల పరిపూర్ణ రాజయోగాన్ని తేట తేట ఆటవెలది పద్యాలలో లోకానికి చాటినాడు. సామవేద శాంతి మంత్ర సారాన్ని **కొండ అద్దంలో చూపినట్టుగా,** వేమన యోగి దర్శింపజేశాడు. పుట్టలోపలవున్న భుజంగమును (సర్పాన్ని) పుట్టపైన కొట్టితే ఎలాచావదో, అలాగే శరీరమను పుట్టలో వున్న "పాము అనే శ్వాసను" అంటి పెట్టుకుని మనస్సుండును. అచల పరిపూర్ణ ప్రబోధ రిత్యా శ్వాస నుండి మనస్సును శాశ్వతంగా వేరుపరచు పద్ధతి అచల ఋషి గురు పుంగవుల వద్ద గ్రహించినచో మనసు రహితమగును. మనోవియోగంచే "శ్వాస" అనే పాము (ప్రాణం) తనవునికి గోల్పోయి, బ్రహ్మాండ మందలి సమిష్ఠి ప్రాణములో చేరిపోవును. మనస్సు రహితమైనది కనుక మరొక్క ఉపాధిలోనికి ప్రాణముతో బాటు వచ్చి **చేరు (పునర్జన్మ పొందు)** అవకాశం కోల్పోయినది. ఇదియే గురుకీలు గురు రహస్యం. ఇది అచల పరిపూర్ణ పర బ్రహ్మము యొక్క ఉనికిని అచల ఋషులైన నిజగురువుల కృపకు పాత్రులై గ్రహించితేనే తప్ప సాధ్యపడదు. ఈగుహ్యాతి గుహ్య పరమార్థ సత్యాన్ని శ్రీ కృష్ణదేశిక ప్రభువులు తమ కందార్థములలో నిట్లు వెల్లడించినారు.

**౨౭ వ కందార్థం:**

"అన్నపు సూక్ష్మాంశము మన। సెన్నగ నీరంబు ప్రాణ। మెరుగుము। యీరెండెన్నడు కలియవో। నాడే సున్న సుమీ యెరుక మాట। సుగుణ సంపన్నా। కలసుటె యెరుక సుమీ యింతకన్నా। వున్నా దెరుక మూల మన్నది వినలేదు। ఈ భ్రాంతి నిన్నంట నివ్వాకు సుగుణ సంపన్నా----" యనియూ

**14౭ వ కందార్థం:**

"గురుడు పరిపూర్ణమునుజూ। పెరుకను లేందనుచు దెల్పి యికదల్పకు మంచెరిగించక। విడిపోవునె యెరుక। నరుల్ సాధనములు యెన్నిజేసిననూ లక్ష్యముద్రలెన్ని జూచిననూ। హరిహర బ్రహ్మమరాసుర ముఖులైన ధరణీ సురాద్యష్ట దశజాత్యుద్భవులాను। ఎన్నిజేసినను......" అనియు జనన మరణ రాహిత్య ప్రసాద సిద్ధిని గూర్చి అనగా అచల పరిపూర్ణ దర్శనమునూ సృష్టి కారణ బ్రహ్మము యొక్క ఉనికిలేని స్థితిని, దీనితో శాశ్వత మనో వినాశనమును, కృష్ణదేశిక ప్రభువులు లోకమునకు వెల్లడి చేసినారు.

ఈఉపనిషత్తు పీఠికకు ఆది యందు "బ్రహ్మ విజ్ఞాన పరిషత్తు" అని పేర్కొనడం జరిగింది. పరిషత్తు అనుమాటకు సమూహము, గోష్ఠి, దర్బారు అను అర్థములు గలవు. ఎట్లు యిది సమర్థనీయమో తెలుసుకుందాం.

పూర్వం ఒకానొకప్పుడు దేవదానవులకు గొప్ప యుద్ధం జరిగింది. సర్వనియంతయైన పరబ్రహ్మ సాహాయ్యం వల్ల దేవతలు దానవులను ఓడించగలిగారు. అయితే అజ్ఞానాంధకార గర్వంవల్ల తామే, తమ భుజబలంతోనే ఆ యుద్ధంలో గెలువగలిగామనే భావంతో వారు ఎవరికి వారు విర్ర వీగసాగినారు. అప్పుడు పరబ్రహ్మ దేవతల గర్వాన్ని అడచి, వారికి బుద్ధి చెప్పాలనుకుంది.

ఒక రోజు ఉదయమే అమరావతీ పట్టణంలోని నందన వనంలో సురరాజైన దేవేంద్రుని దర్బారు (రాజ కొలువు కూటం) వైభవంగా జరుగుచున్నది. ఆ తరుణంలో పరబ్రహ్మ (పరమాత్మ) అతి ప్రకాశమానమైన ఒక మహా "యక్షుని" రూపంలో, దేవతలకు కొంత దూరంలో ప్రత్యక్షమైనాడు. ఆ తేజోరూపం చూసి ఇంద్రునితో సహా, దేవతలెల్లరు విభ్రాంతులైనారు. ఆ శక్తి ఎవ్వరో, ఏమిటో వారికి తెలియలేదు. అప్పుడు దేవతలెల్లరు అగ్ని దేవుణ్ణి పిలిచి, ఓ జాత వేదా! మాబుద్ధికి అవగతంకాని తత్వమేదో ప్రత్యక్షమైంది. సర్వజ్ఞుడవు నీవు కావున నీవు వెళ్ళి ఆమహాశక్తి ఏమిటో తెలుసుకుని రమ్ము! అని పంపించారు. అగ్ని యక్షుణ్ణి సమీంచాడు. **"పృథ్వీస్థలిపై గల సమస్త వస్తువులను తృటిలో దహించగలనని"** ప్రగల్భ ప్రలాపములాడిన అగ్ని, యక్షుని ముందర ఒక చిన్న గడ్డి పోచను కాల్చలేక పోయినాడు. సిగ్గుతో తలవంచుకుని దేవతల వద్దకు తిరిగి వెళ్లి "అదేదో మహాశక్తి, అదేమిటో నాకు తెలియలేదు. నాశక్తి దాని ముందు పార లేదు" అన్నాడు. తర్వాత దేవతలెల్లరు యక్షుని వద్దకు వాయుదేవుణ్ణే పంపినారు. **"నేను ఆకాశంలో సంచరిస్తాను. అందువల్ల మాతరిశ్వుడను బిరుదు నాకు కలదు. విశ్వంలోగల సమస్త వస్తుజాలము నంతను తృటిలో ఎగురగొట్ట సమర్థుడను"** బీరములు పల్కిన వాయువుగూడా ఆమహాయక్షుని సమక్షమున చిన్న గడ్డిపోచను సైతం ఎగురు గొట్ట లేక గర్వభంగమై పరాభవంతో ఇంద్రుని సన్నిధి కే తెంచాడు.

ఇక గత్యంతరం లేక దేవతలెల్లరు ఆశక్తిని తెలుసుకుని రావడానికి దేవరాజైన ఇంద్రుడినే పంపడం జరిగింది. ఇంద్రుడు బయలుదేరి యక్షుణ్ణి సమీపిస్తుండంగానే ఆశక్తి రూపం అయిన యక్షడు అంతర్ధానమైనాడు. ఆ స్థానంలో దివ్యసౌందర్యవతి అయిన హైమవతి (పార్వతిదేవి) ప్రత్యక్షమైంది. ఆజగన్మాతను ఇంద్రుడు, ఇంతకు ముందు తిరోహితమైన శక్తి రూపం, ఎవరో తెల్పుమని ప్రార్థించాడు. ఉమాదేవి ప్రసన్నురాలై ఆ యక్షరూపమే పరబ్రహ్మమని, "మీరు అసురులను గెలిచింది ఆపరబ్రహ్మ శక్తి వల్లనే తప్ప మీ శక్తి వల్ల కాదు. మీకు ఆ యధార్థ విషయం తెలిపి బుద్ధి గరపడానికే ఆ పరబ్రహ్మ మీకు ఆ మహాయక్ష రూపంలో ప్రత్యక్షమయ్యాడు" అని చెప్పింది. దేవతలు తమ అజ్ఞానానికి,

ఆహంభావానికి పశ్చాత్తప్తులైనారు. అహంకారం మహా ప్రమాదకరమని, పునర్జన్మలకు జీవుణ్ణి బలిచేస్తుందని గురుగీత ప్రబోధిస్తున్నది. గురుగీత ద్వితయాధ్యాయం శ్లోకం 55

**"మహా హంకార గర్వేణ। తపో విద్యా బలేనచ**

**భ్రవన్తీ చాస్మిన్సం సారే। ఘటీ యంత్రం యథాపునః"**

అగ్ని, వాయువు, ఇంద్రుడు పరబ్రహ్మను సమీపించగలినందులకు గొప్పవారే కానీ, వైదిక దేవతల కంటె ఉపనిషత్ ప్రతిపాదితమైన బ్రహ్మమే అందరికంటే గొప్పదని అదే అన్నింటికీ మూలాధార శక్తి అని స్పష్టం చేశాడు. ఈఉపనిషత్తులో ఉపనిషత్కర్త **"కేనర్షి" (కేన ఋషి)**

కావున దేవతల పరిషత్తు (కొలువు కూటం) లో, పరబ్రహ్మ జ్ఞానాన్ని దర్శించడం జరిగింది. పీఠికా ప్రధాన శీర్షికకు, **కేనోపనిషత్తు బ్రహ్మ విజ్ఞాన పరిషత్తు"** అను నామధేయం గావించుట జరిగినది. కేనోపనిషత్తు నిజంగా బ్రహ్మవిజ్ఞాన పరిషత్తే గదా!

కేనోపనిషత్తు ప్రాచీనోపనిషత్తుల జాబితాలో చేరినది. 108 ఉపనిషత్తులలోనూ, త్రిమతాచార్యులు బాష్యాలు కూర్చిన దశోపనిషత్తులలోనూ రెండవది ద్వితీయ మయ్యూ, బ్రహ్మ విజ్ఞాన దర్శనంలో అద్వితీయం. భావంలో ద్వైతానికీ, విశిష్టాద్వైతానికీ, అద్వైతానికీ సంబంధపడే మంత్రాలు వున్నట్టే, **అచలపరిపూర్ణ సిద్ధాంతానికి సంబంధించిన మంత్రాలు** కూడా ఇందులో వున్నవి. ఇందులోని యితివృత్తాన్ని బట్టి అద్వైత సిద్ధాంత దర్శనానికే ఇది పట్టం గట్టినది. అయిననూ, కొన్ని మూల మంత్రముల భావం అచల పరిపూర్ణ సిద్ధాంత భావాలను ప్రస్ఫుటం చేస్తున్న దనుటలో సందేహం లేదు. వీటి వివరణ మున్ముందు పరిశీలిద్దాం.

కేనోపనిషత్తునకు వ్యాఖ్యాన కర్త అచలపరిపూర్ణ **శ్రీ మంత చిన్నయ్యగారు.** వీరు శ్రీ శివరామదీక్షిత అచలపరిపూర్ణ ప్రబోధ సాంప్రదాయకులు. వీరు సాంప్రదాయక గురువరేణ్యులైన **"శ్రీ ప్రబోధానందమల్లు వెంకటార్య రాజయోగి"** స్వాముల వారి యంతేవాసి మహబూబ్‌నగర్ నివాసి. గురుదేవుల చరణ సన్నిధిలో అచల పరిపూర్ణ సాంప్రదాయ సిద్ధాంతాన్ని చక్కగా అధ్యయనం చేసి, ఆరూఢ పరచుకున్న సిద్ధజ్ఞాన సంపన్నులు. ఎం.ఏ.బి.ఇడి. పట్ట భద్రులై ప్రభుత్వ కళాశాలోపన్యాసకులుగా సేవలొనర్చి, పదవీ విరమణ గావించి యున్నారు. తాను గురుపుత్రుడై, అటు గురు ఋణమును దీర్చుకొనుటకు ఉపనిషత్తులకు వ్యాఖ్యానములు వెలయించుచూ తద్వారా ఇటు లోక కళ్యాణమునకు గూడా శక్తి మేరకు ప్రయత్నించుచూ సత్సంప్రదాయక ప్రవరుడై వర్తిల్లు చున్నారు. వీరు యిటీవలికాలంలోనే పరిపూర్ణ ప్రబోధకు నాటపట్టయిన **"1. సర్వసార పూర్ణోపనిషత్తు, 2. అనంతోపనిషత్తు, 3. గురువాక్యోపనిషత్తు"** అను ఉపనిషత్రయమునకు హృద్యమునూ, సాంప్రదాయ బద్ధమునూ అయిన వ్యాఖ్యానములు వెలయించి గురుకృపకు పాత్రులైనారు. పై ఉపనిషత్రయ వ్యాఖ్యనాలు పాఠక మహాశయుల హృదయ రంజనములై, విశేషాదరణను

పొందియున్నాయి. పై మూడు ఉపనిషత్తులను, వారి గురుదేవులైన శ్రీ ప్రబోధానంద మల్లు వెంకటార్య స్వాముల దివ్య శ్రీ చరణముల కంకితం చేశారు. ఈ కేనో పనిషద్వ్యాఖ్యానమును సయితం **వారి గురుదేవుల పద రాజీవములపై**, చతుర్థ పూజా పుష్పంగా సమర్పిస్తున్నారు. వీరి గురుభక్తి ఎంతో ఆదర్శప్రాయమైనది. **"గురుస్సాక్షాత్ పరబ్రహ్మ"** అను గురు గీతా శ్లోక భావాన్ని యదార్థంగా దర్శించుకున్న శిష్యవరేణ్యులు, **సత్యదర్శనులు** శ్రీ చిన్నయ్యగారు. వీరు తమరు వ్యాఖ్యానించిన ఉపనిషత్తునకు నన్ను సంపాదకత్వం వహించి, పరిశీలించి, అనువైన సంపూర్ణ సమగ్ర సముచిత పీఠికను వ్రాయుమని కోరినందువల్ల **"సంపాదకీయం-అనుశీలనము"** అన్న శీర్షికతో నాయభిప్రాయమును, వెల్లడింప ప్రయత్నింతును.

చిన్నయ్యగారి వ్యాఖ్యానం హృదయోల్లాసమై, సరళమై, లలిత పద ప్రయోగాన్వితమై, తేనె సోకగానే నోరు తీయగనగునట్లు, చదివినంతనే శ్లోక భావం పాఠకులకు హృదయస్థమగును. స్థాలిపులాకన్యాయముగా **(కుండెడు అన్నములో ఒకటి రెండు మెతుకులను బట్టి అన్నం ఉడికినదో లేదో కనుగొను పద్ధతి)** ఒకటి రెండు ఉపనిషత్ శ్లోకాలను పరిశీలింతము.

**మొట్టమొదటి శ్లోకం : "కేనేషితం పతతి ప్రేషితం మనః"**

మనస్సు, ప్రాణములను తమ కర్తవ్యముల యందు అనగా సంకల్ప వికల్పముల యందు మనసునూ, ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియలలో, ప్రాణమును ప్రేరేపించునది ఎవరు? అనే ప్రశ్నకు వ్యాఖ్యాత సుదీర్ఘమగు వ్యాఖ్యాన మొసగి యున్నాడు. చివరకు అన్న పానముల సూక్ష్మాంశములైన మనః ప్రాణముల సంయోగమున ఏర్పడు ఎరుకయను జీవత్వమే మనః ప్రాణములను వాటి విధులందు ప్రవేశపెట్టు అధిపతి అన్నారు. అయితే మనః ప్రాణముల చేరికతో ఏర్పడు జ్ఞానము స్వప్న, సుషుప్తులలో ఏమైనది? అవిద్య యందు లీనమై అజ్ఞాన స్థితిని బొందుచున్నది. కావున జాగ్రత్, స్వప్న సుషుప్తుల యందు జరుగు క్రియలకు కూడా సత్తా మొసగుచూ సాక్షి మాత్రమై యుంటూ, మూడవస్థలలోనూ శ్వాస ప్రక్రియను నిరాటంకముగా నడిపించు చైతన్యమేదో అదియే ఆ ప్రత్యగాత్మ చైతన్యమే, అధిష్ఠానముగా పిండాండమందుండి నడిపించుచున్నది. ఇదియే పై శ్లోకమునకు సమాధానమని తెలియవలయును.

- **"ఇరువది ఐదు యింద్రియములు యివి ఆత్మగాదని ఇన్నిటినెరిగెటి ఎరుకయే పరమాత్మయని ఎఱింగి, సాంఖ్య యోగంబు సాధించి సజ్జనుండు ముక్తిజెందును నీ పాద భక్తితోనూ" - (భద్రాద్రి రామశతకం)**

కేనోపనిషత్తులోని ప్రారంభ శ్లోకమునకు భద్రాద్రిరామ శతకములోని 12వ పద్యం విపులమైన వ్యాఖ్యాన మొసగుచున్నది.

**3వ శ్లోకం : "నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్ గచ్ఛతినో నమః**
**నవిద్మోన విజానీమో యద్యైత దను శిష్యాత్!!"**

తా॥ : అచ్చటికి కన్ను, వాక్కు, మనసు పోజాలవు. కాబట్టి అది మాకు తెలియదు. ఎలాగున దానిని శిష్యులకుపదేశించ వచ్చునో ఆపద్ధతి కూడా మాకు తెలియదు. పై శ్లోక భావం నూటికి నూరు పాళ్ళూ అచలపరిపూర్ణ పరబాహ్యమునకే వర్తించును. కానీ మత కర్తలు దీనిని నిరాకార శుద్ధ చైతన్యరూప స్వయం ప్రకాశక తత్త్వమగు, సృష్టికి పూర్వమున్న తాత్కాలిక నిర్గుణమగు సృష్టి కారణ బ్రహ్మమునకే అన్వయించి యున్నారు.

శ్రీ కృష్ణ దేశిక ప్రభువరులు రచించిన కందార్థములలో 34వ పద్యం, పై శ్లోక భావాన్ని పూర్తిగా సమర్థించును.

"కం॥ పలుకున పలుకగ రాకను। తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్।
ములుగ్రుచ్చ సంధి లేకను। కలిగున్నది బట్టబయలు। గదరా మాయన్నా।
ఇదిగో చూడు కదులాదో యున్నా। పలుకన్న బలుకాక, తలపన్నదెరుగాక।
చలి యెండ వానాల నలయాక నిలుచుండు। గదరా మాయన్నా ........"

త్రికరణముల కందక ములు గ్రుచ్చసందు లేక త్రికాలా బాధ్యమై అచలపరిపూర్ణము శుద్ధ మనస్సునకు కూడా అగోచరమై ఎప్పటికి నొక్క రీతిగా నిలిచి యున్నది. దాని దర్శింపబోయిన మనస్సే రహితమై పోవుచున్నది. శుద్ధచైతన్యరూప బ్రహ్మమట్లుగాక (ఎరుక) శుద్ధమనసునకు గోచరమై "అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, తత్త్వమసి బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ" అను మహావాక్యములచేత నిర్ణయింప వీలగుచున్నది. అచల పరిపూర్ణపరబాహ్యమున కేనిర్ణయమూలేదు. అందుకే పరిపూర్ణము అటు మహావాక్యములచేతగానీ ఇటు అవాంతర వాక్యముల చేతగానీ : (1. ఓం ఇత్యే కాక్షరం బ్రహ్మ, 2. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, 3.సర్వంఖల్విదం బ్రహ్మ, 4. నేహనానాస్తికించిన. ఇవి అవాంతర వాక్యములు వార్తీక సిద్ధాంతాన్ని సూచించును. ఇవి వరుసగా కూటస్థ కూటస్థ వ్యాపక సాకార, నిరాకార బ్రహ్మలనే నిర్ణయించుచున్నవి). నిర్ణయించుటకు వీలు కానిది. కావున శ్రీ కృష్ణ దేశిక ప్రభువరులు కందపద్యములు 145 నందు యిట్లు ప్రబోధించియున్నారు.

కం॥ ఏ నిర్ణయమును చేయుడు। నేననని మహాత్ముడెపుడు।
నేనను వాడే నానావిధాల వదరును। నేనను తనవంటి వారినెప్పుడు గనినన్॥

నేను అను వాడే (బ్రహ్మైక్య భ్రాంతి గలవాడు) నాల్గు మహావాక్యములను, నాల్గు అవాంతర వాక్యములను ఎల్లప్పుడూ వల్లె వేయుచుండును. నేనని వాడు (బ్రహ్మ భ్రాంతి లేనివాడు) నేను, నీవు అనగా బ్రహ్మమూ, నేనూ, నేనే బ్రహ్మము అను నిర్ణయము లేక అశరీర స్థితిలో, లేనివాడై యుండును. పై జెప్పిన మాటలు లేక వుండును.

## భగవద్గీత యందు సాంఖ్య యోగం

**23వ శ్లోకం :** **నైనం ఛిందంతి శస్త్రాణి నైనందహతిపావకః**
**న చైనం క్లేదయాంత్యాపో న శోషయతి మారుతః!!**

**24వ శ్లోకం : అచ్ఛేద్యో ఽ యమదాహ్యో ఽ యమక్లేద్యో ఽ శోష్యఏవచ**
**నిత్యః సర్వగతః స్థాణు రచలో ఽ యం సనాతనః ॥**

అన్న శ్లోకాలు అచలపరిపూర్ణ దర్శనాన్ని ప్రదర్శిస్తూ ఉపనిషత్ శ్లోక భావాన్ని కందార్థ కంద పద్యముల భావాన్ని స్థిర పరచుచున్నవి.

పైని పేర్కొనబడిన ఉపనిషత్తులోని 3వ మంత్రమునకు సామ్యముగా వ్యాఖ్యాత **ఋగ్వేదీయ సూక్తం దశమ మండలంలోని 129వ మంత్రాన్ని** పేర్కొన్నారు.

**మంత్రం : "నా సదా సీన్నో సదాసీత్త దానీం! నాసీద్రజో న్యోవ్యోమో పరోయత్!**
**కి మావరీవః కుహకస్య శర్మన్! అంభః కి మాసిద్గహనం గంభీరం!!**

**అర్థం :-** అప్పుడు (సృష్ట్యాదిలో, సృష్టికి ముందు) సత్తు (ఉండడం, Existence) అసత్తు (ఉండక పోవడం, Non-Existence) అనేది లేదు. అంతరిక్షాకాశములు లేవు. దాన్ని ఏది ఆవరించి వుంది? ఎక్కడ? దానికి ఆశ్రయం ఏది యిచ్చినది? అక్కడ గహనం, గంభీరం అయిన అంభస్సు (జలరాశి,Chaos) వుందా? పై మంత్రం ఋగ్వేదానికీ, వేద వాఙ్మయానికి తలమానికం. ప్రపంచ వాఙ్మయ చరిత్రలోనే విలక్షణం, అత్యంత విశిష్టం అయిన గొప్ప సూక్తం. దీనిని సృష్టి సూక్తం (Hymn of Creation) అంటారు. "నా సదాసీత్" అని ప్రారంభమవుతుంది. కనుక దీనిని "నా సదీయ సూక్తం" అని కూడా వ్యవరిస్తారు. ఈమంత్రం సర్వలక్షణ విలక్షణమగు కేవల పరిపూర్ణ పరబ్రహ్మమును అభివర్ణిస్తున్నది. **"సత్తు" అనగా కూటస్థ బ్రహ్మము. "అసత్" అనగా కూటస్థ వ్యాపకం"** పరమాత్మ సద సద్రూపుడు. సదసద్రహితమే అచల పరిపూర్ణము. ఇది "అంభస్సు" రూపకమగు పరమాత్మాతీతమయినది. సృష్టికి కారణము జలమే అని **"ఐతేరేయోపనిషత్తు"** వక్కాణించుచున్నది.

శ్లో॥ స ఇమాన్ లోకానసృజ తాంభో, మరీచి మరమాపోఽదోఽంభః పరేణదివం
ద్యౌః ప్రతిష్ఠాంతరిక్షం మరీచయః, పృథివీ మరోయా అధస్తాత్తా ఆపః
(ఐతిరేయం శ్లో 2)

ఇందులో జలతత్వం నాల్గు విధములుగా అభివర్ణింపబడి యున్నది.

1. అంభః = సూర్యగోళమునకు పైనుండు దివ్య యలౌకిక స్వయం ప్రకాశం. (సూర్యోపాధి సృష్టికి కారణ భూతమైనది)
2. మరీచిః = సూర్య కిరణా వరణము.
3. మరుత్ = భూమిపై యున్న జలతత్వం.
4. ఆపః = భూమిలోపల యున్న జలతత్వం.

ఇందు అంభోతత్వమే పరమాత్మతత్వం. ఇది వర్ణరహితమై ఆవరణ రూపంగా

వ్యాపించియున్నది. అవర్ణమయమైన అంభోతత్వం (పరమాత్మ) స్వీయశక్తి యగు త్రిగుణాత్మక ప్రకృతి ద్వారా కాలాన్ని, స్థలాన్ని సృష్టించి సాలెపురుగు **(ఊర్ణనాభి)** తననాభి యందుత్పన్నమైన దారముచే ఆవరణ రూపమగు గూడు నిర్మించి నటుల, అందులో తన ఆవరణ రూపంలో పూర్ణంగా వ్యాపించి యున్నాడు. ఈఆవరణ రూపమగు పూర్ణమునకు, అతీతమైనది, నిరావరణమగు అచల పరిపూర్ణము.

**"ఆవరణము నాకసము। నిరావరణము నచలమనుచు అనిరి మహాత్మల్।"** అని కృష్ణదేశికేంద్రులవారు పలికియున్నారు.

**శ్లో॥ య ఏకో ౭ వర్ణో బహుధా శక్తి యోగాద్**
**వర్ణా ననేకాన్ నిహి తార్థో దదాతి!**
**విచైతి చాంతే విశ్వమాదౌచ దేవః**
**సనో బుద్ధ్వా శుభయా సంయునక్తు** (శ్వేతాశ్వత రోపనిషత్తు-1)

"స్వయంగా రంగులేనివాడై స్వీయ శక్తి సహాయంతో అనేకములైన రంగులను పలు విధాలుగా తన అనూహ్యములైన ఉద్దేశాల కోసం సృష్టిస్తూ తదకు యావత్ప్రపంచాన్ని తనలోనే లయం చేసుకుంటూ ఉన్న ఆదివ్య పురుషుడు మాకు శుభ చింతనల ననుగ్రహించుగాక!" అంటూ పరమాత్మ తత్వాన్ని బహు చక్కగా వర్ణించింది ఉపనిషత్తు. ఈపరమాత్మయగు తత్వాతీతమే ద్వయదోషరహిత సదసద్రహిత అచల పరిపూర్ణం. సర్వాతీతమూ, సర్వ వ్యాప్తమూ, అంభోరహితమూ, వర్ణరహిత వివర్ణ పరమాత్మ కావలదే అచలపరిపూర్ణం, అని నాసదీయసూక్తంలోని **"నాసదాసీన్నో"** అను మంత్రం ప్రకటపరచుచున్నది.

**ఇచట ముఖ్య గమనిక:-**

"అవర్ణ" అనగా రంగులేని పరమాత్మ స్వరూపం, అంభోతత్వం ఎలాంటిది? త్రిగుణాత్మకమగు పరమాత్మశక్తి యగు ప్రకృతి ఎలాంటిది? సదసద్రహితమగు అచల పరిపూర్ణ దర్శనం ఎలాగు అన్న నిగూఢ విషయాలను నిజ గురువుల సన్నిధిని మాత్రమే గ్రహింపవలసి యున్నది. అన్ని వర్ణములను తన యందే నిక్షిప్త పరచుకుని, తాను మాత్రం కేవలం "అవర్ణం" అనగా రూపరహితంగా వర్ణింపబడుతున్న పరమాత్మ తత్వం గురుముఖతః దర్శించినచో దీనికి అతీతమగు అచలపరిపూర్ణ దర్శనం లెస్సగా అనుభవమునకు వచ్చును.

ఆదిగురువగు దక్షిణామూర్తి వారు సనక సనందాది మునులకు మౌన ముద్రాధారియై అచల పరిపూర్ణ సూచన చేశారని, తత్సూచనతో మునులెల్లరూ సంశయ నివృత్తి గావించుకొని రనియూ, దక్షిణా మూర్తి చరిత్ర తెలుపుచున్నదను సత్య విషయాన్ని వ్యాఖ్యాత వెల్లడించియున్నారు. దక్షిణా మూర్తి ఎవరు? ఒక వ్యక్తియా? అన్న సంశయం మొలకెత్తుచున్నది. ఇందుకు సమాధానంగా **దక్షిణా మూర్త్యోపనిషత్తు** దక్షిణామూర్తి తత్వాన్ని గూర్చి యిలా విశదీకరించుచున్నది.

**శ్లో॥ "శేముషీ దక్షిణా ప్రోక్తాసా యస్యా భీక్షణే ముఖమ్**
**దక్షిణాభి ముఖః ప్రోక్తా శివో౽ సా బ్రహ్మవాదిభిః"**

విశ్వదర్శనమున పరమాత్మకు శేముషీ (శుద్ధ జ్ఞానము) ముఖము. అనగా పరమాత్మ సర్వజ్ఞుడు. సర్వద్రష్టయని భావము. దక్షిణామూర్తి యనగా సర్వజ్ఞుడు, సర్వద్రష్ట యగు (Omniscient and All-Perceiving) శుద్ధ చైతన్య రూపమగు పరమాత్మ తత్త్వమే యని భావం. ఈతత్త్వమే భగవద్గీత యందు పురుషోత్తముడని ఉత్తమ పురుషుడని గానం చేయబడియున్నది. ఉత్తమ పురుషుడు అచలపరిపూర్ణ పరబాహ్యమును దర్శించి అందు తాను లేని వాడై అశరీరుడై యున్నాడు. ఈతత్త్వ నిరూపణమే "దక్షిణామూర్తి తత్త్వం". దక్షిణామూర్తి తాను మౌన వ్రతుడై శిష్యులగు సనక సనందాదులకు ప్రబోధ చేయుట చూడగా అచలపరిపూర్ణ దర్శనంతో మాటలేనివాడై తాను అను భ్రాంతి లేక మౌనము బూనుట. **"తన్నివృత్తిర్మోక్షః"** తన్నివృత్తి యందే అనగా నేనను ఎరుక లేక పోవుటే శాశ్వత జన్మరహితరూప మోక్షమని పై శృతి వాక్యమున కర్థం. **"ఔను కాదనక, నీవనక, నేననక నొక్కమేనైన తాగాక మితిమీరి యున్నాది మాటాడదేమి, ఎరుకే లేదు మాటాడదేమి"** అన్న కృష్ణ దేశికుల కందార్థ భావమే దక్షిణామూర్తి వారి మౌన బోధ. **"ఒంటుకుదావల బింద్వోం। ట్లంటించిన కొలది లెక్కయధికంబగు నా। వొంటుకు వలపల బింద్వోక। టంటించిన లెక్క ఉళ్ళక్యోగదనోయీ। వొంటుండీ లేందౌ గదనోయీ। తంటాదీరును జూడు దానివలెనే యెరుక। కంటె బయలును తాను గిలిగుండి తనకుళ్ళక్యోగద నోయీ। వొంటుండీ లేందౌ గదనోయీ॥" క.ద. 276**

అంటూ తన రహితస్థితి (ఎరుకను అహంరహిత స్థితిని) కృష్ణ ప్రభువులు ప్రస్ఫుట పరిచారు. ఇదీ దక్షిణామూర్తి తత్త్వ నిరూపణ.

**ఉపనిషత్తుందలి 5వ మంత్ర భావాన్ని పరిశీలింతము**
**"ఏది వాక్కుచే వ్యక్తి పరచబడజాలదో దానినే నీవు బ్రహ్మము అని తెలుసుకొనుము"**

మాటలచేత ప్రకటించబడజాలనిది మాత్రమే బ్రహ్మమని తెలుసుకొనుము అనిభావము. మాట అనగా నేమి? "ఓం" అను ప్రణవనాదమే ప్రప్రథమంగా ఆవిర్భవించిన ధ్వని లేక నాదం. ఓం కారం నుండియే పంచబీజాక్షరములగు **అం, యం, రం, వం, లం** అక్షర సమన్వయం కలిగి, ఒక్కొక్కదాని నుండి పదేసి పదేసి అక్షర క్రమం వెలువడి పంచాదశక్షరములై **(50)** అక్షరమాల యేర్పడి సమస్త వాఙ్మయమేర్పడి, తన్మూలమున వేద వేదాంత, శాస్త్రనిచయమెల్ల ఏర్పడినది. ఈవేదాలలోని మాటలే **(వాక్యాలే)** మహావాక్యములనీ, అవాంతర వాక్యములనీ నిర్ణయింపబడినవి. ఈవాక్య సముదాయం వల్లనే సగుణ, నిర్గుణ రూప పరమాత్మ యొక్క నిర్ణయ పద్ధతి మతకర్తల ద్వారా నిర్మాణమైయున్నది. పై మహావాక్య మరియూ అవాంతర రూప వాక్యములకు **(మాటలకు)** అందునది పరమాత్మ తత్త్వమేగాని, అచల పరిపూర్ణముగాదు. ఇది మాటల కందనిది. మాటలకెల్ల మూలమైన "ఓం" కార

రహితమైనది. ఓం కారము యొక్క లక్ష్యార్థమైన శుద్ధ చైతన్యమున కవ్వలిది. కావున ఒక్క పరిపూర్ణ పరబాహ్యం మాత్రమే ఏ వాక్కునకు అందనిది. వ్యక్త పరచబడనిది. దీనినే కృష్ణదేశిక ప్రభువు యిలా ప్రకటపరచారు.

**కం॥2॥ మాటలేనట్టి బయలున॥ మాట గలిగె ననుట వినుట మాయ॥ గదయ్యా॥**
**మాట మాయైతె మానెను॥ మాటను మాట్లడి మనము॥ మానుద మవలన్॥**

**తా॥** మాట అనగా శబ్దము అదే "ఓం" నేను జ్ఞానము ఇవన్నీ యొక్కటే. దీనికే ఈపద్యములో "మాట" అనే పదము ప్రయోగింపబడినది. మాటలేనట్టి బయలున **(నేను లేనట్టి-ఓం లేనట్టి)** పరిపూర్ణములో "నేను" కలిగెననుట మాయ. అనగా లేనిదే ఆభాస రూపముగా కల వలె తోచినది అని చెప్పుట. అయినా ఆ నేను గురించి ఆసాంతము విచారించి, అది లేదని గురుముఖతా గ్రహించి దానిని విడచుటయే జన్మరాహిత్యం అని పద్య భావం.

ఇచట వాక్కుల కందనిది అచల పరిపూర్ణమే కానీ, సృష్టికి పూర్వమున్న పరమాత్మతత్వమగు ఉత్తమ పురుషుడుగాదు. ఒక్క వాక్కునకే గాదు, మనస్సునకు గూడ గ్రాహ్యంగానిది అచల పరిపూర్ణమేనని తెలియదగును. ఎట్లన తెలియదగిన వస్తువున్నప్పుడే మనసు భాసించును. తెలియదగిన వస్తువు లేనప్పుడు మనస్సు **"అహంబ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ"** బ్రహ్మమునేనైతిని, బ్రహ్మమునేనైయున్నాను అను అనుభూతి కోల్పోయి తాను, తన స్వస్వరూపమగు బ్రహ్మమునందు నిలువక, తానే రహితమై, తన యునికి కోల్పోవుచున్నది. "మనోరహిత మిదం మోక్షం" మనసు రహితమగుటే మోక్షమని శృతివాక్యం పలుకుచున్నది. అధర్వణ వేదాంతర్గత శాండిల్యోపనిషత్తు యిట్లు వాక్రుచ్చుచున్నది.

**శ్లో॥ "జ్ఞేయవస్తు పరిత్యాగే విలయం యాతి మానసం॥**
**మానసం విలయం యాతే కైవల్య మవశిష్యతే॥**

"తెలియదగినది (జ్ఞేయము) లేనపుడు మనస్సు నాశనము పొందుచున్నది. మనస్సు నాశనము నొందుచుండగా పరిపూర్ణ పరబాహ్యమే శేషించును" అచల పరిపూర్ణ పరబాహ్యము మనస్సున కందదుగనుక మనస్సు నాశనమొందును. జన్మరాహిత్యసిద్ధి కలుగును. ఈరీతిగా 6వ శ్లోకము గూడా పరిపూర్ణ పరబాహ్య ఉనికినే వర్ణించును. అంతేగాక, పరిపూర్ణ స్థితి యందున్న ఆరూఢమతి, అశరీర పద్ధతి యందుండును గాన, అనగా తానను "అహం" లేనట్టి స్థితి యందుండును గాన, తానే లేనప్పుడు అచలమున్నదనిగానీ, ఎరుక (తాను) లేదని నిర్ణయముగానీ లేకుండ నుండును.

"నిత్యా నిత్యములను నిర్ణయ మెరుగాక॥ నిత్యుడై యుండేటి నిజబోధ
గలిగితే చాలు చాలన్నా వానితోటి సాటెవ్వరన్నా॥"

అంటూ అశరీర స్థితిని గూర్చి కృష్ణ దేశికులు గానం చేశారు.

విస్తరిస్తూపోతే పీఠికయే ఒక ప్రత్యేక పార్శ్వభాగమగును. గ్రంథ విస్తృత భీతిచే సార వంతమగు ఒకటి, రెండు శ్లోక భావములను ప్రకట పరచడమైనది. ఇక చివరగా 3వ అధ్యాయమందలి **11వ మంత్రమును** వివరించి, పీఠికకు స్వస్తి పాఠం పలుకబడును.

ఇంద్రుని రాజ దర్బారు నందు ఒక అలౌక్యమగు దివ్య ప్రకాశముతో ఒక యక్షుడు ప్రత్యక్షమైనట్లు, యిదివరలోనే తెలుసుకున్నాము గదా! ఆ యక్షుని సామర్థ్యమేమిటో తెలిసికొనుటకు వాయువు, అగ్న్యాది దేవతలు, శక్తిహీనులై తిరోగతి పాలైయ్యారు. ఇక యక్షుని సామర్థ్యమదేమిటో ఆ స్వరూపమేమిటో తెలుసుకొనుట రాజరాజైన దేవేంద్రుని వంతైయునది. గర్వోన్మత్తతో గూడుకొన్న అజేయమైన వజ్రాయుధ ధారియగు ఇంద్రుడు, యక్షుని సమీపించగనే యక్షుడదృశ్యమయ్యాడు. ఇచట "ఇంద్రుడు" అనగా అంతరాత్మ లేక అంతఃకరణము మరియూ మనస్సు అని నిఘంటువు **(లఘు శబ్దార్థ దీపిక)** వాసగు చున్నది. శుద్ధమైన జ్ఞానము, పృథ్వీ తత్వ కఠినాంశముతో చేరినపుడు అహంకారముగా పరిణమించునని సాంఖ్యము ప్రబోధించుచున్నది. అహంకారమను అంతరింద్రియమునకు అధిష్ఠాన దేవత రుద్రుడు. **"రోదయంత్యనురా ఇతిరుద్రాః"** దుష్టులను లేక అజ్ఞానాహంకారపూరితులైన అసుర గణములను దుఃఖింపజేయువాడు అని రుద్రశబ్దార్థము. అందుకే దేవరాజయినను అహంభావ పూరితుడైన ఇంద్రునకు పరబ్రహ్మ స్వరూపము గోచరింపక అదృశ్యమైనది. ఇంద్రుడు రుద్రుని చేతిలో చిక్కినాడు. రుద్రుడు అహంకార పూరితులను జనన మరణ దుఃఖ భూయిష్ఠమగు ప్రవాహమున బడివేయును. అందుకే పరబ్రహ్మ స్వరూపమయిన యక్షుడు ఇంద్రునకు దర్శనమీయలేదు. ఇట యక్ష శబ్దమునకు **"యక్ష్యంతే పూజ్యంతే యక్షాః"** అని అమరకోశం వ్యుత్పత్త్యార్థమునిచ్చు చున్నది. పూజింపబడువాడు యక్షుడు త్రిమూర్త్యాది సమస్త దేవతలచే పూజింపబడు వాడు యక్షుడు. అనగా పరమాత్మయే అని అర్థము.

**శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మావిష్ణు మహేశ్వరాః**
**సామర్థ్యమ భజనస్సర్వే సృష్టి స్థిత్యన్త కర్మణి॥ - గురుగీత**

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలైన వారందరును గురుకృపను బొందుటచేతనే సృష్టి స్థితిని ప్రళయాదులు చేయు శక్తి గలవారైరి అని పరమాత్మ శక్తి సామర్థ్యములను గురుగీత కొనియాడుచున్నది. కనుక "యక్ష" శబ్దముచే పరమాత్మ సూచింపబడు చున్నాడు.

యక్షుడదృశ్యమవగానే నా స్థానమందు **"లీలా శరీర ధారిణి"** యగు ఉమాదేవి ప్రత్యక్షమయి, ఇంద్రునకు "యక్ష" రూపమే పరబ్రహ్మయని తెలిపెను. అహంకారులకు దర్శన మీయనిది మాయయే కదా. ఇచట ఉమా అను పదము యొక్క అర్థమును గైకొందము. **ఉమా = శివుని యొక్క, మా = మాన శక్తి (పరిమాణ శక్తి లేక వ్యాపకతా శక్తి)** యని "ఉమాసహస్రము" అను గ్రంథమర్థ మొసగుచున్నది. పూర్వము పార్వతీదేవి ఆహార పానీయముల విసర్జించి, తపము చేయుచుండెనట. అపుడు తల్లియగు మేనక

(హిమవంతుని భార్య) ఉ = అమ్మాయీ, మా = తపము చేయవద్దు అని తపమును నిషేధించెనట. అప్పటి నుండియే పార్వతీ దేవికి "ఉమా" అను నామము కలిగినదని పై గ్రంథము వివరించుచున్నది. ఈవిషయమే కవికులగురువగు కాళిదాసు మహాకవి యిట్లు మనో రంజకంగా గానం చేయుచున్నాడు.

**శ్లో॥ ఉమేతిమాత్రా తపసో నిషిద్ధా**
**పశ్చాదు మాఖ్యాం సుముఖీజగామ॥**

తల్లిచే తపస్సు నిషేధింపబడి, పార్వతీదేవి ఉమాదేవి యయ్యెను.

దీనిని బట్టి ఉమా యనగా పరమాత్మ యొక్క శక్తి. అనగా ప్రకృతి. ప్రకృతీ పరమాత్మలయేకైక రూపమే "ఎరుక" యనీ, అచల ఋషి పుంగవుల సిద్ధాంతము. ఇదియే జగత్కారణ బ్రహ్మము. నిరాకారము బ్రహ్మము-సాకారము ప్రకృతి. సృష్టికి పూర్వము బ్రహ్మను. తర్వాత జగత్తు మరియు జీవ నిర్ణయము. జీవ, జగత్తుల సృష్టి కారణమగు బ్రహ్మయే ఉత్తమ పురుషుడు లేక పురుషోత్తముడు. ఈ అనిర్వచనీయ తత్త్వమే దక్షిణామూర్తి తత్త్వము. దక్షిణా-అనగా శుద్ధ చైతన్య జ్ఞాన స్వరూపమని యింతకు ముందే తెలుసుకున్నాముగదా. ఈదక్షిణామూర్తి తత్త్వమే అచల పరిపూర్ణ పరబాహ్యమును దర్శించి, అందు తా లేనివాడై, అశరీరుడై యశరీర పద్ధతియగు అచల పరిపూర్ణ ప్రబోధను విష్ణువునకు **(సర్వవ్యాపకతత్వం)** ప్రబోధించినట్లుగా సర్వసార పూర్ణోపనిషత్తులోని ప్రథమ శ్లోకము వివరిస్తున్నది.

**శ్లో॥ అధ వైకుంఠో నీలకంఠం ప్రణమ్య స్వామిన్ సర్వలోకైక నాథ॥ బ్రహ్మై**
**వాహం భ్రాన్తి నాశం కురుష్వ॥ ఈశ ఏతద్వ్య పో వ్యాపరాత్పరం పూర్ణము**
**పైతి నాథో॥ విష్ణోర్భక్త్యా సమాదరాత్వంచ వక్త్ర ఉవాచ॥**

"ఇందు బ్రహ్మైవాహం భ్రాంతి నాశం కురుష్వ" అనగా నేను బ్రహ్మనైతిని అను భ్రాంతిని నాశనం చేయుమని మహావిష్ణువు పరమ శివుని కోరెను. శివాశివ తత్త్వమగు ప్రకృతీ పరమాత్మరూప బ్రహ్మము యొక్క భ్రాంతిని అనగా ఆవరణమును దాటితేనే అచలపరిపూర్ణము యొక్క శాశ్వత యునికి గోచరమగును. **"తథాతీతం అచలం"** అన్నట్లు ఎరుక రహితమునందే పరిపూర్ణము ప్రత్యక్షము. ఇందులకు 'నేనే బ్రహ్మమయితిని" అను మహావాక్యముల యందలి భ్రాంతిచే, బ్రహ్మమే నిలిచి యున్నది. అందులో కించిజ్ఞుడను జీవుడు లేడు అను అవాంతర వాక్య భ్రాంతిని విసర్జింపవలెను. అప్పుడే ద్వాదశాక్షరీమంత్ర ప్రభావము వలన అచల పరిపూర్ణ దర్శనము, షోడాశక్షరీ మంత్ర ప్రబోధవల్ల నీ యొక్క ఉనికి రహితమగుచున్నది. ఇదియే జనన మరణ రహితాచల ప్రబోధ. ఇది అచల ఋషి పుంగవుల సనాతన సాంప్రదాయ సిద్ధాంతము.

ఉత్తమ పురుష స్థితి యందుండి, ఆపై అచలపరిపూర్ణ పరబాహ్య దర్శనము గురుముఖమున చేయవలెను. దీనినే గురుగీత యిట్లు అభివర్ణించు చున్నది.

**శ్లో॥ స్వయం బ్రహ్మమయో భూత్వా। తత్పరం చావలోకయేత్।**
**పరాత్పర తరం నాన్యత్। సర్వగం తన్నిరామయం॥ -212**

శిష్యుడు తాను బ్రహ్మ.స్వరూపియై ఆపిమ్మట దానికతీతయగు పరస్వరూపమగు కేవలాత్మను **(పరిపూర్ణమును)** దర్శించును. అట్టి పరస్వరూపమగు పరిపూర్ణముకంటే అన్యమేదియును లేదు. అది యంతటను నిండి యుండు నదియును, నిరామయమైనది నైయున్నది. అది దేనికిని ఆధారముకాదు. కావున శివాశివ రూపమైన బ్రహ్మ।భ్రాంతి రహితమునందే అచల పరిపూర్ణము ప్రత్యక్షము. అందులకే నేనే బ్రహ్మము, బ్రహ్మమేనేనైతి అనుభ్రాంతియే సర్వ భ్రాంతులకు, సర్వాహంకారములకు మూలము. ఇంద్రుడు అను మనస్సు "నేనే బ్రహ్మమును" అన్న అహంకారం కోల్పోయినపుడే అచల పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క సర్వాతీత యునికిని దర్శించుకొనుచూ, గురు కృపాకటాక్షంచేత జన్మరహితము నొందుచున్నాడు. పునరావృత్తి రహితమగు **"రాకపోకలు లేని రాచబాటను"** అందుకొని జన్మ సాఫల్యత నొందుచున్నాడు. ఇలాంటి ధన్య చరితునకు జన్మనిచ్చినందువల్ల

**"కులం పవిత్రం జననీకృతార్థ**
**విశ్వంభరా పుణ్యవతీచ తేన"**

కులము, గోత్రము, జన్మనిచ్చిన తల్లిదండ్రులు, తర్వాత విశ్వంభరాదేవి అనగా భూమాత కూడా పుణ్యవతియగును అని శాస్త్రము ఘోషించుచున్నది. కృష్ణదేశిక ప్రభువులు

40 కం॥ అయమాత్మ యనినరీతిగ। నయముగ ఈబట్టబయలు నదుగో యనుటల్
అయమియ మనియనుటుళ్ళక్క। యయినను ననవంపె నీదుకీడుడుగుటకై।

శిష్యా! "అయమాత్మ బ్రహ్మ" అను మహావాక్యమును జెప్పి చూపించిన విధముగా చక్కగా ఈబట్టబయలును అదిగో అని చూపించుట సరియైనది కాదు. అయం, ఇయం అని చెప్పేదే ఉళ్ళక్కి, లేనిది. అయినా నీ గుర్తింపునకై నీవు తిరిగి పునర్జన్మకు రాకుండుటకై చెప్పి చూపింపరాని పరిపూర్ణమును అదిగో, యిదిగో అని చెప్పితిని.

అచలపరిపూర్ణ శ్రీ మంత చిన్నయ్యగారు మిక్కిలి శ్రమించి యిదివరలో ప్రధానములగు ఉపనిషత్తులకు వ్యాఖ్యానము గూర్చి సఫలులైనారు. ఈప్రయత్న పరంపరలో ఆవిర్భవించినదే ఈకేనోపనిషద్వ్యాఖ్యానం. నిండైన గురుకృపతో మెండైన అనుభవాన్ని సంతరించుకొని అచల పరిపూర్ణ సాంప్రదాయ సంస్కృతీ వికాసముకొరకై, సద్గురుపాదరవిందములకు పూజా కుసుమములుగా చతురోపనిషత్తులను **(అనంత, సర్వసార, గురువాక్య, కేన)** సువ్యాఖ్యాన పరిమళ సరీభూతమయం గావించి, త్రికరణ శుద్ధిగా సమర్పించి, అర్పించారు. చిన్నయ్యగారు సుదీర్ఘ పరిశ్రమతోబాటు, గురు కృపా ప్రసాదానుగ్రహమగు స్వీయ రచనా విలాసమును, అనుభవములను వెలయించి, నిబ్బరమగు శైలి నూహ పుట్టించునట్లు వ్యాఖ్యాన సరళిని పోహళించెననుటలో నతిశయోక్తికేమాత్రం

తావులేదు.

"మంత" వీరింటి పేరైయున్నది. "మంత" యనగా ప్రతిభా పాటవములు మేళవించుకున్న "సమాలోచనాపరుడు" అని నిఘంటువు అర్థమొసగుచున్నది. ఉపనిషత్తునకు వీరు సమకూర్చిన వ్యాఖ్యాన శైలి పరికింప వీరింటి పేరెంతో సార్థకత నొందుచున్నది.

గురు పరమాత్మ వీరికి, మరిన్ని మహత్తర్వ్రములగు యుపనిషత్తులకు చిరతరమగు వ్యాఖ్యానముల గూర్చి సాంప్రదాయ వికాసమునకు మరెంతో కృషి సల్పుటకు, దీర్ఘాయురారోగ్యయశ శ్రీ పరంపరల ననుగ్రహించి, జన్మరాహిత్య సిద్ధిని ప్రసాదించుగాక యని, గురు పరమాత్మ దివ్య శ్రీ చరణరాజీవముల ప్రార్థించుచున్నాడను.

కం॥

కేనోపనిషత్తున కెటు
ఏనాటికి మొక్కవోక నిలనిల్చెడివ్యా
ఖ్యానము గూర్చిన చిన్న
య్యా! నీ దరి ఎరుక నిల్పదయ్య సుమయ్యా।

"శ్రీ రాజయోగీంద్ర సద్గురు పాదార విందములకు జై"

అనంతపురం
26-11-2003

గురు పదసేవా నిరతుడు
**సత్యశోధనాచార్య నిత్యానంద కురుబ సుబ్బారాయుడు**

**Dr. A. B. Chandra Sekhara Raju,** M.A ..ph.D., A.P Educational Service(Retd.)
Ph.No. 08554-245264
Cell : 98496 83645



# సహృదయ సౌరభము

ఉదాత్తభావన, ఉత్కృష్టసాధన, ఉపకారచింతనల త్రివేణుల సంగమమే ఉత్తమ మానవ లక్షణానికి నికషోపలము. అట్టి వారికే ముముక్షత్వము, మహా పురుష సంశ్రయము లభించి తద్వారా పరమ పవిత్రమైన జీవిత లక్ష్యాన్ని సాధించే మార్గం సుగమమవుతుందని చెప్పాలి. మానవులకు పశు పక్ష్యాదులకు ఆహార, నిద్రా, భయమైధునాలు సామాన్య శారీరక లక్షణాలు. అయితే శ్రీ శంకరభగవత్పాదుల వారు 'వివేకచూడామణి'లో తెలియజేసినట్లు

శ్లో॥ దుర్లభం త్రయమేవైతత్ దైవాను గ్రహకారకమ్
మనుష్యత్వం, ముముక్షత్వం, మహాపురుష సంశ్రయః॥

తా॥ మనిషిగా పుట్టడం, ముముక్షత్వం (మోక్షాసక్తి) పై ఆసక్తికనబరచి తత్సాధనకై మహాపురుషులను ఆశ్రయించి పరమ పవిత్రమైన జీవిత లక్ష్యాన్ని - అనగా జనన మరణ చక్రబంధం నుండి ముక్తి పొందాలంటే, ప్రతి మానవుడు తానెవరు? తాను యెక్కడ నుండి వచ్చాడు? మరణించిన తర్వాత యెక్కడికి వెడతాడు? అనే ప్రశ్నలకు జవాబు తెల్సికోవడం మానవ ధర్మం అందుకే నచికేతడు, యమధర్మరాజు ప్రదానంచేయదలచుకొన్న వరాలన్నింటిని తిరస్కరించి, నిత్యమై, సర్వాతిశయమై, అనిర్వచనీయమైన సత్‌చిత్ ఆనంద స్వరూప జ్ఞానమైన బ్రహ్మ విద్యను ప్రసాదించమంటాడు.

శ్లో॥ అన్య విద్యా పరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్
బ్రహ్మ విద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తి కరంస్థితం॥ (శుకరహస్యోపనిషత్)

మానవుడు నేర్చిన అన్ని విద్యలు నశించునవే. కాని బ్రహ్మ విద్యా జ్ఞానం మాత్రం నిత్యమైనది. అదియే బ్రహ్మ జ్ఞాన ప్రాప్తిని కలుగుజేయును.

ప్రాచీన భారతావనిలో యెక్కడ నలుగురు జిజ్ఞాసువులైన విద్యావంతులు కలుసుకొన్నపుడు వారిలా అనుకొనేవారు:

**కోను ఆత్మాకి బ్రహ్మేతి (చాందోగ్యం)**

మన ఆత్మ యెవరు? బ్రహ్మమననెద్ది? యనియు

"కిరకారణం బ్రహ్మకుతః స్వజాతాజీవానుకేనక్వచ సంప్రతిష్ఠా" (శ్వేత)

సర్వకారణమైన యీబ్రహ్మ మెట్టిది? మన మెట నుండి జన్మించితిమి? ఎవరి వలన మనము జీవించుచున్నాము? తుదకు మనమెటకు పోయెదము? అని పలు ప్రశ్నలను గురించి చర్చించుకునే వారట.

అలాంటి జిజ్ఞాసువుల తపన తీర్చుటకోయన్నట్లు

"కృతయుగంలో వేదాంతసారాన్ని సాక్షాత్ జ్ఞానమూర్తియైన శ్రీ దక్షిణామూర్తి స్వరూపంలో అవతరించిన భగవానుడు మౌన వ్యాఖ్యతో బోధించాడు.

త్రేతాయుగంలో శ్రీ దత్తాత్రేయులవారి రూపంలో అవతరించిన భగవానుడు, స్వకీయా చరణం వల్లను, సదుపదేశంవల్లను, అస్తిక లోకాన్ని ఉద్ధరించాడు.

తరుపరి ద్వాపరయుగంలో శ్రీ వేదవ్యాసుల వారి రూపంలో భగవానుడుదయించి బ్రహ్మ సూత్రాల రచన గావించి, వినూత్న శోభలతో విజ్ఞాన సుధలు చిందించాడు.

కలియుగమందు శ్రీ శంకరభగవత్పాదుల వారి రూపంలో భగవానుడవతరించి ప్రస్థానత్రయానికి భాష్యాదులు రచించి, అద్వైతతత్త్వ ప్రతిష్ఠాప నాచార్యుడై, జ్ఞానప్రదాన వాదులై విరాజిల్లి, మహోపకారము చేసిన విషయం జగద్విదితమే.

ఈ నలుగురు మహా పురుషులు నాలుగు యుగాలలో అవతరించిన జ్ఞానమూర్తులు, జగద్గురువులు" (బ్రహ్మశ్రీ అనుములువేంకటశేషకవిగారు)

అట్టి మహాత్ములందించిన వేదాంత విజ్ఞాన వీచికల వలన సామాన్యులకు అవగాహన లేనటువంటి ఉపనిషత్తులు, అటు విద్యావంతులను, ఇటు జిజ్ఞాసువులను విశేషంగా ప్రభావితంచేశాయి. తత్ఫలితంగా, అప్పుడప్పుడు, అక్కడక్కడ, వేదాంత రచనలు, ఉపనిషత్ వ్యాఖ్యానాలు వివిధ సాహితీ రూపాల్లో వెలువడడం విజ్ఞాన పిపాసువులకు, మేధా వైరాగ్య సంపన్నులకు, సాధుపుంగవులకు, సత్సంగాసక్తులకు అభిలషణీయం, ఆమోదయోగ్యం, ఆహ్లాదదాయకం.

ఈ కోవకు చెందిన ఉపనిషత్ వ్యాఖ్యానాలలో శ్రీ మంత చిన్నయ్య గారి కలం నుండి జాలు వారిన రచన ఇది ఉపనిషత్తులలో అరుదైన ఆణిముత్య మన దగిన 'కేనోపనిషత్' శ్రీ మంత చిన్నయ్య గారి ప్రస్తుత రచనయే - కేనోపనిషత్ వ్యాఖ్యానము. వీరు అచల పరిపూర్ణ మార్గానురక్తులు, సద్గురు కృపాకటాక్ష వీక్షణ కాసారములందు నిరంతరము తేలియాడు బ్రహ్మజిజ్ఞాసువులు, విద్వన్మణులు, బహు భాషావిశారదులు. వీరి రచన రమణీయము. శైలి సరళము. వ్యాఖ్యానము సుగ్రాహ్యము. వీరందించిన వ్యాఖ్యానము, విపుల వివరణాత్మకమై సాహితీ సమారాధకులకు సమాదరణీయము,

వేదాంత విదులకు స్వాంతనకల్గించునదై, యలరారు చున్నదనుటలో అతిశయోక్తికానేరదు. వీరి అవిరళ కృషి ప్రశంశార్హము.

వీరి కేనోపనిషత్ వ్యాఖ్యానానికి పీఠిక వ్రాయమని, మన్మిత్రులు, సన్మిత్రులు మాన్యశ్రీ - సత్య శోధనాచార్య నిత్యానంద కురుబ సుబ్బరాయస్వాముల వారిని కోరుచునొక, వ్రాత ప్రతిని పంపారు. ఆ ప్రతిని యాదృచ్ఛికముగ నేను చూడ తటస్థించుట నాకబ్బిన మహదవకాశము. రచయిత యభీష్టముమేరకు వ్యాఖ్యానమునకు సంపాదకీయము నెరపి శ్రీ సుబ్బరాయస్వాములవారు "కేనోపనిషత్ - బ్రహ్మ విజ్ఞాన పరిషత్ - సంపాదకీయ అనుశీలనము" అనెడి పీఠిక వ్రాశారు. ఆ పీఠిక శ్రీ మంత చిన్నయ్య గారి వ్యాఖ్యానంలోని అనేక అంశాల కనుగుణమైన విశేష వివరణోపద్ఘాతము ఘనోద్ఘాతమై భాసిల్లుచు పండిత పామరజన రంజకమై యొప్పారుచున్నదనుట యదార్థము.

కేనోపనిషత్ అను శీర్షిక లోనే విశ్వసృష్టిలోని విశిష్టతను వివరించే అర్థం గోచరిస్తుంది.

'కేన' అంటే 'దేని వలన' అని అర్థం. ఈ చరాచర సృష్టికి మూల కారణమేమిటి? అనే అంశాన్ని ఆధ్యాత్మిక దృష్టితో పరిశీలిస్తే ఆంధ్ర మహాభాగవత రచన గావించిన మహత్వ కవిత్వ పటుత్వ కవితా స్రవింతిలో చదువరులను మందార మకరంద మాధుర్యమున నోలలాడించిన మహా కవి బ్రహ్మజ్ఞాని శ్రీ పోతనామాత్యుల వారి.

"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై.................. మూల కారణం బెవ్వడు" అను పసిడిపలుకులు భాగవత ప్రభ ప్రసరించు వెలుగు వెల్లువలో అంతర్లీనమైన తత్త్వార్థమే యీ మహా విశ్వానికి మూలాధారమెవరో తేటతెల్లము చేస్తున్నది.

మట్టి ముద్ద లాంటి మానవ శరీరంలో కన్పించే కదలికలు, మనస్సులో మెదిలే అలోచనలకు, పలికే పలుకులకు ప్రాణశక్తి రూపమగు, మహత్తర చైతన్యం యెలా ప్రసరిస్తున్నది? అనే ప్రశ్నలతో 'కేనో' పనిషత్ మొదలయింది.

ఈ ఉపనిషత్తంతా, ప్రశ్న సమాధానాలతో కూడిన గురు శిష్యసంవాదరూపంలో నడుస్తుంది.

ప్రతి ఉపనిషత్తు ఒక శాంతి మంత్రంతో ప్రారంభమౌతుంది. కాని యీ ఉపనిషత్తులో రెండు శాంతి మంత్రాలున్నాయి. ఇదియే యీ ఉపనిషత్ యొక్క ఆధ్యాత్మిక విశిష్టత.

శిష్యుల ప్రశ్నలకు సమాధానంగా, ప్రాణానికి ప్రాణం, మనస్సుకు మనస్సు నేత్రానికి నేత్రం అయిన మూలశక్తి ఒకటి ఉన్నదని చెప్పాడు మహర్షి. ఆ మూల శక్తిని తెలిసికోవటానికి, మనస్సు ఊహించలేదు. మన నేత్ర దృష్టి అంతవరకు ప్రసరించలేదు. అందుకే వాగ్మనోతీతమైన ఈ తత్త్వాన్ని:

"అగ్రాహ్యం, అవాచ్యం, అలక్ష్యం అచింత్యం" అని మాండుక్యోపనిషత్తు వివరించింది.

దీనిని యెవరైనా వివరించినా, ఆ పరమ రహస్యం అంతసులభంగా తెలియదట. కారణం? ఆ మూలశక్తియైన పరబ్రహ్మం, మనకు తెలిసిన విషయాలకు తెలియని తత్త్వానికి అతీతమైనది. బహుశ ఈయంశాన్ని వివరించటానికే శ్రీ శంకరభగవత్పాదులవారు, నిర్వాణషట్కములో

మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం.......

................శివోహం, శివోహం."

అంటుపరబ్రహ్మతత్త్వం మనోబుద్ధ్యహంకారా తీతమైనదని, సెలవిచ్చారు. కావున సకల చరాచర సృష్టిలోని సర్వప్రాణికోటికి ఆధారమై, అనంతమై, అజరామరమై నిత్యమైయుండు మహాచైతన్యమే ఆ పరబ్రహ్మ - అని 'కేనో' పనిషత్తు లోని మొదటి భాగం (8 మంత్రాలు) వివరిస్తుంది.

కావున ప్రాణసహితమైన ఈశరీరం, సమస్త జ్ఞానానికి ఆధారం, ఈ జ్ఞానమంతా ప్రాణమున్నప్పుడే గ్రహించాలి. ప్రాణంపోయిన తర్వాత సాధించగలిగేదియేమీలేదు. అందుచేత, ప్రాణి సంజాతములో ప్రసరించి, ప్రేరేపిస్తున్న పరమాత్మ స్వరూపాన్ని సాక్షాత్కరించుకొనుటకై శరీరధారులందరు నిరంతరము సాధన కొనసాగించి ప్రయత్నిస్తునే ఉండాలి, అని రెండవ భాగం తెలియజేస్తుంది.

చివరి రెండు భాగాలు పరబ్రహ్మము యొక్క మహత్త్వమును ఒక కథారూపంలో వివరించాయి.

పూర్వం, ఒకానొకప్పుడు జరిగిన దేవదానవ యుద్ధంలో దేవతలు గెలుపొందారు. ఆ విజయాన్ని తమ శక్తి సామర్థ్యాలవల్ల సాధించామని విఱ్ఱవీగుతారు దేవతలు. విశ్వసృష్టిలో సర్వప్రాణులచైతన్యానికి మూల శక్తి, సకల విజయ సంధాత ఐన సర్వేశ్వరుడే దేవతల విజయానికి కారకుడని వారు గ్రహించలేక పోయారు. కావున దేవతల యశక్తతతను తెలియజేసేందుకు పరబ్రహ్మ, యక్ష రూపంలో అక్కడ ప్రత్యక్షమై, తామే మహాశక్తి సంపన్నులనుకునే, అగ్ని వాయువులు, కేవలం ఒక గడ్డిపోచను దహించలేక, కదలించలేక పోయిన వారి అశక్తతతను నిరూపించి, దేవేంద్రుడేయక్షుని సన్నిధికి చేరుకొనునంతలో యా యక్షుడు యంతర్ధానమయ్యాడు.

యక్షుని స్థానంలో ఒక యపూర్వ లలనామణియైన హైమవతిని ఉమాదేవి గా భావించి, ఇంద్రుడామెను యక్షుని గురించియడిగెను. అందుకు ఆమె, యక్షుడే పరబ్రహ్మయని, ఆయన మహిమ వల్లనే మీకు మహిమకలిగినదని తెల్పి, అంతర్హిత యయ్యెను.

అట్లు అతిసమీపమునుండి, ఇంద్రాగ్ని వాయువులచే తెలిసికోబడి, క్షణంలో మెరుపువలె మెరిసి మరల పరమవ్యోమంలో విలీనమై పోయిన యా పరబ్రహ్మమును అతీంద్రియ స్థితిలో ధ్యానించి, దర్శించడం అధిదైవతమైన అనుభూతి. అలాంటి అనుభూతి సాధకులకు అనుభవైక్యం కావాలంటే మోక్షప్రదాతయైన పరబ్రహ్మం సకల ప్రాణి సంజాతమునకు సంసేవ్యమైన ఆత్మ భావమేనని సూచిస్తు మంత్ర ద్రష్టయైన మహర్షి 'తద్వన' మనే పదాన్ని ధ్వన్యాత్మకంగావాడాడు. తద్వన సారం గ్రహించిన తపస్వి సర్వులకు ఇష్టుడవుతాడు. అంతేగాక ఉత్కృష్టతమమగు అమృతత్త్వ ప్రాప్తికి బ్రహ్మజ్ఞానము దప్ప ఉపాయాంతరములేదని విదితం చేశాడా మహర్షి.

పై వివరణవల్ల స్పష్టమైన అంశము :

సమస్త హృదయగ్రంథులను శిథిలముగావించి యవిద్యను అంతమొందించి, సాధకుని అత్యంతమూ బ్రహ్మ సామీప్యమును బొంధించునది గనుక, దీనికి ఉపనిషత్ యని పేరు వచ్చినది. అట్టి జ్ఞానము, గ్రంథ విషయము గనుక, యీ గ్రంథమునకు నా పేరు సార్థకమయినదని చెప్పాలి.

ఈ ఉపనిషత్ వ్యాఖ్యాత చివరగా, ఉమాదర్శన, అదృశ్య సంఘటనలను వ్యాఖ్యానిస్తు యక్ష దర్శనంలో ఉపనిషత్తు నిజస్వరూపాన్ని విదిత మొనరించారు.

యక్షరూపుడగు పరమాత్మ దర్శనము, అహంకార రహితులకు మాత్రమే సుసాధ్యమని అభివర్ణించుటలో వ్యాఖ్యాత చూపించిన ప్రతిభ హర్షణీయము. గురు కృపా పూర్ణసంపిద్దులగుటచే వ్యాఖ్యాత ఉపనిషత్ వ్యాఖ్యాన ఘట్టములో సఫలీకృతులయ్యారు. వీరి పై నిరతము గురు పరమాత్మ కృప అవిరళముగా ప్రసరించుగాత!

ఓం తత్ సత్ శివమస్తు.

అనంతపురం
07-05-2004

ఇట్లు
గురుపాద రేణువు
ఎ.బి. చంద్రశేఖరరాజు

 

శ్రీ గురుభ్యోనమః
పరిపూర్ణానంద నరసింహార్య పాదకమల సేవకం ।
ప్రభోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం ॥

# కేనోపనిషత్తు

## ఉపోద్ఘాతము

కేనోపనిషత్తు సామవేదములోనిది. దశోపనిషత్తులలో చిన్నది. కాని లక్ష్యము మాత్రము మిగతా ఉపనిషత్తులకంటే భిన్నమై అతీతమై మహోన్నతమైనది. ఈ ఉపనిషత్తు పరిపూర్ణపరబ్రహ్మమును లక్ష్యాలక్ష్యార్థముగా కనుగొనుటకు తోడ్పడుతున్నది. సత్యమైనది పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే. అట్టి సత్యాన్వేషణలో భాగస్వాములు కండని సత్యమును కనుగొనుమని చదువరులను ఆహ్వానిస్తుంది ఈ ఉపనిషత్తు.

కేనోపనిషత్తులో అత్యంత ఆసక్తికరమైన విషయ మేమంటే అది సూక్ష్మాతి సూక్ష్మమైన మానసిక విచారణ. మరియు ఆ విచారణకు కూడ అతీతమైన విచారణ. ఈ ఉపనిషత్తు విచారణ ఎంత స్ఫూర్తి దాయకమంటే శ్రద్ధగా దానిని గురుముఖంగా తెలుసుకొని ఆచరించిన వారికి పరిపూర్ణ పరబ్రహ్మము ఉన్నది ఉన్నట్లుగా అపరోక్షమగును. జన్మ రాహిత్యము సిద్ధించును. చిన్నదైన దీని విలువ మహోన్నతమైనది. సర్వలక్షణ విలక్షణమైన పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి ఈ ఉపనిషత్తు స్పష్టంగా సూటిగా బాణము ఎక్కు పెట్టి గురితప్పకుండా వేసినట్లు విడమర్చి చెప్పినది. పరిపూర్ణమును గురించి సహజంగా తెలుసు కొనవలసినదంతా ఈ ఉపనిషత్తు నందు గలదని, తెలుసుకోమని, జీవితలక్ష్యమునకు నడుము బిగించమని ఈ ఉపనిషత్తు ప్రబోధించు చున్నది. నిగూఢ రహస్యమును తెల్పింది. అందుకోమంటున్నది. ఈ ఉపనిషత్తు ప్రసాదించేవరం పరలోక ప్రాప్తి కాదు. ఈ శరీరము రాలిపోకమునుపే పరతత్వాన్ని (ఆత్మను) సాక్షాత్కరించు కొని దాని కతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకనము చేసి ఎరుకను విడిచి జన్మ రాహిత్యము పొందుటకు మార్గము నిర్దేశించు చున్నది. మనకు మార్గదర్శక మగుచున్నది.

యమ, నియమ, ఆసనాదులచే, అణిమాదిసిద్ధులచే జ్ఞాన భూమికలందు కృషిచేయుట వల్ల, మంత్ర, లయ, హఠ, రాజయోగములందు సాధనలవలన, తారక, సాంఖ్య, అమనస్క, మహాక్య, వార్తికాది పద్ధతులందు కృషిచేయుటవల్ల జన్మ రాహిత్య మోక్షము సిద్ధించదు. అట్టివారికి అది కలలోని వార్తయే, వీరు జనన మరణ ప్రవాహమందు కొట్టుకొని పోవుచు దరిగానలేక పోవువారు. ఇట్టి వారికి ఆత్మోపలబ్ధితోపాటు పరిపూర్ణపరబ్రహ్మమును అపరోక్షము చేసి కొనుటకు వలయు వరమును ప్రసాదించు చున్నదీఉపనిషత్తు.

ఆహార నిద్రా భయ సంగములు మానవులకు పశ్వాదులకు సమానమే. గాని మానవులకు జ్ఞాన మధికము. అట్టి జ్ఞానమును వృధాచేయునేని మానవుడు పశువుకంటే హీనం. అట్లుగాక సృష్టి యందు సర్వ భోగభాగ్యములు క్షణభంగురములని గ్రహించి శాశ్వతమైన దేది? నేను అనునది ఏది? నా జీవితాశయమేది? గమ్యస్థానమేది? దానిని పొందుటకు సాధన సంపత్తి యేది? ఇత్యాది జిజ్ఞాసచేయువారికి ఈ ఉపనిషత్తు సాధన సంపత్తిని అందించి మానవ నామము సార్ధకము చేసుకొనుటకు తోడ్పడును.

కొన్ని తత్వ సాంప్రదాయాలలో దేహము ఇంద్రియాలే సమస్తము అనే భావన ఉంటుంది. వీటి వెనుక ఉన్నదానిని తెలుసుకొనవలెననెడి ఉద్దేశముతో జిజ్ఞాసగల శిష్యుడు బ్రహ్మజ్ఞానము గల పరిపూర్ణగురువును ప్రశ్నించుటతో కేన ప్రారంభమైనది. "కేన" అనగా "ఎవనిచే" అని అర్థము.

అధిష్ఠాన చేతన బ్రహ్మమని యొకటి, పరిపూర్ణ పరబ్రహ్మమని మరొకటని రెండు బ్రహ్మలున్నవా ? అని ప్రశ్నించువారికి ఉన్నవని ఈ ఉపనిషత్తు నేరుగా సూటిగా సమాధానము చెప్పింది. ఇచ్చట వేమన యోగి పద్యమును పరిశీలింతము. **ఆ॥రూపడగక జీవరూపంబు గనరాదు। యట్టి రూపమడగ నలవి గాదు। బ్రహ్మమడగకున్న బ్రహ్మము గనరాదు. విశ్వదాభిరామ వినురవేమ॥** అను పద్యమున శ్రీవేమనార్యుడు ఎరుకబ్రహ్మమును వదలకుండ పరిపూర్ణ పరబ్రహ్మము తెలియరాదు. అని చెప్పుటవలన రెండు బ్రహ్మమున్నట్లు చెప్పినట్లే గదా! ఇట్టి రూపములుగా "ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపంకం" అని "ఏకం అనేకం భవతి" అని "అనేకం ఏకంభవతి" అని ఒకటి గాను సర్వద్వంద్వముగానున్నది, అధిష్ఠాన చేతన బ్రహ్మము. ఈ బ్రహ్మము ద్వంద్వ రూపములుగా మార్పులు చెందునదిగా ఉన్నది. కావున ఇది సత్యమైన బ్రహ్మముకాదు. ఎరుక లక్షణములు మాయా లక్షణములు గలది. కావున ఎరుక బ్రహ్మము అని, అధిష్ఠానచేతనబ్రహ్మమని వ్యవహారములో నున్నది.

దీనికి పరంగా సర్వలక్షణ విలక్షణమై, నిష్ప్రతియోగికముగా ఎప్పుడు మార్పులేక ఏకరీతిగానున్నదానిని పరిపూర్ణపరబ్రహ్మమనవలెనుగాని సృష్టికారణమైన బ్రహ్మమును మరియు "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పన" అనునట్లు ఉపాసింప బడు బ్రహ్మము బ్రహ్మము కాదని, వాక్కునకు ప్రాణమునకు అందునది బ్రహ్మము కాదని తేల్చిచెప్పింది ఈ ఉపనిషత్తు. జ్ఞానేంద్రియములచే తెలియరానిది మాత్రమే బ్రహ్మముగా నిర్ధారించినది. దానికి ఏ పేరు లేదు. దానిని ఇచట పరిపూర్ణ పరబ్రహ్మముగా వ్యవహారార్థము వాడబడినది.

మానవుడు శోధించి సర్వజ్ఞత్వమును తెలిసికొనగలడు. కాని మనోవాక్కుల కందని పరిపూర్ణ పరబ్రహ్మమును సర్వజ్ఞత్వలక్షణములు గల అధిష్ఠాన చేతన బ్రహ్మమగు ఎరుక కూడ తెలుసుకొన జాలదు. అట్టి తెలియరాని పరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థముగా

ప్రచురపరుచుచున్న దొక్క కేనోపనిషత్తు మాత్రమే అన్నచో అతిశయోక్తి కాదు.

ఉపనిషత్తుల చివర "రోచనార్థం ఫలశ్రుతి" యను న్యాయమున ఫలశ్రుతులు పలికినవి. అట్లే కేన కూడ ఫలశ్రుతి పలికినది. రెండవ భాగమున నాల్గవ మంత్రమున మొదటి పాదమున పరిపూర్ణ బోధవల్ల పొందిన జ్ఞానము వలన అమృతత్వమును పొందుదురు అని చెప్పబడినది. ఇచ్చట అమృతత్వమనే పదానికి విశాలార్థము గైకొనవలయును. పరిపూర్ణ బోధవల్ల జననమరణము లేని జన్మరాహిత్యము సిద్ధించును. గాని అదే మంత్రమున రెండవ పాదమున జెప్పబడిన అమృతమనగా జీవబ్రహ్మైక్య మోక్షమును లభించును. సాలోక్య, సాయుజ్య ముక్తుల ద్వారా తిరిగి జన్మవచ్చును. ముక్తి అనగా స్వేచ్ఛ. విషయములు నుండి విడివడి నప్పుడు ముక్తి, విషయములకు లోనైనపుడు బంధము, అమృతమనగా చావులేని మోక్షము కోరు కొన్నట్లే."**మోక్షాపేక్షా సంకల్పో బంధః**" అని నిరాలంబోపనిషత్తు పలికినది. కనుక ఇటు వంటి మోక్షముల వల్ల "**క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి**" యనినట్లుతిరిగి జన్మ వచ్చునుగాని జన్మ రాహిత్యము సిద్ధించదు.

మరి ఐదవ మంత్రమున ప్రపంచములో బ్రహ్మమును, అనగా పరిపూర్ణపర బ్రహ్మమును అపరోక్షముగావించు కొన్నట్లుయితే ఆపైన నిజమైన జీవితమున్నదని తెల్పినది కేన. పరిపూర్ణ బోధవలన తనువు పడిపోక మునుపే జనన మరణమనే భ్రాంతి రహిత మొనర్చు కొన్న యెడల ఆ క్షణము నుండి తాను లేననెడి నిశ్చయములో నుండును. అతనికి ఎట్టి కోరికలుండవు. శేష జీవితమంతయు కర్తృత్వరహితముగా జీవితము గడుపును. ఆగామి అతనికి లేకుండును. జన్మ రహితమగును. అట్టి వాని జీవితమే నిజమైన జీవితము. ఇతరులు సంసారవారాశిలో మునుగుతు తేలుతు సుఖదుఃఖములను అనుభవించుచునే యుందురు. అదే మంత్రమున రెండవ పాదమున ఆత్మను దర్శించిన అమృత స్వరూపులగుదురని ఫలశృతి జెప్పినది. అమృత స్వరూపులు పంచముక్తులలో నేదేని ఒకటి పొంది ఆయాలోకములలో నుండి తాము చేసిన పుణ్యములకు ఫలముగా ఆ లోకములో భోగములు ననుభవించి పుణ్యము క్షీణించగా మళ్ళీ తిరిగి జన్మకు రావలసిన వారే. ముక్తుల వల్ల శాశ్వతముగా జన్మ లేకుండపోదు. కనుక జన్మరాహిత్యము కోరు ముముక్షువులు, పరిపూర్ణగురువు నాశ్రయించి పరిపూర్ణ బోధను పొందుడని పరోక్షంగా హితవు పలుకు చున్నది ఈ కేనోపనిషత్తు.

కదిలేది ఉన్నప్పుడు కదలని దానిని గురించి ఆలోచనవస్తుంది. అచలము అనగా యే కాలములోను కదలనిది, నిరపేక్షకమైనది. చలన మున్నదని అంగీకరిస్తే చలనము లేనిది మరొకటి ఉండాల్సి వస్తుంది. జీవేశ్వర జగత్తు కదిలేది. వీటి కన్నిటికి అతీతంగా కదలని దొకటి ఉండి ఉండాలి. అదే పరిపూర్ణపరబ్రహ్మము అని దానికి వ్యవహారార్థము పరిపూర్ణ భావజ్ఞులు పేరు పెట్టారు. సచ్చిదానంద రూపస్థితిని పొందితేనే గాని (ఆత్మసాక్షాత్కారమైతేనేగాని) పరిపూర్ణపరబ్రహ్మము శిష్యులకు తెలియరాదు. ఇట్టి

లక్ష్యసాధనకై కేనోపనిషత్తునందు మొదట ఆత్మను (ఎరుకబ్రహ్మను) గురించి చెప్పి దానికతీతమైన కేవలాత్మను గూర్చి చెప్పింది. మొదటి భాగమున మొదటి రెండు మంత్రాలలో ఆత్మను గురించి మూడు నాలుగు మంత్రాలలో పరిపూర్ణ పరబ్రహ్మను గురించి, ఐదు నుండి తొమ్మిది వరకు గల మంత్రాలలో బ్రహ్మము (పరిపూర్ణ పరబ్రహ్మము) ను గురించి చెప్పుతూ వెనువెంటనే ఏది బ్రహ్మము కాదో (ఆత్మ బ్రహ్మ కాదని) తెల్పి నిర్ద్వంద్వముగా చెప్పినది. అంతేగాక మూడు నాల్గవ భాగములందు అధిష్ఠాన చేతన బ్రహ్మము శిష్యునికి వస్తు నిశ్చయముగా బోధపడుటకై దేవ దానవుల యుద్ధముగా ఒక కథను చెప్పబడింది. ఎరుక (ఆత్మ) సాక్షాత్కారము రెప్పపాటు వంటిదిగా, మెరుపుతీగ వంటిదిగా వర్ణించబడింది. మొత్తముపై మొదట ఆత్మనుగురించి జెప్పి తర్వాత పరిపూర్ణపర బ్రహ్మను గురించి ఈ ఉపనిషత్తు వివరించి చెప్పింది. ఇట్లు జెప్పుట క్రమ పద్ధతిగా యున్నది. ఈ భావమును గురుగీతలోని 212 వ శ్లోకము స్పష్టపరచుచున్నది.

**శ్లో॥ స్వయం బ్రహ్మ మయోభూత్వా। తత్పరం చావలోకయేత్।**

**పరాత్పర తరం నాన్యత్। సర్వగం తన్నిరామయం ॥**

పరిపూర్ణ బోధ బడిసిన గురుపుత్రులకు ఈ కేనోపనిషత్తు ఒక మార్గదర్శకము కాగలదని నా ప్రగాఢ విశ్వాసము. దశోపనిషత్తులలోగాని ఇతర ఉపనిషత్తులలోగాని ఎరుక బ్రహ్మమును గూర్చి మహా అయితే మహావాక్యముల లక్ష్యమైన జీవ బ్రహ్మైక్యమును ప్రబోధించినవి. కొన్నిటి యందు అక్కడక్కడ పరిపూర్ణమును గురించి మంత్రములుగాని వాక్యములుగాని వున్నప్పటికి వాటిని తమ కనుకూలముగా మలిచి చెప్పు కున్నారు. అట్లు చెప్పుకొనుటకు సంస్కృత భాష అవకాశమిస్తున్నది. సంస్కృతము రబ్బరు వంటిది. ఎవరు లాగితే వారివైపే సాగును. కనుక మతముల వారు తమకు సమ్మతమైన రీతిలో వాటికి అర్థవివరణ గావించి యున్నారు. అందువల్ల అందులోని లక్ష్యార్థము మరుగువడినది. అట్టి లక్ష్యార్థమును ఈ వాఖ్యానము ద్వారా బయలుపరుచబడినది.

బుద్ధ భగవానుడు పాళీ భాషలో, బసవేశ్వరుడు కన్నడములో సర్వులకు తెలియునట్లు తమ మాతృభాషలో తెలిపి వారి కాబోధనలను అవగాహన చేసినట్లుగానే శ్రీ శివరామదీక్షితులు వారు తేట తెనుగులో పరిపూర్ణ బోధను తెలిపి తెలుగు వారికి మహోత్కృష్టమైన సేవచేసినారు. అంతుకు పూర్వము తెలుగుభాషలో రచించిన గ్రంథములు లేనే లేవని చెప్పవచ్చును. వేదాంత మంతయు ఉపనిషత్తులలోను, బ్రహ్మసూత్రములలోను, భగవద్గీతలోను సంస్కృత భాషలోనే రచించ బడి యుండుటచే సంస్కృత భాష తెలిసిన మహా పండితులకు మాత్రమే అవగాహన మగుచుండెను. ఆ సంస్కృతములో కూడా **"శ్రుతయశ్చభిన్నాః స్మృత యశ్చ భిన్నాః మహా ఋషీణాం మతయశ్చభిన్నాః"** అను నట్లు పరస్పర విరుద్ధ భావములతో నుండుటచే వేరువేరు మత సిద్ధాంతములకు తావిచ్చిచ్చెనేగాని ఏకైక సిద్ధాంతమును ప్రచారపరచి యుండలేదు. మహా వాక్యమునందలి

పదపదార్థములను అన్వయ వ్యతిరేక యుక్తులచే శోధించిన యెడల మాత్రమే మహా వాక్యము అవగతమగునని శాస్త్రములు చెప్పుచున్నవి. వాక్యార్థములను భాషాపరిజ్ఞానము చేతను, దృష్టాంతదార్ష్టాంతములచేతను అన్వయ వ్యతిరేకయుక్తులచే సిద్ధాంతములు చేసియున్నారు. అట్లు తర్కవితర్కములచేతను యుక్తిప్రయుక్తుల చేతను బుద్ధి నిశ్చయమే కలుగ గలదు గాని, ఆత్మ నిశ్చయము (సాక్షాత్కారానుభవము) కలుగ జాలదు. కలిగినట్లు సంతోషించుట తన్ను తాను మోసగించు కొనుట మాత్రమే కాగలదు. ఏలననగా ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతవాదులు మహా వాక్యములకు భిన్న భిన్న అర్థములు జెప్పుచున్నారే గాని ఏకాభిప్రాయము నకు రాలేకపోయిరి. కారణ మేమనగా భిన్న భిన్న దృక్పథములు బూని దానికి సరిపడునట్లు వాదనా చాతుర్యముచే వాక్యార్థమును మలుచు కొనుటకు ప్రయత్నించినారు. టోపినొకదానిని తెచ్చి అది తలకు సరిపోక పోతే తలనే చెక్కివేసినట్లు తమ తమ సిద్ధాంతములకు సరిపడునట్లుగా వాఖ్యార్థములను చిందర వందరగావించి యున్నారు. ఈ విషయము ఇతర మతముల వారలు కూర్చిన వ్యాఖ్యానములను పరిశీలించిన మీదట ఇందలి వ్యాఖ్యానమును పఠించిన వారు మహావాక్యములకు భిగించిన అర్థములు ఇమిడ్చిన తీరు సుబోధకమగును. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు. క.ద. 118 **"మతముల వారలు। తమ సమ్మతమైనటువంటి। శాస్త్ర మర్యాదలచే మితమేర్పరుచుకొని బహుగతులను కలహింతు। రట్టి గతినీకేమిటికి చపలత చెందే స్థితి నీకేమిటికి"** అని తన శిష్యులను హెచ్చరించి యున్నారు. శాస్త్ర వ్యాసంగములచే మహావాక్యార్థ జ్ఞానమారూఢము కాజాలదు. పరిపూర్ణ గురువుల నాశ్రయించ వలసినదే. కావున పరిపూర్ణమును గురించి ఇంత విపులముగా చెప్పిన ఘనత కేవలం ఈ ఒక్క కేనోపనిషత్తునకు, మరియు ఈ ఉపనిషత్తునకు కారకుడైన ఋషికి దక్కుతుంది. ఉపనిషత్రయమైన గురువాక్యోపనిషత్తు, అనంత, సర్వసార పూర్ణోపనిషత్తుల తర్వాత పరిపూర్ణబోధను తెల్పినకేనోపనిషత్తును ఉపనిషత్తులన్నిటికి కలికితురాయి వంటిది. బోధక్రమములో మైలురాయి వంటిది. కనుక ఈ ఉపనిషత్తు మహోన్నతమైనది, దివ్యమైనది మంగళకరమైనది. ఇందు చేర్చబడిన వివరముల కూర్పు వల్ల ప్రాథమిక దశలోనున్న గురుపుత్రులకు ఏకొంతనైన ఉపయోగపడిన నాశ్రమ ఫలించినట్లే నాగురు ఋణము తీర్చుకొన్నట్లగును.

జ్ఞానమనే త్రాసులో కేనోపనిషత్తు ఒక వంక, రెండవ పళ్ళెములో లభ్యమయ్యే ఉపనిషత్తులన్నిటి నుంచి తూచిన కేనోపనిషత్తు:ంమగల సత్యమునకు సరిసమానంగా తూగలేవనెడిది సత్యము, సత్యము, పరమసత్యము.

ఈ ఉనిషత్తు వ్యాఖ్యానమనెడి కూర్పును మద్గురువు, మదశరీర అచల ఋషి ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక ప్రభువులనుండి ఆరంభించి పూర్వీకులైన దక్షిణామూర్తి వరకు గల అచల గురుపరంపరలో చేరు యావద్గురు దేవుల పాద పద్మములకు పూజా పుష్పముగా సమర్పించుచున్నాను.

పూజ్యులారా ! నా గురుదేవుని నా హృదయకమల మందిరమునందుంచి ఈ 
ఉపనిషత్తునకు వ్యాఖ్యానమును కూర్చితిని. ఇది కథగాదు. జనన మరణవ్యథ మాన్పునటువంటి పద్ధతి. మీ రంతా దీనిని ఆమూలా గ్రముగా చదివి ఇందలి తప్పులు ఒప్పులు గా తెలియునట్లు దిద్దగలరని ప్రార్థించుచున్నాను. ఇందలి భావములు చాలావరకు పెద్దలు వ్రాసిన గ్రంథముల లోనివే యని మనవి చేయుచున్నాను.

అడవిన గాచిన ఉసిరి కాయ, సముద్ర జలమున కలిగిన ఉప్పు నొకచోటికి చేరి ఎటువలె రుచి పుట్టించునో అటువలనే మడకశిర గ్రామంలో జన్మించి, అనంతపురము జిల్లా కేంద్రములో నివాసముంటున్న శ్రీమదశరీర అచల ఋషి సత్యశోధనాచార్య నిత్యానంద కురుబసుబ్బరాయదేశికులకు, ఇప్పటూరు గ్రామమున జన్మించి పాలమూరు జిల్లా కేంద్రములో నివసించుచున్న నాకు నేటికి ముఖపరిచయము కూడా లేని వారమైనను శ్రీమదచలఋషి పాటలపండరినాథ స్వాముల ద్వారా పరిచయమేర్పడి అనన్తోపనిషత్తునకు, సర్వసారపుర్ణపనిషత్తు లకు ఉపనిషద్భాషణములను పేర అభిప్రాయములు వ్రాసి వాటికి వన్నె తెచ్చిరి. ప్రస్తుతము కేనోపనిషత్తునకు కోరిన వేంటనే సంపాదకులుగా ఉండి "కేనోపనిషత్తు బ్రహ్మవిజ్ఞానపరిషత్తు" "సంపాదకీయం - అనుశీలనము" నందు తాము కనుగొన్న సత్యములను జోడించి పాఠక లోకమునకు పరిపూర్ణ ప్రభోధామృతమును పంచినారు. అట్లు పంచుట ద్వారా మా మధ్య విడదీయరాని బంధం ఏర్పడినది. వారి యెడ అనంతమైన గురు భక్తిభావము కుదిరినది. వీరు "సత్యదర్శనులు" అని పేరుకు ముందు చేర్చుట వల్ల నా జన్మ ధన్యమైనది. కావున వారికి ఎంతో ఋణపడియున్నాను. వారికి కృతజ్ఞతపూర్వక సాష్టాంగ దండ ప్రణామములు సమర్పింస్తున్నాను.

మద్గురుదేవులైన ప్రబోధానంద మల్లు వెంకటరెడ్డి దేశిక వర్యులు ఎల్లవేళల నా మనోఫలకమునందుండి ఈ ఉపనిషత్తునకు వివరణమును కూర్చుటకు తోడ్పడుటయేగాక పేరుకు ముందు చిన్మయానంద అను పేరుతో ఆశీర్వదించినారు. కావున వారి పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు అర్పిస్తున్నాను.

శ్రీమదశరీర అచల ఋషి అమలానంద పాటల పండరీనాథస్వాముల వారు "గురు దీక్షాదక్షా" నామముతో అశీర్వదించియున్నారు. వారి పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు అర్పించుచున్నాను.

బ్రహ్మశ్రీ ఎ.బి.సి. రాజు ఎం.ఎ., పి.హెచ్.డి., రిటైర్డ్ ప్రిన్స్‌పాల్ గారు ఈ ఉపనిషత్తు వాఖ్యానమును వారి మిత్రులైన అచల ఋషి సత్యశోధనాచార్య నిత్యానందుల వారి ద్వారా యాదృశ్చికముగా చూచి అనందించి వారి అభిప్రాయములు వెల్లడించినందులకు వారికి కూడా కృతజ్ఞతాపూర్వక దండప్రణాములు అర్పిస్తున్నాను.

శ్రీ అచలఋ విజయానంద విశ్వనాథాచార్యుల వారు సరిచూచి ఇచ్చినందులకు వారికి దండప్రణామములు అర్పించుచున్నాను. మరియు శ్రీమిట్టే .రామలింగం

ప్రధానోపాధ్యాయులవారు ముద్రణకు అనువుగా శుద్ధప్రతిని వ్రాసి ఇచ్చినవారికి 
కృతజ్ఞాతాభి వందనములు.

ఈ ఉపనిషత్తు ముద్రణకు ద్రవ్యమును దానము జేసిన దాతలందరికి కృతజ్ఞతా పూర్వక వందనములు. అంతేగాక వారందరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించవలసినదిగా మద్గురుదేవుల ప్రార్థించుచున్నాను.

ముద్రణ చక్కగా చేయించి ఇచ్చిన శ్రీ శ్రీశైలం, శ్రీరామ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ యజమానికి, అచ్చువేయుటకు సహాయపడిన వారందరికి కృతజ్ఞతాభివందనములు.

**సర్వం శ్రీ గురుచరణార విందార్పణమస్తు**

1.7.183/30ఎ, హనుమాన్ నగరము, ... **మంత చిన్నయ్య**
మహబూబ్‌నగర్ - 509 001.
13.7.2003 గురుపౌర్ణమి
ఫోన్ : 281634

## పోషకులు

| | | |
|---|---|---|
| 1. | పాలమూరు జాంద్ర కులదైవము | రూ॥ 1000/- |
| 2. | శ్రీ మాణయ్య గారు | రూ॥ 1000/- |
| 3. | కీ॥శే॥ బలరామ్ బందిగి మరియు<br>కీ॥శే॥ బాల్‌చందర్ బందిగి పేరిట<br>దాత : శ్రీ బాలేశ్వర్ బందిగి గారు | రూ॥ 1000/- |
| 4. | శ్రీ సుజీవన్ రావు గారు | రూ॥ 500/- |
| 5. | శ్రీ ఆవుల జ్ఞానయ్య గారు | రూ॥ 500/- |
| 6. | శ్రీ వన్నాడ పాపయ్య గారు | రూ॥ 500/- |
| 7. | డా॥ చికెనె రామ్ మోహన్ గారు | రూ॥ 116/- |
| 8. | శ్రీ మనసాని చంద్రయ్య గారు | రూ॥ 116/- |
| 9. | శ్రీ మట్టె రామలింగం గారు | రూ॥ 116/- |
| 10. | శ్రీ చికెనె చిన్నయ్య Co-op. Dept. గారు | రూ॥ 116/- |
| 11. | జానికి రాములు గారు గద్వాల. | రూ॥ 116/- |

ఓం

శ్రీ గురుభ్యోన్నమః

# **కేనోపనిషత్తు**

## శాంతి మంత్రము

ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథోబల మిన్ద్రియాణిచ సర్వాణి। సర్వ బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మనిరాకుర్యాం మామా బ్రహ్మనిరాకరోదనిరాకరణ మస్త్వ నిరాకరణం మేఽస్తు। తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు మయి సన్తు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

భావము : నా యొక్క అంగములు వాక్కు, నేత్రము శ్రోత్రము మనస్సు మొదలగు సర్వేంద్రియములు విషయాదులందు ప్రవర్తించక బ్రహ్మమగు ఆత్మ స్వరూపము నందు నిలిచి తృప్తిని పొందుగాక! వేదాంత ప్రతిపాదిత మగు సచ్చిదానంద పరబ్రహ్మము సర్వస్వరూపిణి యగుగాక! ఆత్మ స్వరూపడనగు నేను ఆ పరబ్రహ్మను నిరాకరించ కుందునుగాక! ఆపరబ్రహ్మము ఆత్మ స్వరూపుడనగు నన్ను నిరాకరించ కుండునుగాక। ఆ పరబ్రహ్మము యొక్క ఆదరము నాకు కలుగుగాక! నాకు ఆ పరబ్రహ్మమందు విశ్వాసము అలక్ష్యభావము కలుగకుండును గాక! ఆ పరబ్రహ్మము నందు ఆసక్తి గల నాయందు ఉపనిషత్తులచే చెప్పబడినట్టి ధర్మములు కలిగియుండు గాక! ఆ బ్రహ్మమును అపేక్షించిన తన యందు, వేదాంతములందు చెప్పబడిన శమదమాదులు కలిగి యుండుగాక! యని ఆ ప్యాయంతు అనిశాంతిని ఉచ్చరించుట ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికములైన పరిహార నిమిత్తమని తాత్పర్యము.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

1. ఆధ్యాత్మికము అనగా శరీరము నాధారము చేసుకొని పుట్టునటువంటి జ్వరము తలనొప్పి వ్రణము మొదలగు వాని వలన కలిగిన తాపములు
2. అధి భౌతికము అనగా దయ్యము, రాక్షసుడు, పులి, సింహము మొదలగు భూతముల వలన కలిగిన బాధలు
3. అధిదైవికము అనగా దైవ వశమనగా పిడుగు, వరదలు, భూకంపము మొదలగు వాని వలన కలిగిన తాపములు

ఓం

శ్రీ గురుభ్యోనమః

# కేనోపనిషత్తు

## మొదటి భాగము

**1. కేనేషితం పతతి ప్రేషితం మనః కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః ।
కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః శ్రోత్రం క ఉ దేవోయునక్తి॥**

ఎవని ప్రేరణచే మనస్సు దాని విషయాలమీద పడేటట్లు చేస్తుంది. ఎవనిచే ప్రేరేపించబడి ముఖ్యమైన ప్రాణం తనకర్తవ్య నిర్వహణకు పూనుకుంటుంది ? ఎవరి ప్రేరణచే మనుష్యులు మాట్లాడుతారు? ఏ దేవుడు కండ్లను చెవులను నియంత్రిస్తున్నాడు ?

**పరిపూర్ణ ప్రబోధామృతము :-**

1. కేనేషితం పతతిప్రేషితం మనః- కేన = ఎవనిచే, ఈషితం = కోరబడి, ప్రేషితం= ప్రేరేపింపబడి, మనః = మనస్సు, పతతి = పడుతుంది.

అనగా ఎవని ప్రేరణచే మనస్సు దాని విషయాలమీద పడేటట్లు చేస్తుంది? కేనోపనిషత్తు జ్ఞానియైన గురువు, జిజ్ఞాస గల శిష్యుని మధ్య జరిగిన సంవాద రూపములో నున్నది. శిష్యుడు చాలా కాలంగా సత్యాన్వేషణ చేస్తున్నాడు. మొదట తనను, తర్వాత తానున్న జీవేశ్వర జగత్తును పరిశీలించ మొదలుపెట్టాడు. ఈ విశ్వం అనుక్షణం మారుతున్నదని, అందు అన్ని క్షణభంగురములని తెలుసుకొన్నాడు. తనకు, బ్రహ్మాండానికి ఆవల సర్వజ్ఞుడైన భగవంతుడున్నాడని, వాడే అనంతము అమరమైన బ్రహ్మ అని ప్రబలంగా ఉన్న నమ్మికను సమ్మతించాడు, అప్పటికి అది సహేతుకమైన ప్రాతిపదిక అని తోచింది. నిరంతర పరిణామ శీలమైన ఈ జగత్తులో జీవిస్తున్నను, శాశ్వతస్థితిని తెలుసుకొనగోరి సాంప్రదాయక గురువును పొంది తనలో మెదిలిన సందేహములను ప్రశ్నల రూపములో గురుదేవుని ప్రశ్నించుట ఈ మంత్రములోని విశేషము.

అన్ని భావములు మనస్సునకే కలుగుచున్నవి. మనశ్శక్తి విశేషముగా నున్న మానవునకు నేను అను భావమే గాఢ సుషుప్తినుండి మేల్కొనిన వెంటనే కలిగె భావము. అయితే ఈ నేను అను వస్తు వేది? అని జిజ్ఞాసి తెలియగోరుచున్నాడు. అతనికి మూడు సమాధానములు తట్టు చున్నవి. మొదట దేహమే నేను అనుకొన్నాడు. దేహము కంటే భిన్నముగా ఎంత శోధించినా ఈ దేహము నందు ఏమి కాన వచ్చుట లేదు. దేహము ప్రత్యక్షముగా పుట్టి చచ్చుచున్నది. మరణించిన దేహము మళ్లిరాదు. జన్మలు లేవు, పాపపుణ్యములు లేవు. అత్యధిక సుఖమును ఏవిధంగానైనా ఈ జీవితమున అనుభవించుటే

కర్తవ్యము. మరణముతో అంతా సమాప్తి అని తలంచి దేహము నేననే భావముతో జీవితమంత గడుపును. ఈ భావము వల్ల వ్యక్తికిగాని, సంఘమునకు గాని ఎట్టి మేలు, శాంతి, సుఖము, తృప్తి లేదు. సుఖముగా జీవితము గడుపుటకు చేయరాని కృత్యములు చేయును. పెద్ద పెద్ద యుద్ధములకు ఈ భావనయే దారి తీసింది, దారితీయుచున్నది. స్వార్థము పెరుగును. తన సుఖమునకై ఇతరుల సుఖమును లెక్క పెట్టక ఎంతటి ఘోరమునకైన తెగించును. అప్పటికి దుఃఖమునకు నివారణోపాయములభించని యెడల ఆత్మహత్యకు పాల్పడును. ఇంకా ఆలోచించినచో ఏదేహమున కాదేహమే ఇతర దేహములకు భిన్నమైనది. ఏకత్వమనునది అతనికి కనుపించుట లేదు. ఇట్టి నీచమైన దేహ భావము సర్వ అనర్థములకు దారితీయును. అందుకే శంకర పూజ్యపాదులు **"దేహాత్మవాదిని చూస్తే సచేల స్నానము చేయాలన్నారు".**

ఇంకా కొంత శోధించ మొదలుపెట్టాడు. దేహభావము సరియైనది కాదని తలంచి జీవుని గురించి ఆలోచించ సాగాడు. వ్యష్టి ఆలోచన మానుకొన్నాడు. ఇంకా కొంత ముందుకు వెళ్ళి నేను దేహమునుకాను, జీవుడనను భావము అతనికి స్ఫురించినది. నేను జీవుడనుగాని దేహమునుగాను, బ్రతికి యుండిన దేహమునందుండినది మరణ దేహమందు లేనిదేదో అది జీవత్వమని గ్రహించినాడు. మరణ దేహమందెట్టి కదలికలేదు. గాఢ సుషుప్తియందు లేదు. కాని గాఢ సుషుప్తి యందు ప్రాణము ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా చలించుచున్నది. ప్రాణమే జీవత్వము అయితే ప్రాణము నిద్రయందు కనుపించుటలేదు. ప్రాణము మాత్రమే గాక గుర్తెరిగెటి జీవముండవలె అదే మనస్సు కూడా. ఆ మనస్సు, నిద్ర, మూర్ఛ, మరణము మొదలగు అవస్థల యందు ఏమి గుర్తెరుగుటలేదు. ఎందుకనగా, ఈ అవస్థలందు ప్రాణముతో అది వియోగము చెందినది. కనుక ఈ మనః ప్రాణముల చేరికయే జీవత్వము. ఈ విషయమును కృష్ణదేశి కేంద్రులవారు కందార్థ దర్పులు 92లో **"అన్నవు సూక్ష్మాంశము మన। సెన్నగనీరంబు ప్రాణ మెరుగుము। ఈ రెండెన్నడూ కలియవా। నాడే సున్న సుమీయెరుక మాట। సుగుణ సంపన్నా। కలుసుటే ఎరుక సుమి యింతకన్నా। వున్నా దెరుక మూలమన్నది వినలేదు। యెన్నాడు యీభ్రాంతి విన్నంటా నివ్వాకు। సుగుణ సంపన్నా।"** అని సెలవిచ్చి యున్నారు. కనుక ఈ మనః ప్రాణముల చేరిక యే జీవత్వము. జడమగు జీవము తెలివి హీనమైనను, మనస్సు చేతనవంత మొనర్చుచున్నది. మనస్సు కూడా జడమే. జడములైన ఈ మనఃప్రాణముల యందు తెలివిలేకుంటే, తెలివిగల మరొక వస్తువు అవశ్యము ఉండి తీరవలెననే అనుమానము సాధకునికి కలిగి తన గురువును "కేనేషితం పతతి ప్రేషితం మనః" అని ప్రశ్నించుటతో మొదటి మంత్రము ప్రారంభమైనది.

మొదట ఎవని ప్రేరణచే మనస్సు విషయాల మీద పడెటట్లు చేస్తుంది? అని ప్రశ్నించినాడు. మనస్సుకు విషయములే ఆహారము. విషయములు లేకుంటే మనస్సు

లేదు. విషయములే మనస్సును సంకల్పించుటకు వికల్పించుటకు పూనుకొనునట్లు చేయును. వాటి ఆకర్షణవల్ల మనస్సు ప్రలోభపడి విషయాసక్తమునకు లోనై బంధమున తగలు కొనును.

**కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః** = కేన = ఎవని చేత; యుక్తః = నియోగింపబడి; ప్రథమః = ముఖ్యమైన; ప్రాణః = ప్రాణము; ప్రైతి = తనకర్త వ్యనిర్వాహణకు పోతుంది;

రెండవ ప్రశ్నలో ఎవనిచే ప్రేరేపించబడి ముఖ్యమైన ప్రాణము తన కర్తవ్యనిర్వాహణకు పోతుంది ? జీవభావమును పరిశీలించినపుడు మనము మనః ప్రాణములు రెండు జడములని తెలుసుకొన్నాము. కనుక ప్రాణమునకు కూడ పనిచేయుటకు దాని వెనుక ఏదో ఒక వస్తువు ఉండి వుంటుందనెడి అనుమానము కలిగి గురుని "కేన ప్రాణః ప్రథమః ప్రైతియుక్తః" అని ప్రశ్నించినాడు.

**కేనేషితాం వాచమిమాం వదన్తి** = కేన = దేనిచేత; ఇషితామ్ = కోరబడి ఇమామ్ =ఈః; వాచమ్ = మాటలు (మనుష్యాః = మానవులు);వదన్తి = మాట్లాడుతున్నారు

మూడవ ప్రశ్నలో ఎవరి ప్రేరణచే మనుష్యులు మాట్లాడుతున్నారు ? అని ప్రశ్నించినాడు. అగ్ని యొక్క సూక్ష్మాంశము అగుశబ్దము ధ్వన్యాత్మకమగు శబ్దము. వ్యష్టి శరీరోపాధి యందు వర్ణాత్మకముగా నిర్ణయించి దానిని మాటయని చెప్పబడును. ఈ శబ్దము కూడ జడము. ఈ శబ్ద మేర్పడుటకు శబ్దము పలుకుటకు మరొక వస్తువు తోడ్పడుచున్నదేదో తన గురుదేవుని ద్వారా తెలుసు కొనగోరి ఈ మంత్రము ద్వారా మూడవ ప్రశ్నగా "కేనేషితాం వాచ మిమాం వదన్తి" అని తన గురువును ప్రశ్నించినాడు.

**చక్షుః శ్రోత్రం క ఉ దేవోయునక్తి** = చక్షుః = కన్ను, శ్రోత్రం = చెవి; ఉ = నిజానికి; కః = ఏ; దేవః = తేజో వంతుడు దేవుడు(బుద్ధి); యునక్తి = నియంత్రిచుచున్నాడు.

ఈ కేనోపనిషత్తులోని మొదటి మంత్రములో మూడు ప్రశ్నలలో ఎవడు, ఎవని, ఎవని ప్రేరణ వల్ల జడరూపమున నున్న మనస్సు, ప్రాణము, వాక్కు ఎవని ప్రేరణ వల్ల తమ తమ పనులు నిర్వరిస్తున్నవో అనె సందేహముతో ప్రశ్నించుట జరిగింది. ఇంతవరకు శిష్యుడు శోధించిన దాని యందు కొంత పురోభివృద్ధి కలిగినదనుటకు నాల్గవ ప్రశ్నలో "చక్షుః శ్రోతం క ఉ దేవోయునక్తి" అని ప్రశ్నించిన దానిలో "దేవో = దేవుడు" (బుద్ధి) అనె పదం వాడుటవల్ల కన్నులను చెవులను, ఏ దేవుడు నియంత్రిస్తున్నాడు అనునది స్పష్టమగు చున్నది. ఆ దేవుడెవరు? నేనెవరు? ఈ సృష్టిలోని జీవేశ్వర జగత్తులను సృష్టించి పాలించి, లయింప చేయుదేవుడెవరు ? ఆ దేవుని గురించి తెలుపుమని ప్రార్థించి యున్నాడు. ఇట్టి జ్ఞానమును పొందుటకు శిష్యుడు తప్పక గురువును. "**తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేనసేవయా। ఉపదేక్ష్యన్తితే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః**" **భ.గీ. 4-34** లో చెప్పినట్లు తత్వజ్ఞానియైన తన గురుదేవునకు సాష్టాంగ దండ ప్రణామములు జేసి సేవ జేయుచు సమయమును జూచి వినయముగా ప్రశ్నించి వారి వలన నెరుగుము. వారు తప్పక నీకు

ఉపదేశించ గలరని ప్రబోధించు చున్న విధముగా తన గురువు ప్రశ్నించి యున్నాడు, ఇచ్చట "దేవుడు" అనుచో బుద్ధియని చేర్చడమైనది, బుద్ధి నిశ్చయమయినప్పుడే ఆత్మగోచరమగును. కనుక అప్పటికి దేవుడు బుద్ధియని ఉపయోగించుట వల్ల ఆత్మనే ప్రేరణ కలిగించుచున్నదనెడి విషయము సాధకునికి తెలియ వచ్చినట్లు బోధ పడుచున్నది. అట్టి ఆత్మను గురించి గురు ముఖంగా వినాలనెడిది శిష్యుని ధర్మమైయున్నది. అందుకే గురువును వినయ పూర్వకముగా ప్రశ్నించుచున్నాడు. **"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః"** అనున్యాయమున ఈ మంత్రమున శిష్యుడు పాటించి పాలించు చున్నాడు.

**2. శ్రోత్రస్య శ్రోత్రం మన సో మనో యద్ వాచో హ వాచం స ప్రాణస్య ప్రాణః।**
**చక్షుషశ్చక్షురతి ముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి ॥**

గురువు :- అది ఆత్మ. ఆత్మ చెవులకు చెవి, మనస్సుకు మనస్సు, వాక్కుకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, కన్నుకు కన్ను. ఈ ఇంద్రియాలనుండి ఆత్మను వేరుగా చూచె ధీరులు ఇంద్రియబద్ధమైన జీవితాన్నిదాటి (స్వవశీయమనస్సు ద్వారా) అమరత్వాన్ని పొందుతారు.

**పరిపూర్ణప్రబోధామృతము :** అట్లడిగిన శిష్యునికి గురువు అది ఆత్మ అని తెల్పుచున్నాడు. ఈ మంత్రమున గురువు తన శిష్యునికి ఆత్మను వస్తు నిశ్చయముగా తెల్పియున్నాడు. ఇంద్రియాలు మనస్సు, ప్రాణములు మొదలగునవి స్వతహా జడవస్తువులు. మానవునిలో ఆత్మ ఒక్కటే చైతన్య సూత్రము. మన అన్ని ఇంద్రియాల వెనుక "యద్" అనగా అది **ఆత్మ** ఉండుటచేతనే వాటన్నిటికి తమ తమ పనులు నిర్వహించే సామర్థ్యము కలుగుచున్నది. ఈ సంగతి తెలియక అజ్ఞాని ఇంద్రియములు మనస్సు మొదలగునవి నిజంగా చేతనాలని భ్రమ పడుతాడు. జ్ఞాని అట్లు గాక ఈ భ్రాంతిని దాటి తన దివ్య స్వరూపమును తెలుసుకొని అమరత్వాన్ని పొందుతాడు.

**శ్రోత్యస్య శ్రోత్రం =** యత్ = ఏదైతే; శ్రోత్రస్య = చెవియొక్క; శ్రోత్రం = చెవియో;

అనగా అది చెవికి చెవి. ఆత్మ చెవికి చెవిగానున్నదని ప్రభోధించి యున్నాడు. నీవు దేని ద్వారా శబ్దమును వింటున్నావు ? అంటే వచ్చే సమాధానము నేను చెవి ద్వారా వింటున్నాను. ఈ వాక్యమును లోతుగా తాత్వికముగా ఆలోచించి నట్లయితే, నేను అనగా ఆత్మ, చెవిద్వారా అనగా చెవి అనె పరికరము ద్వారా వింటున్నానని సమాధానము వచ్చును. అనగా శబ్దము వినుటకు చెవి ఒక పరికరమని గుర్తించవలెను. వినేది ఆత్మయని నిర్ణయము. పాటగాని, మాటగాని శబ్ద తరంగాలు గా మారి అవి చెవిలోని పలుచని పొర గూబను (కరణపుటము) తాకును. ఆ పొర ద్వారా అంతః కరణము వింటుంది. అనగా వినుటకు శక్తి ప్రసాదించునది ఆత్మ అని స్పష్టమగు చున్నది. **"నహి విశిష్టధీమత్వమ్ అన్తరేణ శ్రోత్రాది ఆత్మ భావః శక్యః పరిత్యక్తుమ్"** విశిష్టమైన బుద్ధి లేనిచో చెవులు మున్నగు ఇంద్రియాలనే ఆత్మగా భావించే తత్వం వీడడం శక్యము కాదు అంటారు శ్రీ

శంకారా చార్యులవారు. అటు వంటి బుద్ధి కలిగినప్పుడే తాను దేహాము కాదనీ తాను దైవాంశ సంభూతడనని తెలుసుకొంటాడు.

**మనసో మనో యద్** = మనసః = మనస్సు యొక్క; మనః = మనస్సు; యద్ = అది ఆత్మ. అది ఆత్మ, ఆత్మ, మనస్సుకు మనస్సు గానున్నది. మనస్సుకు ఆధి భౌతికము సంకల్ప వికల్పములు చేయుట. ఈ సంకల్ప వికల్పములు చేయుటకు కూడ సత్తా ఇచ్చునది ఆత్మనే.

ఆకాశము నందలి అష్టమాంశము వాయువుతో కూడినపుడు మనస్సాయెనని సాంఖ్యము చెప్పుచున్నది. మనస్సుకు విషయములతో గల సంబంధమును గూర్చి తెలుసుకొందాము. జ్ఞానేంద్రియాలచే విషయ పంచకము తెలుసుకొని అంతః కరణమునకు చేర్చి వాని యూక్తా యుక్తములను బుద్ధిచే నిర్ణయించి కర్మేంద్రియములచే కర్మ చేయును. జ్ఞానేంద్రియములచే తెలుసుకొన్న విషయ పంచకము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు చేరియున్నవి. జ్ఞానేంద్రియములలోని పనిని బట్టి సంకల్పవికల్పములు చేయుట మనస్సుకు ఆధిభౌతికము. కనుక మనస్సునకు విషయములు శబ్ద, స్పర్శ, రస రూప, గంధములే. వీటినే పంచతన్మాత్రలందురు. కనుక విషయములపైన మనస్సు సంకల్పములు చేయును. విషయముల యొక్క ఆకర్షణ లేకుంటే అంతరేంద్రియములలో ఒకటైన మనస్సుకు సంకల్ప వికల్పములు లేవు. కనుక సంకల్పములే మనస్సుకు పనిగా నున్నవి. మనస్సు వాటిని గురించే సంకల్పించును.

మనస్సు విషయముల పై ఎట్లు పడుచున్నదో ఒకింత పరిశీలింతము. శబ్దాది విషయములను గుర్తించునది. మనస్సుకదా! గుర్తించనిచో బంధము లేదు కదా! కనుకనే **"మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః"** అని చెప్పబడినది. విషయములే మనస్సుకు ఆహారము. విషయములు లేకుంటే మనస్సుకు ఉనికి లేదు.

మనస్సు కంటే అవిద్య వేరుగా లేదు. మనస్సే అవిద్య (అజ్ఞానము) అనగా మనస్సునుండి అవిద్య పరిణమించింది. సంసార రూప బంధమునకు కారణమగుచున్నది. మనస్సు నశించిన యెడల కర్తృత్వభోక్తృత్వ రూప సకల బంధములు వినష్టమగును, మనస్సు విజృంభించెనేని సకల కర్తృత్వభోక్తృత్వ స్వరూప సంసార విస్తృతి కలుగుచున్నది. **"అస్య సంసార వృక్షస్యమనో మూలమస్థితిః"** అని వసిష్ట వచనము. మనస్సే దేహాది విషయములందును అనురాగము కల్పించి తాటిచే పశువును బంధించినట్లు రాగమనెడి పాశముచే జీవుని బంధించుచున్నది. మరల ఆ విషయములందు నైరస్యమును, నిరసన భావమును కల్పించి ఆ మనస్సే పురుషుని బంధ విముక్తునిగా చేయుచున్నది.

మనస్సు జాగ్రదవస్థయందు స్థూలరూపమును, స్వప్నమందు సూక్ష్మ రూపమునను భోగించుట కొరకు సమస్త విషయములను శరీర భేదమును, వర్ణాశమ జాతి భేదములను తత్క్రియలను తగిన ఫలములను సర్వదా కల్పించు చుండును. మనస్సు నిస్సంగుడగు

చిదాత్మను అన్యోన్యాధ్యాసము చే మోహ పెట్టి దేహేంద్రియ ప్రాణములచే బంధించి ఆయా క్రియలందును క్రియా భోగము లందును అహంమమాధ్యాస వలన సర్వదా భ్రమింప చేయును.

మనస్సు బ్రహ్మమని చెప్పబడిన శ్రుతివాక్యము ఉపాసనల కొరకు జెప్పబడినదిగాని సిద్ధాంతముగాదు. మనోమయాకాశము **అవాఙ్మానసగోచరమగు** పరమాత్మగాదు. ఏలననగా అది ఆద్యంతములు గలది. వృద్ధి క్షయములు గలది. దుఃఖ రూపము, జడము దృశ్యమునై ఆత్మకు విషయమైయున్నది. ఆత్మ యన్ననో సర్వద్రష్టయనగా అనాత్మవస్తువుల యొక్క రాక పోకలను జూచు వాడుగాని దృశ్యముకాడు. మనోమయ దృశ్యము ఆత్మకు మనస్సుకు నిట్టి పరస్పర లక్షణములు గలవు. కనుకనే మనోమయము ఆత్మకాదు. ఆత్మ వలననే మనస్సు గ్రహించే పని నిర్వర్తిస్తుంది.

**వా చోహ వాచసః వాచః** = వాక్కు యొక్క; హ = నిజంగా; వాచమ్ = వాక్కు; స = అదే. సః అనగా; అదే ఆత్మ, అది వాక్కునకు వాక్కు, అనగా వాక్కునకు పలుకుశక్తికూడా ఆత్మ నుండే లభించు చున్నది అని అర్థము. అగ్ని యొక్క సూక్ష్మాంశమగు శబ్దము ధ్వన్యాత్మకమనబడును. ధ్వన్యాత్మకమగు ఈ శబ్దము వ్యష్టిశరీరో పాధియందు వర్ణాత్మకముగా నిర్ణయించిన దానిని మాటయని చెప్పబడును. **క. ప. 137॥ "మాట సుమీ నేననినను౹ మాట సుమీ మాయయనిన మరి జీవ శివుల్౹ మాటసుమీ బ్రహ్మమనినను మాట సుమీ మేను జగము మాటే సుమ్మీ॥"** అని కృష్ణదేశికేంద్రువారు సెలవిచ్చియున్నారు. ఈ మాటల సముదాయమే మానవులచేత (మానవులనే పూర్వ ఋషులచేత) నిర్ణయించిన అపౌరుషేయ, పౌరుషేయమగు వేదశాస్త్ర పురాణేతిహాసాది సర్వశాస్త్రంబులు. కనుక నేనన్న, మాయ యన్నను, జీవుడన్నను, ఈశ్వరుడన్నను, బ్రహ్మమన్నను, మేను అనినను, జగము అనినను మాటల నిర్ణయమేగాని వస్తు నిర్ణయము లేదు. కనుక ఇది మానవ నిర్మిత వస్తు ప్రపంచము. **స్మృతి ॥ సర్వం వికారా జాతం మాయా మాత్రమ్"** అని నిర్ణయము. అనగా నామ రూప వికారములు కలిగి ఉద్భవించి నది సమస్తము మాయా స్వరూపమైనది. కనుకనే లేనిదని భావము.

పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాక్కు రూపంగా గాన వచ్చె శబ్ద చలనము ప్రత్యక్షముగా పిండో పాధులందు గాన వస్తున్నది. **శ్రుతి॥ "యదేవేహ తదముత్ర యదముత్ర తదన్వి హమృత్యోః సమృత్యుమాప్నోతి యఇ హనానేవపశ్యతి" ॥కఠ॥ తా॥** ఏది ఇక్కడ పిండాండమందున్నదో అదే అక్కడ (బ్రహ్మాండమందు) ఉన్నది. అక్కడనున్నదే ఇక్కడ యున్నది. ఇది గుర్తించని వారు జననమరణమును పొందుచునే యుందురు. కనుక పిండ బ్రహ్మాండములందు సర్వత్రా పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాక్కులున్నవనక తప్పదు. శబ్దము ధ్వన్యాత్మకము వర్ణాత్మకమని రెండు విధములు, అధిష్ఠాన చేతన బ్రహ్మమునందు ధ్వన్యాత్మకమగు పరావాక్కు మాత్రమే లేశరూపంగా నున్నది.

శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ, ఆకాశవ్యాపితం చ యత్
ఆకాశస్యగుణశబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే॥ - ఉత్తరగీత

తా॥ ఆకాశమనగా అవకాశరూపము, ఖాళీ ప్రదేశము. నామరూపాత్మకమగు సర్వజగమునందు సూక్ష్మముగా వ్యాపించి యున్నది. దాని గుణము శబ్దము. బ్రహ్మము నిశ్శబ్దముగా నున్నదని ఈ శ్లోకము యొక్క భావము.

ఇచ్చట బ్రహ్మము నిశ్శబ్దముగా నున్నదని చెప్పబడినదిగదా! అని అనుమానము కలుగవచ్చును. నిశ్శబ్దము అనగా అసలు శబ్దము ఏ మాత్రము లేదని అర్థముగాదు. గాలి ఎక్కడ లేదనప్పుడు గాలి అసలే లేదని అర్థముగాదు, గాలివీచుట లేదని మాత్రమే అర్థము. అట్లే నిశ్శబ్దము అన్నప్పుడు గూడ శబ్దచలనము, ఆ చలనము వలన కలిగే శక్తి మొదలగునవి మాత్రమే అర్థము. కాని శబ్దము లేదని అర్థము చేసుకొనరాదు. శబ్దమున్నచో అది ఎప్పుడో యొకప్పుడు చలనము పొందక తప్పదు. కనుక తత్కాలమందు శబ్ద చలనము లేదని మాత్రమే అని అర్థము చేసుకొనవలసి యుండును. బ్రహ్మము నందున్న పరావాక్కునే నిశ్శబ్దమని నిర్ణయించినారు అని గ్రహించ వలయును. ఈ పరావాగ్రూప శబ్దమును శబ్దచలనము గలిగించ గల శబ్ద బీజమును వికాసము చెంది అవిచ్ఛేదకమై శబ్ద శక్తి ప్రవర్తించును. **"యత్కించి త్పదార్థ తావచ్ఛేదకా విచ్ఛిన్నే శబ్దస్యశక్తిః "** అని సూత్రీకరించ బడినది. కనుక అవచ్ఛేదక స్థితి పూర్వదశయందున్నప్పుడు శబ్దరహిత మనరాదు. శబ్దము బీజ రూపముగా నున్నదని మాత్రమే అనవలసి యున్నది. ఉ= ఇంకా ప్రాణస్యప్రాణః ప్రాణస్య = ప్రాణము యొక్క; ప్రాణః = ప్రాణము; ప్రాణమునకు శక్తిని నిచ్చు ప్రాణం ఆత్మయని అర్థము. ఆత్మసత్తావల్లనే ప్రాణమునకు ప్రాణ సత్తా కలిగి పనిచేయును.

సూక్ష్మ శరీరము దేవయానమనె సూర్యమండలము, పితృయానమనె చంద్రమండలము, కర్మయానమనె మేఘమండలము చేరి బుద్ధి కర్మానుసారణియనె న్యాయమున తిరిగి వర్షరూపమున పృథ్వీపైపడి ఓషధులందు జేరి కర్మాను సారముగా సకల జీనోపాధులకు అన్న రూపముగా పరిణమించును. ఆ అన్నమే సకల జీవులకు సూక్ష్మ రూపమైన ప్రాణముగా స్థూలరూపమైన శరీరాదులుగా మారును. సృష్టియొక్క విచారణ చేయగా ఆద్యంతముగా సృష్టి జరుగుచున్నది. ఈ ప్రకారముగా పిండాడండ మందు పంచ ప్రాణములు వాటి క్రియల ద్వారా స్థూల దేహ వ్యవహారము నడిపించుట మనకు తెలియుచున్నది.

సృష్టికి పూర్వము తాను తానుగానున్న బ్రహ్మము సత్పదార్థము గానుండెను. అనంతరము **"సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి"** - ఆ బ్రహ్మయే అనేకము కావలెనని కోరెను. కోరి **"ఏకం అనేకం భవతి"** ఆ యొక్కటియే అనేక మాయేను. నేను అనేకం కావలెననెడి కోరిక కలిగిన సృష్టి కామున ఇతని యందు ప్రథమమున కలిగి

చైతన్యముగా మారి సర్వవ్యాప్తి కలిగినది. దీనినే మహా ప్రాణమని, పూర్ణచైతన్యమని, ముఖ్యప్రాణమని పరియాయునామములు కలిగినవి. సకల జీవోపాధులలో పిండజ ఉపాధులన్ని తల్లి గర్భమున జీవ పద్ధతిగా యుండి తల్లి యొక్క ప్రాణశ్వాసలే పిండము యొక్క ఆవరణముగా యున్న మావి (గాలిబుడుగానుండు సంచి) యందుండి పిండము ఆ నీటిలో తేలియాడు చుండును. పిండము నాభిద్వారా వ్యానవాయువుచే జీవ పద్ధతిగా యుండును. పుట్టినప్పుడు బొడ్డను కత్తరించె వరకు ఒకే వాయువు మధ్యలో పంచప్రాణములు తిరిగి మరణానంతరము మళ్ళీ ఒకే వ్యాన వాయువు. ఈ ప్రకారముగా పిండస్థ శిశువు తల్లి గర్భము నుండి బాహ్య ప్రపంచములోకి రాగానే ప్రాణరూపముగా ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా ఈ దేహముతో గూడి ప్రారబ్ధము పుట్టినది మొదలు మరణ పర్యంతరము రాత్రింబవళ్ళు అనే నిర్ణయములేక ప్రాణము నడుచుచుండును.

నిజముగా ప్రాణము యజమాని వంటివాడు. ప్రాణవాయువు ప్రాణరూపమున నిది సూర్యుని యందుండును. పిండాండ మందున్న హృదయ మందుండి ఉచ్ఛ్వాస నిశ్వాసలు కలిగించును. నేత్రశోత్ర ఇతర జ్ఞానేంద్రియములతో చేరి వాని విషయములందు ప్రవేశింప చేయును.

ప్రాణము సకలేంద్రియ సముదాయమను బాహ్యాభ్యంతరము లందు వర్తింప చేసి గతిని ప్రసాదించుచున్నది. ప్రాణ రక్షణమే ప్రాణాయామము. సకల చైతన్యమువలన సృష్టియగు చున్నది. మరియు ప్రపంచ ప్రళయమునందు సర్వము నీ ప్రాణము నందే లయమగుచున్నది. అందుచే ప్రాణమును పరమాత్మయని, మహాత్తని, బలమని నిర్ణయము. దీని వలన పిండాండ బ్రహ్మాండాధారమగు ప్రాణ పంచకమని తెలియ బడుచున్నది. ఇట్టి ప్రాణములన్నియు ఆత్మ యొక్క చైతన్య శక్తి చేత పనిచేయును అని శిష్యునికి ఆత్మను వస్తు నిశ్చయముగా వివరించినాడు.

**చక్షుషశ్చక్షుః =** చక్షుషః = కన్ను యొక్క; చక్షుః = కన్ను; ఆత్మ కన్నుకు కన్నుగా నున్నది. అనగా కన్ను వెనుక ఉన్నశక్తి ఆత్మ. ఏవస్తువు కనబడినదన్న ఆ వస్తువు యొక్క ఆకారమును కంటి ద్వారా ఆత్మయే చూస్తుంది. అంటే కన్ను ద్వారా చూచిన ఆకారము మనస్సు (ఆత్మ) తదాకారము పొందినపుడే ఆ వస్తువు మనకు కనబడుచున్నది. అంటే తన మనస్సు ఆ వస్తువుతో తాదాత్మ్యము చెందిన దన్నమాట. ఇదే వస్తు సాక్షాత్కారము. ఎట్లనగా సాకారమునందు గురుని ధ్యానించు సమయమున గురువు యొక్క ఆకారము మనస్సు ధరించును. అంటే గురువు యొక్క ఆకారముతో మనస్సు తన్మయత్వము చెందును. అప్పుడు శిష్యుడు గురురూపమునే చూచును. అన్యమతనికి అగుపడదు. కండ్లు తెరచిన కండ్లు మూసిన ఆ దివ్య మంగళ స్వరూపము తన కట్టెదుట నిలిచినట్లు గాంచును. ఇట్లు చూచుటలో ఆత్మ గురు రూపమును వహించినదని చెప్పవచ్చును.

ఈ విధముగా గురువు అన్ని ఇంద్రియాలవెనుక ఉన్నశక్తి ఆత్మయని శిష్యునికి

తెలియజేస్తున్నాడు. ఈ మంత్రము ద్వారా నిత్యం మారేదేహం, ఇంద్రియములు, మనస్సు అహంకృతులు ఆత్మకాదని స్పష్టపరిచి నట్లయినది. ఆత్మనే మానవుని నిజస్వరూపము. యాజ్ఞవల్క్య జనకునకు నొక్క వాక్యములో ఈ ప్రత్యగాత్మ స్వరూపమును తెల్పిన ఈ దిగువ బృహదారణ్యక శ్రుతి వాక్యమును గూర్చి పరిశీలింతము.

**"యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యం పర్జ్యోతిః పురుషః"**

"యోయం విజ్ఞానమయః ప్రాణేషు అని చెప్పుటవల్ల ఆత్మ విజ్ఞాన మయుడు. ఇంద్రియములందు, ప్రాణము లందును ఉన్న వాడని చెప్పి నందున ఇంద్రియములు ఆత్మకాదని తెలియుచున్నది. హృది = అనగా హృదయమునందు అనుటవల్ల ఇంద్రియాదిష్టాన దేవతలు గారని తేలుచున్నది. ఏలననగా ఇంద్రియాధిష్టానదేవతలు ఆయాఇంద్రియములందుందురు. గాని హృదయమందుండరు. అంతః = అనిహృదయము లోపల అనుట చే విజ్ఞానమను శబ్దముచే చెప్పబడిన బుద్ధియు గాదు. ఏలననగా బుద్ధి హృదయమునందే యుండునుగాని హృదయములోపల యుండదు. జ్యోతిః = అని చెప్పుట వల్ల దేహేంద్రియాది జడపదార్థములన్నిటికి ఉపాదాన కారణమైన అవ్యాకృతము ఆత్మ కాదు. ఏలననగా అవ్యాకృతము సర్వకారణము, సర్వాంతరము అయినప్పటికి జడమైనందున ప్రకాశమైన ఆత్మకాదు. పురుషః = అని చెప్పుట వలన సర్వదేహములందు వ్యాపించి యున్న పూర్ణుడు అనుట సిద్ధించును. కనుక అంతః కరణ మందు ప్రతిబింబించి పరిచ్ఛిన్నత చెందిన చిదాభాసుడున్ను పూర్ణుడుకాదు. కనుక ఆ చిదాభాసుడు ఆత్మకాదు. కనుక దేహేంద్రియాల కంటే, తదిష్టాన దేవతల కంటే అవ్యాకృతము కంటే, చిదాభాసుని కంటే విలక్షణమై సర్వపూర్ణమై సర్వబంధశూన్యమై చిద్ధాతువు మాత్రము ఆత్మయని నిశ్చయింపదగినది" పరిపూర్ణ దర్శనము పుట సంఖ్య 150. ఇట్లు చెప్పుట వల్ల మొదటి మంత్రములో శిష్యుడు అడిగిన ప్రశ్నలకు రెండవ మంత్రములోని గురువు తేల్చి చెప్పిన ఆత్మను స్పష్టముగా తెలుసుకొనుటకు వీలైనది.

భగవంతుడికై దీర్ఘాన్వేషణ జరిపి చిట్ట చివరికి తనలోనే అతణ్ణి సాక్షాత్కరించు కోటాన్ని సెంట్ ఆగస్టీన్ కళ్ళకు కట్టినట్లు వర్ణించినాడు. "నేను భూమిని ప్రశ్నించాను. నేను వాడు కాదన్నట. సాగరాన్ని సరీ సృపాలను ప్రశ్నించాను. నీవు కోరే దైవం మేము కాదన్నవి. ఇంకా పైకి ఎగుయుము అన్నవి. గాలి కెరటాలను అడిగాను. నేను కాదన్నది. గగన సూర్యచంద్ర నక్షత్రాలను అడిగాను. మేము నువ్వు కోరే దైవం కాదన్నవి, నా శరీరం ద్వారాల (ఇంద్రియాల) చుట్టు ఉన్నవాటితోనేను ఇట్లన్నాను. "నేను కోరుచున్న భగవంతుడు మీరు కాదని చెప్పారు, అతణ్ణి గురించి ఏమైనా చెప్పండి" అప్పుడు ముక్త కంఠముతో" అతడు మమ్ము సృష్టించినాడు" అన్నవి. స్వర్గం లోకంలోగాని, భూలోకంలోగాని, మరే జీవిగాని భగవంతుడు కాడనే సత్యం నాకు తెలిసింది. కనుక ఓ ఆత్మా! నేనునీతో మాట్లాడు తున్నాను. నీవే నా ఉత్తమాంశానివి నా శరీరానికి ప్రాణం

పోసి చైతన్యవంతం చేసావు. ఇది ఏ జీవి మరొక జీవికి చేయజాలదు. భగవంతుడు నీ ప్రాణులకు ప్రాణం" - చూడుము ఉపనిషత్తుల సందేశము పుట సంఖ్య 183.

**అతిముచ్యధీరాః** = అతిముచ్య = వదిలించుకొని; ధీరాః = బుద్ధిమంతులు; ఇంద్రియాలు మొదలయిన వాటి భ్రాంతి వదలించు కొన్నవారు ధీరులు అని అర్థము, వేటిని వదలించుకొని అనగా నిత్యం మారే ఈ దేహం, ఇంద్రియాలు, అహంకృతులు మొదలగునవి శాశ్వతమైనవి కావని వాటిని వదలించుకొని వాటి వెనుక ఉండి, వాటికి సత్తానిచ్చి, వాటిని నడిపించునది ఆత్మయని తెలుసుకొన్న వాడు ధీరుడు. ధీరః = అనగా విద్యాంసుడు, ధైర్యము గలవాడు, స్వతంత్రుడు, బుద్ధి శాలి అనెడి అర్థములు గలవు.

**దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధి। ర్దేహేచ జీవేవిదుషస్త్వ హంధీః**

**వివేక విజ్ఞానవతో మహాత్మనో। బ్రహ్మాహ మిత్యేవ మతిః సదాత్మని॥**

- వివేక చూడామని - 163

మంద బుద్ధి తాను దేహమను కొంటాడు, చదువుకొన్నవాడు తాను దేహము జీవాత్మల మిశ్రమము అని అనుకొంటాడు. వివేకము కలిగిన ధీరుడు విజ్ఞాని అయిన మహాత్ముడు తాను బ్రహ్మమని ఎల్లప్పుడు ఎరిగిన ఎరుకలో ఉంటాడు. **నేను ఆత్మనను కొనుటయే ఆత్మ సాక్షాత్కారము.** ఎందుకనగా తనకు అన్యంగా ఆత్మ సాక్షాత్కారించదు. ఆత్మతన కన్యంగా లేదు గదా! బల సత్వాలు గల బుద్ధి శాలురైన యువతకే ఆత్మ సాక్షాత్కార భాగ్యం లభిస్తుంది. యౌవనములో ఇంద్రియాలు పటిష్టముగా ఉంటవి. ఆత్మజ్ఞాననిరతమైన మనస్సు ఇంకా పటిష్ఠంగా ఉంటుంది. కనుక అది ఇంద్రియాలను నిగ్రహించి వాటి శక్తిని ఆత్మవైపు మరలించగలదు. ఇటువంటి యువకుడే ధీరుడు. నిస్సత్తువ అలసత్యము గల మనస్సు ఇంద్రియ వశమైన మనస్సు ఆత్మాన్వేషణ శక్తి కోల్పోతుంది. కనుక అది అంతట గల ఆత్మను ఉపేక్షిస్తుంది.

మానవుని మనస్సుకు అతీతశక్తులున్నవి. ఈ అతీతశక్తులచే ఆత్మను తెలుసుకొనదగినది అని శ్రుతులు ఘోషించు చున్నవి. శ్రుతి **"మన సైవానుద్రష్టవ్యం మనసైవాను శ్రోతవ్యం"** అని "ఆత్మ వాఽరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసి తవ్యః ॥బృహ॥ తా॥ ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది, ధ్యానముచే పొందదగినది. మనస్సును విషయేంద్రియములనబడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములచే ప్రలోభపడకుండా నిర్వీర్యము చేసినచో మనస్సు బ్రహ్మకారవృత్తి పొందును, ఈ స్థితినే **అమనస్క** మందురు. మనస్సును, జ్ఞానేంద్రియ విషయముల నుండి వేరు చేసి ఏకాగ్రము చేసినచో మనస్సు బ్రహ్మకారము పొందును. మనస్సు దేనియందు లగ్నమైతే తద్రూపము చెందగల స్థితి గలదు. కనుక "మనోహిజతువత్" అనగా మనస్సు కరిగిన లక్క వంటిదని అభివర్ణించబడినది. నిర్విషయమై బ్రహ్మకారమగు

ఆ మనస్సు అపుడు తన నామరూపాలను గోల్పోయి తన నిజ రూపమగు జ్ఞానస్థితిలో యుండును. **ఇదే వస్తు సాక్షాత్కారము. ఇదే ఆత్మ సాక్షాత్కారము లేక తత్వ జ్ఞానార్థ దర్శనము.** ఇట్టి దర్శనమును పొందిన వాడు ధీరుడని ఈ మంత్రమున పేర్కొనబడినది.

**అమృతాభవన్తి** = అమృతాః = అమరులు, (మృతము లేనివారు) భవన్తి = అవుతారు; అంటే బుద్ధి మంతులు ఇంద్రియ బద్ధమైన జీవితాన్ని దాటి అమరత్వాన్ని పొందుతారు అని అర్థం.

అమృతము అనగా చావులేనిది. ఇంపైనది, మోక్షము, సుధ, సోమరసము, విషయము, బ్రహ్మము మొదలగు అర్థములు గలవు. ఇందు మనము ఇచ్చట మోక్షము అని అర్థము గైకొనవలెను. మృతముగానిది అమృతము. కాని అమృత, మృత్యువులు ద్వంద్వములు. సర్వ ద్వంద్వములు మిథ్య అనగా లేనివి. ఈ మంత్రమున, ధీరుడు ఇంద్రియ బద్ధమైన జీవితమును దాటి, అమరత్వాన్ని పొందుతాడు, అంటే మోక్షము పొందునని అర్థము. అట్టి మోక్షములు సామీప్య, సారూప్య, సాలోక్య సాయుజ్యములు. ఈ మోక్షముల వల్ల స్వర్గము సత్యలోకము, బ్రహ్మలోకములో నుండి ఆయాదేవతలు అనుభవించు సుఖములు, భోగము లనుభవింతురు. "క్షీణేపుణ్యే మర్త్య లోకంవిశంతి" అనేన్యాయమున వారు చేసిన పుణ్యమునకు ఫలముగా తగినంత సుఖమును పొందిన తర్వాత, వారు కూడా తిరిగి మర్త్య లోకమున పుట్టవలసినదే. ఈ మోక్షములన్ని తిరిగి జన్మకు వచ్చే పద్ధతినే సూచించునుగాని తిరిగి జన్మకురాని జన్మరాహిత్య మోక్షము అనగా జీవించి ఉండగానే భ్రాంతి రహితము జేసుకొని తిరిగి జన్మలేకుండ జేసుకొని, శేషజీవితము కర్తృత్వ రహిత పద్ధతిగా కర్మలోనరిస్తు ఆగామి ఫలము ఉత్పత్తిగాకుండ జేసుకొను పద్ధతిని సూచించవు.

ఈ మంత్రంలోని భావమునే బృహదారణ్యకోపనిషత్తు 4-4-18 లో సుస్పష్టము.

**ప్రాణస్య ప్రాణ ముత చక్షుషః శ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమ్।**
**మనసో యే మన విదుః। తేనిచిక్యుర్బ్రహ్మ పురాణ మగ్ర్యమ్ ॥**

తా॥ ఎవరు బ్రహ్మమును ప్రాణమునకు ప్రాణముగను, నేత్రమునకు నేత్రము గను, మనస్సుకు మనస్సు గను ఉన్నదని తెలిసికొచున్నారో, వారు బ్రహ్మమును శ్రేష్ఠవస్తువనియు పూర్వమే యున్నదని ఎరుగుచున్నారు. మరియు వేమన యోగి :

కం॥ నీవాడిన నేనాడుదు। నీవుండిన నేను నుందు నిర్వీణ్ణుడనై ।
నీవుదలచిన దలపుదు నీవు నగిన నేను నగుదు నిజముగా వేమా॥

మూర్ఖుడు అంతా స్వశక్తితో చేస్తున్నాని అంటాడు. విమర్శచేసి చూస్తే వెలుగు లేకుండా మన కళ్ళతో దేనిని చూడలేము. భూమికి గురుత్వాకర్షణ లేకుండా మనము దానిపై మనలేము. వాయువు లేకుండా శ్వాసించలేము. ఆకాశం లేకుండా అవకాశం

లేదు. పరమాత్మ లేకుండ చైతన్యము లేదు. కనుక ఆ పరమాత్మ సత్తా చేతనే మన శరీరమందున్న ప్రత్యగాత్మ పలికిస్తే పలుకుతున్నాము. అది నిశ్చలంగా ఉంటే మనము నిశ్చలంగా ఉంటున్నామని వేమన ఆత్మ తత్వమును చక్కగా వివరించుచున్నాడు.

కావున ధీరుడైన వాడు ఇంద్రియబద్ధ జీవితమును దాటి అఖండ ఎరుక స్వరూపమును కని అదిలేనిదని తెలుసుకొని పరిపూర్ణపరబ్రహ్మము శాశ్వతమైనదని దృఢముగానమ్మి కర్తృత్వ రహిత కర్మాచరణ ద్వారా జనన మరణ రాహిత్యము పొందుటే మానవుడై పుట్టి నందులకు చేయవలసిన మొదటిపని. అదే మానవ జీవిత ధ్యేయము.

*3. నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్ గచ్ఛతి నోమనః ।*
*న విద్మో న విజానీమో యథైత దనుశిష్యాత్ ॥*

అచ్చటికి కన్ను పోజాలదు, వాక్కు చేరదు, మనస్సు పోజాలదు. కాబట్టి మాకు అది తెలియదు. ఎలాగున దానిని శిష్యులకు ఉపదేశించ వచ్చునో ఆ పద్ధతి కూడా మాకు తెలియదు.

**పరిపూర్ణ ప్రబోధామృతము :**

నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్ గచ్ఛతి నోమనః = తత్ర = అక్కడికి; చక్షువు = కన్ను, నగచ్ఛతి = పోజాలదు; నవాక్ = మాటలు (పోజాలవు); న ఉ మనః = మనస్సు కూడ (పోజాలదు)

ఈ మంత్రమున పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి మాత్రమే ప్రత్యేకముగా వివరించ బడినది. అక్కడికి కన్ను పోజాలదు. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము కంటికి కానరానిది. వాక్కుకు అందనిది అంటే మాటలచే పలుకుటకు రానిది, మరియు మనస్సు అచ్చటికి పోజాలదు. అంటే తలపుల కందనిది అని అర్థము. అదెట్లో పరిశీలింతుము. పరిపూర్ణ సిద్ధాంతమును ఉద్ధరించిన శ్రీ శివరామ దీక్షితుల వారు దీనిని ఈ క్రింది విధముగా వివరించినారు. **"పుట్టనిది - చావనిదీ, రాకడ పోకడలేనిదీ, సకలదేశాల యందు సర్వకాల లయందు, సమస్త మైన వస్తువులయందు, మొదలు కొనలేక, చలించక, ఒక్క తీరుగా, తనకు తానే స్వత సిద్ధమై యున్నది".**

**"యతో వాచో నివర్తింతే అప్రాప్యమనసా సహ" - తైత్తరీయ॥** అనగా వాంగ్మనసులు దేనిని తెలియక వెనుకకు మరలినవో అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి చెప్పాలంటే యింత కంటే సమగ్రంగా చెప్పటం కష్టము.

పరిపూర్ణ పరబ్రహ్మము పలుకున పలుకగరానిది, తలపుల కందనిది. నిరపేక్షకమైనది అని అంటే సర్వలక్షణ విలక్షణత్వమే దాని లక్షణమనాలి. భావా భావ పదార్థ రహిత మందే పరిపూర్ణపరబ్రహ్మ నిశ్చయము. శూన్యమని అందామా అంటే శూన్యమని గుర్తించుటకు గుర్తించేవాడు, వాని గుర్తు కూడా లేని స్థితి అది. కనుక శూన్యము కూడా కాదు. ఏమని అందామని అన్నా, అనే వ్యక్తి అతని వాక్కు రెండు లేని స్థితి అది. కనుక

అది ఏమనరానిది అని ఊరకు కొన్నారు. చివరకు "అస్తిత్యే వోపలబ్ధవ్యః"  పదార్థమని అందామా అంటే అస్తి అనె పదము "నాస్తి" అనె పదాన్ని అపేక్షిస్తుంది. కనుక అది అస్తి నాస్తుల కానిది. అయినను "అస్తీతి బ్రువోతోఽ న్యత్రకథంతదుపల భ్యతే" అనగా అది ఉన్నది అని చెప్పుట కంటే మరొక విధం ఎట్లు ద్యోతక పరచాలి? కనుక సాపేక్షిక పదమైనా మరోగతిలేక "అస్తి" అని అనగా అది ఉన్నది అనె పదము వాడినారు. సర్వద్వంద్వములు మిథ్య లేనిది. కనుక అది సర్వద్వందములు కానిది. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు అనే అంతర త్రిపుటి, ఏమి లేనిది. సద్ఘనము, చిద్ఘనము, ఆనందమునుకాదు. సచ్చిదానంద వస్తువున్ను కాదు. అది ప్రజ్ఞానఘనము, చిన్మాత్రముకాదు. ఏలననగా దానికి ఎరుక (తెలివి జ్ఞానము, గుర్తు మొదలగునవి) లేనే లేదు.

వ్యష్టియందు వ్యవహార భేదమును బట్టి యీ యెరుకే ఏకైక జ్ఞాన మనో బుద్ధి చిత్తాహం కారములుగా యున్నది. ఇందు మనస్సు లక్కలాంటిది "మనోహి జత్వత్" లక్కకరిగించి యేమూసలో పోస్తే తదాకారము వహిస్తుంది. మనస్సు కూడా అటు వంటిదే, తెలియబడే ప్రతిపదార్థమునకు ఆవరణ ఉంటుంది. ఆ వస్తువును తెలుసు కొనే తెలివి లెక మనస్సు తదాకారమును ధరిస్తుంది. అపుడే ఆ వస్తువు తెలియబడుతుంది. తెలివి ఆ రూపముగా వస్తు రూపం వహించినపుడే తన్మయం అవుతుంది. అంటే తదాకారముగా పరిణమిస్తుంది. అదే వస్తు సాక్షాత్కారము. అప్పుడు అన్యవస్తు గ్రహణ ముండదు. అయితే ఒకే కాల మందు అనేకవస్తువులు కనబడి గ్రహించబడుట లేదా? అని శంకించవచ్చు. కాని ఆ విధంగా అనేక వస్తువులు ఏక కాలమందు తెలివిచే గ్రహించబడినపుడు ఏ వస్తువు సమగ్రంగా సంపూర్ణముగా గ్రహించ బడుటలేదని గుర్తించాలి. అణు ప్రమాణము, మధ్య ప్రమాణము, మహత్ ప్రమాణము అని ప్రమాణములు మూడు విధములు. అన్ని వస్తువులు ఏదో ఒక ప్రమాణములో యుండును. కనుక ఆయా వస్తువులను గుర్తెరుగునపుడు తెలివి కూడా ఆయా ప్రమాణములు వహిస్తుంది. అంటే గొప్ప కురుచలవుతుంది. కనుక తెలివి ఆయా మార్పులు చెందుతున్నదన్నమాట. ఖండ ఖండములుగా గాన వచ్చే ఈవ్యష్టి తెలివియే, సమిష్టియందు అఖండ రూపమగు తెలివి లేక ప్రజ్ఞానముగా నున్నది. కాబట్టి ఈ వ్యష్టి సమిష్ట్యాత్మకమగు ఆ తెలివి (ఎరుక) వలె ఏ మార్పులు ఎన్నడూ యెరుగక ఒక్కతీరుగా నుండునదే పరిపూర్ణ పరబ్రహ్మము.

పరిపూర్ణ పరబ్రహ్మను స్థూలముగాదు సూక్ష్మము కూడా కాదు, మరొకటి లేదు. అందు ఈ రెండు రూపములుగా నున్న తెలివి (ఎరుక) లేదు. వస్తువు ప్రతిది ఆవరణ కలిగి యుంటుంది. ప్రతి వస్తువునందు తెలివి ఏదో ఒక రూపంగా ఉంటుంది. (ఒక పరిపూర్ణమందు తప్ప - పరిపూర్ణము వస్తువే కాదు) ఉదా॥ ఒక ఇటుక ముక్క యందు కూడ దాని అణువులను అన్యోన్యముగా చేర్చిపట్టుకొనే శక్తి రూపంగా తెలివి యున్నదని

అనాలి. ఆదే పరా వాక్కు అనబడును. కనుక కేవలం చేతన మని గాని కేవలం జడమనిగాని ఏవస్తువును అనరాదు. పరిపూర్ణ పరబ్రహ్మమీ చిజ్జడములలో ఏదికాదు. ఆరెండింటి ఎరుకరూపము గాదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మమందు తెలివి గాని, దాని పరిణామ రూపమగు మరుపుగాని లేదు. ఎరుక మరుపులు లేనిది, శుద్ధమైనది. ఈ సందర్భమున కృష్ణ దేశికేంద్రులవారి కందార్థ దర్పను పరిశీలిద్దాము. క.ద॥34॥ **"పలుకున బలుకగ రాకను । తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్ । ములుగ్రుచ్చసంధిలేకను కలిగున్నది బట్ట బయలు గదరామాయన్నా యిదిగో చూడుకదలాదోయన్నా ! తా ॥**

పరిపూర్ణపరబ్రహ్మము వాచ్య వాచ్యార్థములకు అందు నట్టదిగాదు. లక్ష్యలక్ష్యార్థముగా మదిలో దానిని తలపోయుదమనిన మనస్సుకు సాధ్యముగాదు. అనగా మనస్సుకు తగలదు. ముల్లు గ్రుచ్చ సందులేక అది అంతట నిండి యున్నది. అదిగో చూడుము. అంతటగలదు గనక అది కదలక ఇతర వస్తువులను కదిలించక స్థిరముగా నున్నది. అని పరిపూర్ణ పరబ్రహ్మమును బహు చక్కగా వర్ణించియున్నారు.

మాటలచే చెప్పుటకు ఎందుకు సాధ్యముగాదనగా రూపముగలదానిని మాటలచేత వర్ణించ వచ్చును. రూపము లేని పరిపూర్ణమును యెట్లు వర్ణింపగలము.

అపూర్ణ వస్తువునకు పరిపూర్ణమని నిర్ణయము, ఎట్లనగా స్థావరజంగమ జీవోపాధుల యందు ఏ ఉపాధికి ఆ ఉపాధే పూర్ణముగా యున్నట్లు తెలియుచున్నది. వీటి ఉపాధికి కారణమైన వస్తువగు ఎరుక మరియు అధిష్ఠాన చేతన బ్రహ్మము పరిపూర్ణమని నిర్ణయము. గనుక పరిపూర్ణమనె వాక్యము నందు దాని కార్యరూపమైన స్థావర జంగమ నిర్ణయములు తెలియును గాని, పరబాహ్య నిర్ణయము తెలియదు. కనుక పరబాహ్యము బయలని, పూర్ణమని, వాక్యముల చేత వర్ణించుటకు సాధ్యముకాదు. మనస్సు చేత పరిపూర్ణపరబ్రహ్మమును మననము చేయుటకు ఎందుకు సాధ్యము గాదనగా, పరబాహ్యమందు మనస్సు తోచుచున్నది గాని మనస్సు నందు పరబాహ్యము లేదు. ఎట్లనగా సముద్రము నందు చేప తెలియు చున్నది. గాని చేపలోపల సముద్రము లేదు. గనుక చేపకు సముద్రమును మనన జేయుటకు సాధ్యపడదు. అట్లే పరబాహ్యమును మననము చేయుటకు మనస్సుకు సాధ్యపడదు. మరియు దానిని పొందుటకు మనస్సుకు తరముగాదు. పలుకన్న పలుకాక, తలపన్న దెరుగక ఎట్లున్న దనగా ఆకాశ గుణమగు శబ్దము ఉపాధి ననుసరించి పర, పశ్యంతి, మధ్యమ, వైఖరిగా ఎరుక పరిణామము చెందు చున్నది, పరబయలునకు ఆకాశగుణమగు శబ్దము మరియు పరిణామము చెందు ఎరుక లక్షణములు లేవు కనుక పలుకన్న పలుకక ఉన్నది. శృతి ॥ **"సోఽ కామయత బహుస్యాం ప్రజాయే యేతి"**. అని తలంచి బ్రహ్మము ఈ జీవేశ్వర జగత్తును పుట్టించినాడు. అటువంటి తలంపు పరిపూర్ణ పరబ్రహ్మము యెరుగదని నిర్ణయము.

పరిపూర్ణపరబ్రహ్మము పంచ తన్మాత్రలు లేనిది. పంచతన్మాత్ర స్వరూపము గానిది. తెలిసుకొనె తెలివి లేదు గనుక అది తెలియ రానిది.

వాక్కు నందు ధ్వన్యాత్మకము వర్ణాత్మకమని రెండు విధములు. వర్ణాత్మకమునకు ధ్వన్యాత్మకము మూలము గనుక ధ్వని యందుగల వర్ణము వలననే సకలము వ్యవహరింపబడుచున్నది. వర్ణాత్మకమునకు మూలమగు ధ్వన్యాత్మకము పరబాహ్యము నందులేదు. గనుక అట్టి దానిని వర్ణాత్మకముగా వర్ణించి చెప్పజాలదు. అయినా వర్ణాత్మకము వలన ఏమి నిర్ణయింప బడుననగా పరబయలునందు ధ్వన్యాత్మకము లేదని నిశ్చయింప బడునుగాని పరబయలు యిట్టిదని నిర్ణయింపరాదు.

మనస్సువల్ల ఊహించుటకు ఎట్లు తెలియదనగా మనస్సు యొక్క ఆవరణమునందు యిమిడి యున్నదానినే అది విమర్శించగలదు. కాని దాని బాహ్యాభ్యంతరముల నిండి యున్న పరబయలును విమర్శించలేదు. అయినా పరబయలును తెలియజాలననే విషయము నిర్ణయించును.

కాయమునకు ఎట్లు తెలియదనగా స్పర్శగల ఆవరణ లక్షణము కాయము గ్రహించగలదు గాని ఆవరణలేని పరబయలును గ్రహింపజాలదు.

ఈ విధముగా తెలియరాని పరిపూర్ణపరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థముగా తెలియపరచుట వేదముల, ప్రత్యేకముగా ఈ ఉపనిషత్తు యొక్క ప్రధాన ఆశయము. అట్టి శ్రుతులను కొన్ని మాత్రమే దిగువ పరిశీలనార్థము పొందు పరచబడినది.

**నాసదాసీన్నో సదాసీత్తదానీం। నా సీద్రజోనోవ్యోమోపరోయత్।**

**కిమావరీవః కుహకస్య శర్మన్। అంభః కిమాసీద్గహనం గంభీరం॥**

ఋగ్వేదం నాసదీయ సూక్తము దశమమండలం - 129 సూక్తం.

తా॥ సృష్టికి పూర్వం సదసత్తులు లేవు. అంతరిక్షాకాశములు లేవు. అపుడు దేనిని, ఎవరు, ఎక్కడ ఎవరి సుఖముకొరకు, ఆవరించిరి ? గంభీరం అయిన అంభస్సు మాత్రం అపుడెక్కడ నుండెను.

1. **"స్వమేవ పరం బ్రహ్మ పూర్ణమద్వయ మక్రియం"** "ఆధ్యాత్మ"

తా॥ పరిపూర్ణ పరబ్రహ్మము తనందుగాని, తనకు వేరుగా గాని రెండవదనే దేమియు లేక ఒక్కటియై నిష్క్రియమైయున్నది.

2. **"యఏవం నిర్బీజం వేద, నిర్బీజ ఏవ నభవతి"** సుభాలో పనిషత్తు.

తా॥ అది బీజ రహితమని, అనగా అది దేనికి కారణంకాదని తెలుసుకొన్నవాడు బీజరహితుడై తిరిగిపుట్టడు.

3. **కార్యోపాధి రయం జీవః। కారణోపాధిరీశ్వరః।**

**కార్యకారణ తాం హిత్వా। పూర్ణ బోధోవ శిష్యతే॥** శుకరహస్యోపనిషత్తు॥

జీవుడు కార్యరూపము గల ఉపాధి అనగా క్షరోపాధి.గలవాడు. ఈశ్వరుడు కారణోపాధి అక్షరోపాధి గలవాడు. ఈ ఉపాధి ద్వయ రహితమందు పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించును.

**4. నైవచా న మనసా ప్రాప్తుం శక్యో నచక్షుసా అస్తీతి బ్రువతోஉన్యత్ర కథం తదుపలభ్యతే॥** - కఠోపనిషత్తు ॥ తా ॥ వాక్కు, మనస్సు, చెవులకు ప్రాప్తించరానిది. ఉన్నదని చెప్పుట వినా మరొకరీతిగా దాని యుపలబ్ధి కాజాలదు.

**5. అచక్షుష్క మశ్రోత్ర మవాగ్గ మనః ॥**

తా ॥ కండ్లు చెవులు, వాక్కు, మనస్సులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మం.

**6. "అప్రాణోహ్యా మనః శ్శుభ్రో హ్యక్షరాత్ పరతః పరః"** ముండకకోపనిషత్తు

తా॥ మనః ప్రాణములు లేనిది. అమృత స్వరూపుడు అక్షర స్వరూపుని కంటెను పరుడగు పురుషోత్తముని కంటెను పరమైనది.

**నవిద్మః** = మాకు తెలియదు., అనగా పరిపూర్ణ పరబ్రహ్మము మాకు తెలియదు అని గురుడు చెప్పుచున్నాడు. పైన పేర్కొన్న బడిన శ్రుతులను గమనించిన యెడల పరిపూర్ణ పరబ్రహ్మము తెలియరానిదిగా నున్నట్లు స్పష్టమగు చున్నది. అష్ట విధములైన గురువుల చే గాని, కోటి గ్రంధములు చదివినగాని పరిపూర్ణబ్రహ్మ తెలియరానిది. అందుకే **"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంధ కోటిభిః"** అని శృతి ఘోషించు చున్నది. ఇందులోని ఆంతర్యమేమనగా అద్వైత సిద్ధి పొందినవారు సర్వాంతర్యామి గా నెరిగిన పరమాత్మతో జీవుని ఐక్యము జేసి చూతురు. వారికి అన్ని అదే, మోక్షము కూడ అదే. **"అయమాత్మ బ్రహ్మ"** యనెడి నిశ్చయము నందున్నావారు గాని అందు "అహం" ఇంకా మిగిలియున్న దనెడి నిర్ణయము వారికి తెలియదు. ఇది గురుగోప్యమైన విషయము. పూర్వము అచల ఋషులు జనన మరణ రహిత విధానము ఈ పరిపూర్ణ బోధయందు మాత్రమే కలదని దెలిసికొని దానిని పరమ గోప్యంగా నుంచి తమ్మాశ్రయించిన లక్షణ యుతులకు మాత్రమే ఉపదేశ రూపంగా ప్రసాదిస్తు ఈ పూర్ణ భావమును కాపాడి పోషిస్తూ లోకమున సుప్రతిష్ఠిత మొనరించి యున్నారు.

ఆ పరిపూర్ణ పరబ్రహ్మము గురువాక్యము చేతనే తెలియవలెను. నేత్ర శ్రోత్రాది ప్రమాణ గమ్యంకాదు. ప్రమాణములచే తెలియతగినది శబ్దాది విషయ సహితమై ఉండాలి. పరిపూర్ణము అటు వంటిదికాదు. అది పంచతన్మాత్ర రహితమైనది. కనుక అది ప్రమాణ ప్రమేయములు గానిది. కనుకనే గురువు అది మాకు తెలియదు అని చెప్పియున్నాడు.

ఇందు గొప్ప రహస్యమున్నది. గురువాక్యము నమ్మినవానికి గురువు పరిపూర్ణ పరబ్రహ్మమును చెప్పి చూయించి వస్తు నిశ్చయము చేయుటవల్ల ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును శిష్యుడు ఆది మధ్యాంతము (ఆది, మధ్య, అంతము) అను నిర్ణయము లేక సర్వత్రా నిండియున్న దానిని చూచిన వాడు కనుక శిష్యునికి కనబడుచున్నది.

ఇతరులకు యిది కనబడుట దుస్సాధ్యము. ఎందుకనగా తెలుసుకొనుటకు అందు ఎరుకలేదు. కనుక శ్రీ కృష్ణదేశి కేంద్రులవారు "ఎరుకలేక" సేవింప దగును" అని అన్నారు.

"తెలియజేయుట, తెలిసికొనుట అను నిర్ణయము లేక కేవలం స్వయం ప్రకాశమైయుండునది ఉత్తమ పురుషతత్వము" అని వ్రాసియున్నారు. అచల పరిపూర్ణమును దర్శించి, ఉత్తమ పురుషస్థితి యందున్న ఆరూఢుడు పరిపూర్ణ మున్నది గాని తాను (ఎరుక) లేదనిగాని నిర్ణయము లేక యుండును. కావున "తెలుసును తెలియదు" అన్న నిర్ణయాలు ఎరుకలక్షణము లే యని గ్రహింపనగును.

**"ఏ నిర్ణయమును జేయడు। నేననని మహాత్ముడెప్పుడు నేనను వాడే**
**నానా విధాల వదరును నేనను తనవంటి వారి నెప్పుడు గనినన్"**

అని పరిపూర్ణ స్థితిని గూర్చి శ్రీ కృష్ణ దేశిక ప్రభువులు ప్రవచించి యున్నారు.

**తే॥ ఎన్ని విద్యలు నేర్చిన నెరుగరాదు.**
**తన్ను నిర్గుణ జ్ఞప్తిలో దాకవలెను**
**నిర్ణయోనాస్తి సర్వదా నిండియుండు**
**విమలగుణరాజయోగీంద్ర వేమనార్య॥**

ఎన్ని విద్యలు నేర్చినను పరిపూర్ణ పరబ్రహ్మమును ఎరుగరాదు, ఎందుకనగా పరిపూర్ణ పరబ్రహ్మమును వాక్కుచే వర్ణించలేము. మనసుచే ఊహించలేము. మరి దర్శించేదెట్లు ? నేనే గుణస్వరూపుడను. నేను బ్రహ్మమునకు వేరుగా లేను. కనుక బ్రహ్మము గుణములతో నిండి యున్నది. కనుక బ్రహ్మము ఆత్మ స్వరూపముగా నున్నప్పుడు నిర్గుణంగా నిర్మలంగా వుంటుంది. ఆ ఆత్మయే పంచభూతములుగా అన్నముగా మారినప్పుడు సగుణంగా తెలియబడింది. ఆత్మయే సగుణ నిర్గుణంగా వుంది.
ఆత్మస్థానములో సృష్టికి కారణమైన ధర్మాలున్నాయి. కనుక ఆత్మ సగుణరూపం అనే అర్థము తేలుతుంది. కనుక ఇచ్చట వేమన "నిర్గుణ జప్తిలో దాకవలెను" అన్నాడు. అనగా ఆత్మకు అతీతంగా వున్న పరిపూర్ణబ్రహ్మము శుద్ధ నిర్గుణము,2 దానిని తెలుసుకోమంటున్నాడు. అది ఎట్లుండునంటే దాని యందు ఏ నిర్ణయము లేదు. సర్వదా అంతట నిండి యున్నది. అది ఏమి కానిది. అది ఇటువంటి దని నిర్ణయించుటకు నిర్ణయం చేసేవాడే లేడు. కనుక దాని కే నిర్ణయం లేదు. నిర్గుణమని ఏలా చెప్పిరి ? సగుణ నిర్గుణములన్నీ సాపేక్షికములు, ద్వంద్వములు అవన్నీ ఆత్మ స్వరూపములే. కాని శిష్యప్రభోదార్థము అ విధముగా చెప్పినారు. కనుక పరిపూర్ణపరబ్రహ్మను నిరపేక్షకమైనది. ఏనిర్ణయము లేనిదని వేమన ప్రభోదించుచున్నాడు.

**నవిజానీమో యథైతదను శిష్యాత్ =** యథా = ఎలాగ; ఏతత్ = దీనిని; అను శిష్యాత్ = నేర్పించ వచ్చునో; నవిజానీమః = మాకు తెలియదు; దానిని ఎలాగ నేర్పించ వచ్చునో ఆ పద్ధతి కూడా మాకు తెలియదు.

పూర్వము ఋషులు తమ తమ శోధనలో తాము కనుగొన్న సత్యములను తెలియజెప్పి, వాటికి కొన్ని హద్దు లేర్పరచిరి. ఇట్లేర్పడుట వల్ల వివిధ మతములు ఆవిర్భవించినవి, వారిలోవారు తమతమ మతము లే గొప్పవని పరస్పరము వాదించు కొనుచుండిరి. ప్రతి వారు శాస్త్ర ప్రమాణములతో వాదించుట వల్ల దేనిని త్రోసి పుచ్చుటకు వీలు లేకుండెను. చివరకు వారందరు నిర్వివాదమగు సత్యమును అనుగ్రహించమని శివుని కోరిరి. అందుకు శివుడు దక్షిణామూర్తి రూపములో (దిగంబరుడైన బాలుని రూపములో) ఆవిర్భవించి పద్మాసనస్థుడై ఒక వట వృక్ష మూలమున గూర్చుండెననియు, తాను కనుగొన్న సత్యమును మౌనవ్యాఖ్య చే ఋషులందరికి సూచించుట వల్ల ఋషు లందరు సంశయరహితులై సంతృప్తి పొందిరని దక్షిణామూర్తి చరిత్ర యందు చెప్పబడినది. జ్ఞాన మార్గీయులందరు దక్షిణామూర్తినే ప్రథమ గురువుగా నంగీకరించిరి. పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు ఆది గురువు, ఆ దక్షిణామూర్తి అనియే వీరు భావించి, నిత్యము గురు పరంపరా స్తోత్రములో పఠించుచున్నారు. అప్పటి నుండి నేటి వరకు తమ గురువులు ద్వారా తెలిసుకొన్నట్లు తమ శిష్యులకు తెలుపుతున్నారు. సాంప్రదాయిక రహస్యమును కాపాడుతూ నేటికిని ఆపద్ధతినే అవలంభించుచున్నారు. పరిపూర్ణ బోధ తెల్పుటకు పూర్ణ గురువులు అవసరము. వారు గూడా వారి గురువుల ద్వారా పర బయిలును అపరోక్ష మొనరించుకొనిన వారు గనుకనే తమ శిష్యులకు తప్పక అపరోక్షమొనర్చగలరు. ఇతరులకు ఇది సాధ్యముగాదు. కనుకనే "గురోర్ముఖేన జ్ఞానతవ్యం నాన్యథా గ్రంధ కోటిభిః" అన్నారు. కేవలము పరిపూర్ణ గురువుల ద్వారానే తెలియబడును. అట్లు తెల్పుట గురుగోప్యమైన విషయము కాబట్టి ఎలాగు నేర్పించ వచ్చునో కూడా తెలియ దంటున్నాడు గురువు. ఈ విషయము తర్వాత మంత్రము స్పష్ట పరుచుచున్నది. గమనించ ప్రార్థన.

4. అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి ।
ఇతి శుశ్రుమ పూర్వేషాం యేనస్తద్ వ్యాచచక్షిరే ॥

నిశ్చయము గా అది తెలిసిన దానికంటే భిన్నమైనది. ఆపైన తెలియని దాని కంటేను అతీతమైనది. దానిని గూర్చి మాకు బోధించిన మా పూర్వీకుల నుండి మేము అలాగే విన్నాము.

**పరిపూర్ణ ప్రబోధామృతము**

**అన్య దేవ తద్విదితాదథో అవిదితాదధి** = తత్ = అది; విదితాత్ = తెలిసిన దానికంటే; ఏవ = నిశ్చయముగా; అన్యత్ = భిన్నమైనది; అథో = ఆపైన; అవిదితాత్ = తెలియని దానికంటే; అధి = శ్రేష్ఠమైనది, అతీతమైనది.

అది అనగా పరిపూర్ణ పరబ్రహ్మము తెలిసిన దానికంటే వేరైనది. తెలియని దానికంటే అతీతమైనదని అర్థము. అదెట్లో తెలిసుకొందాము. ముందుగా దిగువ శ్రుతులను పరిశీలింతుము.

**(1) ఆత్మవా౽ రే ద్రష్టవ్యశ్రోతవ్య మంతవ్యో నిధిధ్యాసి తవ్యః ॥ బృహ ॥**

తా॥ ఆత్మయే చూడ దగినది వినదగినది మననముచేయ దగినది, ధ్యానము చే పొందదగినది, అనగా మనస్సుచే పొంద దగినది గా యున్నది.

**2. యద్యద్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్, యద్య చ్ఛృణోతి కర్ణాభ్యాం తత్త దాద్మేతి భావయేత్** ॥ యోగతత్వ ॥

తా ॥ శబ్ద, స్పర్శ, రూప, రస గంధాత్మకమగు సర్వము ఆత్మయే అని భావించుము. ఏలననగా అపంచీకృత పంచభూతములగు పంచతన్మాత్ర స్వరూపమగు ఆత్మయే పంచీకృతమై విషయ రూపముగా పరిణమించినది. కనుక "సర్వయుదయ మాత్మా" అంతా ఆత్మస్వరూపమే.

**3. దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్"** ॥ తేజో బిందు

తా॥ దృష్టిని విజ్ఞాన మయంగా జేసి జగత్తును బ్రహ్మమయముగా జూడుము.

**4. బ్రహ్మైవ విద్యతే సాక్షాత్ వస్తుతో అవస్తుతోపిచ॥** పాశుపత బ్రహ్మణం ॥ తా॥ వస్తువుగాను (అనగా సత్తుగాను) అవస్తువుగాను (అస ద్రూపంగాను) వుండునది బ్రహ్మమే. అనగా ఒక్కప్పుడు వస్తు రూపము వహించును. మరొకప్పుడు ఆవస్తువు యొక్క నామ రూపములను తనయందు బీజరూపము గావించుకొని ఆ వస్తువుగా గోచరించును. కాని పరిపూర్ణమందు వస్తు రూపమై ప్రకటమైయుండుటగాని దాగి యుండుట లేనే లేదు. అది వస్తుమ్రద్రహితము.

**5. ఏతద్జ్ఞేయం నిత్యమే వాత్మ సంస్థం నాతః పరంవేది తవ్యం హి కించిత్, భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమే తత్** ॥శ్వేతాశ్వతర॥

తా॥ ఈ బ్రహ్మము తన యందే యుండి నిత్యమైనదై యున్నదని దీనిని తెలుసుకొనవలయును. ఇంతకంటే తెలుసుకొన దగినది కొంచమైనా లేదు. భోక్తయగు జీవుడు భోగ్యమగు ప్రపంచము, ప్రేరకుడగు అంతర్యామి అని త్రివిధముగా చెప్ప బడిన దంతా బ్రహ్మమే. (అనగా తెలుసుకొనదగిన బ్రహ్మమే) అనగా పరిపూర్ణ పరబ్రహ్మము దీని కన్యమై శ్రేష్ఠమై తెలియరానిదై యున్నదని అర్థము. పై శ్రుతుల నన్నిటిని పరిశీలించి నట్లయితే తేలినది యేమనగా అధిష్ఠాన చేతన బ్రహ్మము తెలియ వచ్చేదిగా, మరియు తెలియరాని విధము గానున్నది.

బ్రహ్మమనగా అన్నిటికంటే ఏది బృహత్ పదార్థమో అదే బ్రహ్మము లేక గొప్పరూపము కలదియే బ్రహ్మము. "బృహంతీ అబ్రహ్మ" అను ధాతువునుండి బ్రహ్మ శబ్దము వర్తించినది. "బ్రహ్మ బృంణాత్ బృంహతి వర్ధతే" అని శబ్ద కల్పద్రుమము నిర్వచించినది. ఏది వృద్ధి చెందునో, లేక పెంపొందునో అట్టి వాస్తవిక తత్వమే బ్రహ్మమని రాధాకృష్ణ పండితుడు చెప్పియున్నాడు. మరియు "బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ

స్వప్రకాశాత్మరూపకం" ॥ తేజోబిందు ॥

॥తా॥ బ్రహ్మ అనుశబ్దము చేత స్వయం ప్రకాశాత్మకరూపకమగు ఎరుక గల బ్రహ్మమే చెప్పబడు చున్నది. ఇది తత్పద వాచ్యము. **"యతోవాయిమాని భూతాని జాయంతి, ఏన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిషం విశంతి, తద్విజి జ్ఞానః తద్ బ్బ్రహ్మేతి**॥తైత్తరీయ॥ తా॥ దేనియందు భూతములు పుట్టు చున్నవో, పుట్టినవి దేని యందు బ్రతుకు చున్నవో, తిరిగి మరణానంతరము దేనియందు ప్రవేశించుచున్నవో అదియే బ్రహ్మము. ఇది సృష్టి కారణ బ్రహ్మము. దీనిని గురించి జిజ్ఞాస గావించుము. అనగా విచారణ చేయుము. తన జ్ఞానావరణమును కొద్ది గొప్పలుగా అనంతముగా జేయు లక్షణము ప్రజ్ఞాన బ్రహ్మమునకు ఉన్నది. కనుక **"అణోరణీయాన్ మహతో మహీయాన్"** అని అభివర్ణించ బడింది. ఇదే భూమ పదార్థము అన్నిటి కన్న పెద్దది. ఇదే గురుస్వరూపము.

ఆ బ్రహ్మవస్తువు శుద్ధ చిత్తమునకు గోచరిస్తూ జ్ఞాతవ్యమై త్రిగుణ విధానమై జగత్స్వరూపము, అణుస్వరూపము, విభు స్వరూపము గూడా తానే అయి సర్వ ద్వంద్వ స్వరూపముగాను ఏకానేకములు గాను తానే అయి ఒక వంక మనోగోచర మగు కేవల బ్రహ్మ లక్ష్మణములు, మరొక వంక మాయా లక్షణములనగా, వివేక చూడామణిలో చెప్పబడినట్లు **"సన్నాప్య సన్నాప్యుభయాత్మి కానో, భినాప్యభిన్నా ప్యుభయాత్మికానో, సాంగాప్య సంగాప్యు భయాత్మకానో, మహా ద్భుతా నిర్వచనీయరూపా** ॥ అంటే బ్రహ్మము ఉభయాత్మికముగా వున్నది. కనుక ఇది మాయా బ్రహ్మమే కాని కేవల పరిపూర్ణపరబ్రహ్మము కాదు. వరములిచ్చినా, శాపము లిచ్చినా మాయా బ్రహ్మమునకే తగును. ఇంకా శ్రుతి॥ **స్వశబ్దవాచ్యమవిద్యా శళ్యబ్రహ్మ, బ్రహ్మణో రవ్యక్తమ్ అవ్యక్తాన్మహత్, మహతోఽ హం కారః, అహంకా తర్వాంచ తన్మాత్రాణి, పంచతన్మాత్రే భ్యః పంచభూతాని, పంచ మహా భూతేభ్యోఽఖిలం జగత్** ॥తా॥ సత్ అని చెప్పబడుతూ అవిద్యతో కూడిన బ్రహ్మము, ఆ బ్రహ్మమువలన అవ్యక్తము, అవ్యక్తమువలన మహత్తు, మహత్తు వలన అహంకారము, అహంకారమువలన పంచతన్మాత్రలు, దాని వలన పంచ మహాభూతములు, పంచ మహాభూతముల వలన జగత్తుగలిగెను. తన్మాత్ర స్థితిలో నున్నప్పుడు మాత్రము అపంచీకృతమైయుండుటచే ఇంద్రియ గోచరమగుట లేదు గాని, అవే పంచీకృతమై శబ్దాది విషయ రూప పరిణామము చెంది నపుడు గోచరమగు చున్నవి. శబ్దాది విషయ రూపముగా గాన వచ్చెదంత ఆత్మయని భావించబడుతుంది.

మొదట అనగా తన్ను తానుగా నున్న స్థితిలో సృష్టికి పూర్వము చలనములేక అచలమై పరబ్రహ్మ స్వరూపములో నున్నది. అప్పుడు గోచరముగాక అవ్యక్తరూపములోనున్నది. అనంతరము శబ్దాది విషయ రూపముగా తన్ను తాను ప్రకటించు

కొన్నది. అదంతయు వస్తుతః పరమాత్మ స్వరూపమే. "ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అని చెప్పబడుతూనే ఉంది. అట్లా ప్రకటించుకొనిన స్థితియందు మాత్రం అది కేవలం అగోచరము "అవిధి తాత్" అని ఈ మంత్రమునందు ప్రకటించబడినది. 

అట్లే బ్రహ్మము తొలుత ఏ ఆకారము దాల్చనపుడు నిరాకార మనబడినది. అయితే సర్వాకారములు దాని నుండియే బహిర్గతములైనవి. ఆ బ్రహ్మము సాకార నిరాకారములుగా నున్నది. అట్లే త్రిగుణములు విత్తనములోని అంకురము వలె బీజరూపముగా నుండి ప్రకటము గానప్పుడు నిర్గుణముగా తోచినది. ఆ సత్వ రజోతమోగుణములే ఈశ్వర జీవ జగత్తులుగా కార్యరూపములో గాన వచ్చు చున్నవి. ఈశ్వరుడు మూర్తి భేదముచే త్రిమూర్తులుగా ఆరాధించబడుతు సగుణ బ్రహ్మమని ఆరాధించబడుచున్నాడు. ఈ బ్రహ్మము దృశ్యమగు ప్రపంచమునకు పరంగా కూడా ఉన్నది. కనుక దానికి పరము అని పేరు వచ్చినది.

బ్రహ్మము తన నిజ రూపములో ప్రకటముగానందున అది అవ్యక్తము గానున్నది. కాని అదే విశ్వరూపముగా ప్రకటమై యున్నది. అందుకే ముండ కోపనిషత్తు "**బ్రహ్మైవేదం విశ్వమిదంవరిష్ఠమ్**" అని చెప్పియున్నది. అది తన నిజరూపములో ప్రకటముగాక విశ్వరూపములో ప్రకట మగుచు (వ్యక్తమగుచు) నిజరూపములో వ్యక్తమగుటలేదు. కనుక అది వ్యక్తా వ్యక్త రూపముగా ద్వంద్వ రూపముగానున్నది. కాని పరిపూర్ణ పరబ్రహ్మము అట్లు గాక "**విధతాత్ అవిధితాత్**" అంటే తెలిసిన దానికంటే మరియు తెలియని దాని కంటే "**అధి**" అతీతముగానున్నది.

**అధి = అతీతమైనది లేక శ్రేష్ఠమైనది. అతిక్రమించి మీరి యుండుట అని అర్థము.** పరిపూర్ణబోధయే అతీతమార్గము. ఇందు ప్రవేశించిన సాధకులు అభ్యసించవలసిన విధానము ఎట్లు? అనగా సృష్టికి పూర్వము గల బ్రహ్మమే మోక్షస్థానమని అది సాధించిన వారికి జనన మరణము లుండవని యితరులందురు. ఇది భ్రాంతి మాత్రమే. ఈ భ్రాంతిని వదలుటే పరిపూర్ణ బోధ యందు ప్రవేశించిన సాధకుల కర్తవ్యం. ఈ భ్రాంతిని వదిలినచో యెరుక సమస్తమునందు భ్రాంతి రహితమగును. ఏ కోరికలుండవు. ఒక్క జన్మ రహితమందు తప్ప దేనియందు యెట్టి భ్రాంతి లేకుండుటే అతీతమార్గము.

దేనికతీతము ? అంటే శబ్దాది విషయములలో సంయోగము చెందు యింద్రియములకు, ఆ ఇంద్రియముల ద్వారా వర్తించు మనస్సుకు, ఆ మనస్సుకు సత్తాయిచ్చు ప్రత్యగాత్మకు, దానికి భిన్నమగు అఖండ చిద్ఘన మూర్తియగు పరమాత్మకు కూడా తెలియరాక మనోవా గోచరమైనది గాక యున్నదని అర్థము. దేనికి అవిజ్ఞేయమై పంచ తన్మాత్రలు లేశమైన తనయందు లేక, సర్వ లక్షణ విలక్షణమై యున్న పరిపూర్ణ పరబ్రహ్మమునకే అతీతమన్న మాట వర్తించును గాని సృష్టి కారణమైన బ్రహ్మమునకు

ఆ మాట వర్తించదు.



**శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మ దేహో నాస్తి కదాచన**
**అస్తి నాస్తీతి కోవేద నిర్ణయో నాస్తి సర్వదా ॥**

తా॥ ఆత్మ కతీతమై విలక్షణమై కేవలాత్మ (పరిపూర్ణ పరబ్రహ్మము) ఒప్పు చున్నది. శరీరాత్మలతో కూడిన శరీర మెప్పుడునులేదు. కనుక ఉన్నదని గాని, లేదనిగాని తెలుసుకొనుటకు ఎవరున్నారు? ఎప్పుడు యే నిర్ణయములు లేవు అని తాత్పర్యము. ఆత్మ, బ్రహ్మమని రెండు శబ్దాలచే వ్యవరించబడు వస్తువొక్కటేగాని వేరుగాదు. **"ఆకాశం శ్శరీరం బ్రహ్మ"** అని శ్రుతి చెప్పుచున్నప్పుడు ఈ బ్రహ్మము నిరావరణ మన తగునా? కానే కాదు. ఏలననగా సృష్టిరూపము దాల్చు అపరిమిత సంకల్పశక్తి ఆబ్రహ్మము నందే బీజరూపముగా నుండి ఆవరణాత్మకమై ఆకాశాది భూతములుగా పరిణమించి ఈశ్వర జగత్తులుగా విజృంభిచెనని చెప్పి తీరవలసినదే. అంటే తొలుత చిద్ఘనస్థితిలో నున్న బ్రహ్మకు తనయందు నిగూఢముగా నున్న త్రిగూణాత్మకశక్తి చే శరీరాత్మలుగా ద్వయ దోష దూషిత మాయెను. అంటే సృష్టికి పూర్వము చిద్ఘనమైయున్నప్పుడు బ్రహ్మమనీ, సర్వశరీరస్త చైతన్యమైనప్పుడు ఆత్మయని పేరొందెనని గ్రహింపనగును.

పరిపూర్ణ పరబ్రహ్మమే కేవలంగా యున్నది. కేవలం అనె మాట తాను తప్ప తదితరమేదియు తనయందు గాని, తనకు వేరుగాక యీ షణ్మాత్రము లేకుండా బాహ్యా భ్యంతర బేధము లేక సంపూర్ణముగా నిండి యున్న పరిపూర్ణమునకే తప్ప మరేదానికి వర్తింప జాలదు. కనుకనే పరిపూర్ణ పరబ్రహ్మము. "అది" శ్రేష్ఠమైనది, కారణబ్రహ్మము కంటే అతీతమైనది.

**ఇతిశుశ్రుమ పూర్వేషాం యే నస్తద్ వ్యాచ చక్షిరే=** యే = ఎవరైతే; నః = మాకు; వ్యాచ చక్షిరే = వివరించారో; ఆః పూర్వేషాం = పూర్వీకుల నుండి; ఇతి = ఇలా; శుశ్రుమ = మేము విన్నాం;

దానిని మాకు వివరించిన పూర్వీకులనుండి మేం ఇలా విన్నాం. **నైవవాచా న మనసా ప్రాప్తుం శక్యో నచక్షుషా । అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥క౦॥**

ఆ పరిపూర్ణ పరబ్రహ్మము మాటల ద్వారా కన్నుల చేత మనస్సు చేత కూడా పొందడానికి సాధ్య పడేది కానే కాదు. అది ఉన్నది అని చెప్పేవారి నుండే దాన్ని పొందాలి ఇతరత్రా దాన్ని పొందడము ఎలాగ? (పొందలేము) అని కఠోపనిషత్తు కూడా స్పష్టంగా చెప్పింది. అంటే పరిపూర్ణ గురువు ఒక్కడు మాత్రమే దానిని తెలిసినవాడు. అతని నుండే దానిని పొందవలసి యుండును.

**"సాక్షాత్కృత ధర్మాణః"** ధర్మమును సాక్షాత్కారింపచేసుకొన్న వారు గనుకనే తమ శిష్యులను దర్శింప చేయగలరు. ఆ తర్వాత పరిపూర్ణ పర బ్రహ్మమును అపరోక్షము గావించగలరు. వేదము లెంత సనాతనమో అంతే సనాతనమైనది. **"అధ వైకుంఠో**

నీలకంఠం ప్రణమ్య స్వామిన్ సర్వలోకైక నాథ ! బ్రహ్మైవాహం భ్రాన్తినాశం కురుష్వ। ఈశ ఏ తద్వ్యాపో వ్యాపరాత్పరం పూర్ణముపైతి నాథో విష్ణోర్భక్త్యా సమాదరా త్పంచ వక్త్ర ఉవాచ"

తా ॥ వైకుంఠ నిలయము గాగల విష్ణుదేవుడు నీలకంఠునికి ప్రణమిల్లి స్వామి! సర్వలోకములకు ప్రభువైన వాడా! "బ్రహ్మమునేనైతిని" అనె భ్రాంతిని నాశనము చేయుము. పరమేశ్వరా! పరమాత్మకంటే పరమై ఆ పరిపూర్ణ పరబ్రహ్మము ఏ విధముగా వ్యాపించి యున్నదో, అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును పొందుదునా? అని అడుగగా విష్ణు భక్తికి మెచ్చి సమాదరణతో పంచముఖుడైన నీలకంఠుడు యిట్లు చెప్పు చున్నాడని భావము. ఈ ఉపనిషద్మంత్రమును పరిశీలించిన ఇందు **"నేను బ్రహ్మనైతిని"** అనె భ్రాంతిని నాశనము చేయుమని విష్ణుదేవుడు పరమశివుని కోరియున్నాడు. భ్రాంతిరహితమే మోక్షము. **"భ్రాంతి యుడిగిన బ్రహ్మంబు బట్టబయలు"** అని చెప్పబడినది. కావున ఆదిగురువైన దక్షిణామూర్తి కాలము నుండి నేటి వరకు ఈ పరిపూర్ణ బోధ గురుపరంపరంగా శిష్యులకు ప్రబోధించబడుట మనము చూస్తూనే ఉన్నాము. ఈ బోధను తానొక పూర్ణ గురువుని ఆశ్రయించి ధర్మోపదేశము పొంది సాంప్రదాయక సిద్ధాంతమును అవగాహన చేసుకొన్నవాడై **"స్వయం తీర్ణః పరాంతారయతి"** అనే న్యాయంగా తాను సర్వభ్రాంతి రహితం చేసుకొన్న పిదప ఏ తత్పీఠాధిపతి వలన బోధాధికారం పొంది తదాజ్ఞానుసారం మాత్రమే శిష్యసేకరణ గావించి ప్రబోధ ప్రచారములు గావించు వాడై యుండవలెను. పరిపూర్ణ గురువులకు మాత్రమే ఈ బోధలోని మర్మధర్మములు తెలియును. కావున "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్య ధాగ్రంథకోటిభిః" గురుముఖంగా బోధ బడయవలయును. మరొక మార్గము లేదు. కనుక ఈ మంత్రమున గురుడు దానిని మనపూర్వీకుల నుండి అనగా పరిపూర్ణ గురువుల ద్వారా వినినట్లు తెల్పియున్నాడు.

5. యత్ వాచా నభ్యుతం యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥

ఏది వాక్కు ద్వారా వ్యక్త పరచబడజాలదో అది మాత్రమే బ్రహ్మమని అనగా పరిపూర్ణబ్రహ్మమని నీవు తెలుసుకో. దేనివలన వాక్కు వ్యక్తమగునో, ఇక్కడ ప్రజలు ఉపాసించుచున్నారో అది బ్రహ్మము కాదు.

**పరిపూర్ణ ప్రబోధామృతము :**

**యత్ వాచా నభ్యుతం** = యత్ = ఏది; వాచా =వాక్కుచే, అనభ్యుతం = వ్యక్తపరచ బడజాలదో;

**తదేవ బ్రహ్మత్వం విద్ధి** = తత్ ఏవ = దానినే; త్వం = నీవు; బ్రహ్మ = బ్రహ్మము అని; విద్ధి = తెలుసుకొనుము.

పృథ్వీ అధిష్ఠానదేవత బ్రహ్మ. బ్రహ్మ ప్రత్యగాత్మ ప్రకాశము నోరు స్థానమందు జేరి శబ్ద

తన్మాత్రతో కూడి వాక్కు ఆయెను. ఈ వాక్కుకు అధిష్ఠానా దేవత అగ్ని. అగ్ని వాక్కు మిశ్రమమై వచనము చేయును.

మాటలచే ప్రకటించ బడజాలనిది మాత్రమే బ్రహ్మమని నీవు తెలుసుకో, అది ఎట్లో పరిశీలింతము. పరిపూర్ణ పరబ్రహ్మ మందు ఎరుగునట్టి ఎరుకలేదు. **"యతోవాచో నివర్తింతే అప్రాప్యమనసా సహ"**॥ తైతిరీయోపనిషత్ ॥ మనస్సు వాక్కు దేనిని తెలుసుకొనుటకై అసమర్థములై వెనుకకు మరలెనో అది పరి పూర్ణ బ్రహ్మమని తైత్తరీ యోపనిషత్తు ఉపనిషద్వాక్యార్థము.

అగ్నియొక్క సూక్ష్మాంశమగు శబ్దము ధ్వన్యాత్మకము అనబడును. ఈ ధ్వన్యాత్మకమగు ఈ శబ్దము వ్యష్టిశరీరోపాధియందు వర్ణాత్మకముగా నిర్ణయించిన దానిని మాటయని చెప్పబడును. ఈ మాటల సముదాయమే మానవుల చేత నిర్ణయించిన అపౌరుషేయ పౌరుషేయమగు వేదశాస్త్ర పూరాణ ఇతి హాసాది సర్వశాస్త్రంబులు. కనుక నేనన్న, మాయ యన్న, జీవుడన్న ఈశ్వరుడన్న, బ్రహ్మయన్న, నేను మేను అన్న, మాటల నిర్ణయమే కాని దానికి వస్తు నిర్ణయము లేదు. కనుక ఇది మానవ నిర్మిత శబ్ద ప్రపంచము.

వర్ణాత్మకమునకు మూలమగు ధ్వన్యాత్మకము పరిపూర్ణ పరబాహ్యామందు లేదు. కనుక అట్టి దానిని వర్ణాత్మకము ఎట్లు వర్ణించి చెప్పును? అంటే చెప్పజాలదు. అయినా వర్ణాత్మకము వలన యేమి నిర్ణయింప బడుననగా పరబయలు నందు ధ్వన్యాత్మకములేదని నిశ్చయింప బడును గాని పరబయలు ఇట్టిది అట్టిదని (క్షరాక్షరములు గానిది) నిర్ణయింపరాదు. ఈ క్రింది కఠోపనిషత్తు మంత్రము 2-3-12 కూడా ఈ భావమునే ప్రకటించు చున్నది. **"నైవచా నమనసా ప్రాప్తుంశక్యోన న చక్షుషా అస్తీతి బ్రువతోఽ నత్యకథం తదు పలభ్యతే"** తా॥ పరపూర్ణ పరబ్రహ్మము వాక్కు, మనస్సు చక్షువులకు ప్రాప్తింపరానిది. ఉన్నది అని చెప్పుట వినా మరోకరీతిగా ఉపలబ్ధికాజాలదు. ఈ భావమునే శ్రీ కృష్ణదేశిక ప్రభువులు 34 వ.క.దు॥ నందు **"పలుకున బలుకగా రాకను॥ తలపోయుద మనిన మదికి దగులక యెపుడున్॥ ములుగ్రుచ్చసంధి లేకను॥ కలిగున్నది బట్టబయలు గద రామాయన్నా"** అని స్పష్టంగా చెప్పియున్నారు. అనగా పరిపూర్ణ పరబయలు వాచ్య వాచ్యార్థముగా అందునట్టిది గాదు. లక్ష్య లక్ష్యార్థముగా తలపోయుడమనిన మనసుకు తగులదు. అనగా సాధ్యము గాదు. ముల్లు గ్రుచ్చు టకు కూడా సందులేకుండా అంతట నిండినిబిడీకృతమై యున్నది. అని సెలవిచ్చియున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు రూపము లేదు. రూపములేని దానిని అది ఇట్లున్నది అట్లున్నది అని వర్ణించి చెప్పుటకు వీలుకాదు. మాటలు లేవు. అందుకే పలుకుడిగిన అయ్యవారే అచల ఋషులు.

అపూర్ణ వస్తువునకు పూర్ణమని నిర్ణయము. ఎట్లనగా స్థావర జంగమ జీవోపాధులందు ఏ ఉపాధికి ఆ ఉపాధే పూర్ణముగా నున్నట్లు తెలియుచున్నది. వీటికి

కారణమైన వస్తువు అగు ఎరుక మరియు అధిష్ఠాన చేతన బ్రహ్మము పరిపూర్ణమని నిర్ణయము. కనుక పరిపూర్ణమనే వాక్యమందు దాని కార్యరూపమైన స్థావర జంగమ నిర్ణయములు తెలియునుగాని పరబ్రహ్మనిర్ణయము తెలియదు. కనుక పరబ్రహ్మము బయలని, పరిపూర్ణమని వాక్యములచేత నిర్ణయించుటకు సాధ్యంకాదని నిర్ణయము.

అంతేగాక క.ద. 40 **"కనవచ్చి యిట్టి దట్టిది యనరాకుండు బయలు। నదే కను గొను మీ..."** అని శెలవిచ్చి యున్నారు. అనగా పరబయలు అగుపడి వాక్కు చే అటువంటిది ఇటువంటిదని చెప్పుటకు అలవిగాకుండ యుండును. అదిగో దానిని చూడుమన్నారు. అంటే ఎరుకలేక చూడుమన్నారు.

సృష్టికర్తగాని, సృష్టిలో మరేది గాని లేనిదే పరిపూరపరబ్రహ్మము. సృష్టికారణమగు బ్రహ్మస్వరూపమే అందరియొక్క స్వస్వరూపములు (నిజరూపములు). కాని చెప్పే తాను కూడా లేనప్పుడే పరిపూర్ణ పరబయలనేడి పేరు ఆ కేవల బ్రహ్మమునకు సార్థకమగును. నిజముగా యోచించిన చో అప్పుడు పరిపూర్ణమని పలుకుటకు ఎవరున్నారు. కావున పరిపూర్ణ పరబ్రహ్మ శబ్దమొక్కటే నరుని నోట యెంగిలి కానిది. మిగతా సమస్తము వాక్కుతో ఉచ్చరించుటకు అభ్యంతరము లేదు. కనుక వాఙ్మయమంతయు ఉచ్చిష్టమే. వాక్కుతో వచించరానిది. ఆ పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే. కావున వాక్కుచే ప్రకటించ బడజాలనిది మాత్రమే బ్రహ్మమని తెలియును.

**యేన వాగభ్యుద్యతే** = యేన = దేనిచేత; వాక్ = మాటలు; అభ్యుద్యతే = ప్రకటింప బడతాయో

**నేదం యదిద ముపాసతే :** యత్ = ఏదైతే; ఇదం = ఈ (లోకః = జనలు) ఉపాసతే = పూజిస్తున్నారో; ఇదం = ఇది; న = కాదు.

మాటలచే ఏది ప్రకటించ బడుతుందో, ఇక్కడ ప్రజలు పూజించేది బ్రహ్మముకాదు. ఎవడు వాక్కునకు కారణమగుచున్నాడో అతడు బ్రహ్మముకాదు. కారణమగు బ్రహ్మము వాక్కుకు అధిష్ఠానముగా నుండుటచే బ్రహ్మమే కర్త మరియు భోక్త కూడా అయియున్నాడు. పృథ్వి అధిష్ఠాన దేవత బ్రహ్మము. బ్రహ్మ ప్రత్యగాత్మ ప్రకాశము నోరు స్థానమందు జేరి శబ్ద తన్మాత్రతో గూడి వాక్కాయెను. వాక్కుకు అధిష్ఠాన దేవత అగ్ని. వాక్కు అగ్ని మిశ్రమమై వచనము జేయును. పృథ్వీ యొక్క "లం" బీజ ప్రాణచలనము వాక్కుయందు జేరి వచనము జేయునని సాంఖ్యము తెలుపుచున్నది. మరియు పృథ్వీ యొక్క గుణము గంధ తన్మాత్రాంశములు - వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదము ఇవి కర్మేంద్రియములు. వాక్కు కర్మేంద్రియము లలో మొదటిది. పంచ భూతముల పంచీకరణమును పరిశీలించిన వాక్కు కర్మేంద్రియములోనిది. ఈ 24 తత్వములన్ని జడములగుట వల్ల వాటి వెనుక నుండి వాటిని నడిపించు నది ఆత్మ. ఉపాధిగతమైనప్పుడు ప్రత్యగాత్మ, ఉపాధి వెలుపల నున్నప్పుడు బ్రహ్మమని పిలువ

బడుచున్నది. ఈ మంత్రము నందు మాటలు వెనుక నుండి మాటలు పలికించు ఆత్మ బ్రహ్మము కాదంటుంది ఈ ఉపనిషద్వాక్యము.

ఆత్మయనగా సకల ప్రాణులందు, సమస్త జీవులందు బాహ్యాభ్యంతరములనే భేదములేక వ్యాపించి యున్నదని వ్యుత్పత్త్యర్థము. ఆత్మ, బ్రహ్మము రెండు ఒక్కటేనని ఇది వరకే గుర్తించినాము. అట్టి బ్రహ్మము పరిపూర్ణపరబ్రహ్మముకాదు. అది కారణబ్రహ్మము. మాయాబ్రహ్మము, ఎరుక బ్రహ్మము అని వ్యవహరించబడును. ఈ బ్రహ్మము సత్యముగాదు. ఎందుకనగా రెండు సత్యములుండుటకు వీలులేదు **"ఏకం సత్ విప్రా బహుధావదంతి"** సద్రూపమగు బ్రహ్మమును అనేక విధములుగా, అనేక పేర్లతో జ్ఞానులు చెప్పుచున్నారు. ఈ సదసత్తులకు అతీతమైన బ్రహ్మమే పరిపూర్ణ పరబ్రహ్మము **"న సత్తాన్న సదుచ్యతే"** ఈ పరిపూర్ణ పర బ్రహ్మము సత్పదార్థముగాదు, అసత్పదార్థముకూడ కాదు. అది ఏది కాదు. అది వాచామగోచరము. వాఙ్మనసుల కందనిది. అది ఏకైక సత్యమగు బ్రహ్మము. కారణ బ్రహ్మము సత్యము కాజాలదు. సృష్టికారణమగు బ్రహ్మము జగత్కారణమనీ, జీవేశ్వరజగత్తు కార్య రూపమనీ శ్రుతి స్మృతులు ఘోషించుచున్నవి. అయితే కారణ కార్య సంబంధము నందు కారణ వస్తువు కార్యరూపము చెందునని, కార్య వస్తువులు ప్రతి సంచరపద్ధతిలో కారణ రూపము చెందునని సిద్ధాంతము. **"తస్మాద్వా, ఏతస్మాదాత్మన, ఆకాశద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యాదౌషదీయః, ఓషదేభ్యో అన్నం, అన్నాత్పురుషః"** అను శృతి ఆత్మను అత్యంత మూలకారణ వస్తువుగా నిర్ణయించినది. జీవికి అన్నము, అన్నమునకు పృథ్వీ, పృథ్వికి జలము, జలమున అగ్ని, అగ్నికి వాయువు, వాయువునకు ఆకాశము, ఆకాశమునకు ఆత్మ ఉత్తరోత్తర కారణములయిఉన్నవి. అయితే ఆత్మకు కారణమేమి? అని ప్రశ్న వేస్తే దానికి కారణములేదు. అది స్వయం భూః అని చెప్పబడును. దానికి మూలము లేదన్న మాట. మూలములేని వస్తువు ఉండుట అసంభవము. కార్య రూప వస్తువు కారణముగా ఉండి తీరవలెను. అయితే సర్వకారణ మైన బ్రహ్మమునకు కారణము (మూలము) లేదు. కనుక అది సత్యమైన వస్తువు కాజాలదు. మరియు సత్యమైన పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు (ఎరుకకు) మూలముగాని స్థానము గాని బీజముగాని లేదు. కనుక ఈసృష్టి, దాని కారణ వస్తువు తో సహా అనగా కారణ బ్రహ్మతో సహా అసత్యమే కాని కారణ బ్రహ్మము సత్యము, జగత్తు అసత్యము అని మత వాదులనరాదు. కావున ఎవడు వాక్కునకు కారణమగుచున్నాడో అతడు బ్రహ్మము కాదు అని నిర్ద్వంద్వముగా చెప్ప వచ్చును.

ఇంకా కొంత విచారించిన **"ఆత్మనోన్యం నకించన" "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తేన వినా తృణాగ్రమపి నచలతి"** అను శ్రుతులు చెప్పుచున్నవి. ఆత్మ కంటే అన్యము లేదు. అంతా బ్రహ్మమే మరియు నేనులేక గడ్డి పోచ కొన నైన కదలదు. అటువంటప్పుడు

చూచేది, వినేది, కనేది, మాట్లాడేది ఏది అనగా అంతా ఆత్మనే. ఆత్మ సత్తాలేక ఏదీ కదల జాలదు. విషయేంద్రియములైన శబ్ద, స్పర్శ, రస, రూపగంధములను ఆత్మకు ఉపకరణములై చెవి, త్వక్కు, నాలుక, కన్ను, ముక్కు ద్వారా తెలుసు కొంటున్నది. కావున మాట్లాడేది, మాటలు మాట్లాడించేది ఉపాధి గతమై యున్న ఆత్మయే. ఈ ఆత్మ సృష్టికి పూర్వము చిద్ఘనమైయున్నప్పుడు బ్రహ్మము అన్నారు. కాని అది కేవల పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. అందుకే కారణ బ్రహ్మము, బ్రహ్మము కాదని ఈ ఉపనిష ద్వాక్యార్థము.



**నేదం యదిద ముపాసతే** = యత్ = ఏదైతే ; ఇదమ్ = ఈ (లోకః = జనులు); ఉపాసతే = పూజిస్తున్నారో; ఇదం =ఇది; న = కాదు

ఏదైతే ఈ లోకమున జనులు ఉపాసించు చున్నారో అది పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. పరిపూర్ణమందు ఎరుకలేదు. కనుక దాని కహం వృత్తి లేదు. అది అహమును పుట్టించదు. అహంకారమును ఎరుగదు. కనుక యేనిర్ణయము చేయదు. ఉపాసించ దగినదిగాని , ధ్యానింపదగినది గాని గాదు. వరమీయదు, శపించదు. **"ఆత్మత్యే వోపాసీత" "ఓమిత్యం పాసీత" "భూమాన మిత్యుపాస్వ"** చాందోగ్య॥ తా॥ ఆత్మ అని ఉపాసింపుము, ఓంకారముగా దానిని ఉపాసింపుము, భూమా అని అది చాలా గొప్పవస్తువని ఉపాసింపుము, **"ఆత్మనమిత్యుపాస్వ"** అనియు మరియు **"ఆత్మవాఽరేద్రష్టవ్య శ్రోతవ్యోమంతవ్యోనిధిధ్యాసితవ్యః॥ బృహ॥** మరియు ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది, ధ్యానముచే పొందదగినదిగా చెప్పబడ్డ బ్రహ్మము అనగా ఆత్మ, ప్రణవము, సచ్చిదానంద బ్రహ్మము ఇత్యాది నామములచే ప్రసిద్ధమగు అధిష్టాన చేతన బ్రహ్మము పరిపూర్ణపర బ్రహ్మముకాజాలదు. **"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"** అని బ్రహ్మ సూత్ర రచన ప్రారంభించిన వ్యాసుల వారు వెంటనే **'జన్మాద్యస్యయతః'** అని సూత్రీకరించినారు. అనగా సృష్ట్యాదులకు కారణమగు బ్రహ్మమే జిజ్ఞాస గావింపబడుచున్నది. అని వ్యాసుల వారు స్పష్టంగా జెప్పినట్లే. పరిపూర్ణ పరబ్రహ్మము జిజ్ఞాసితవ్యముగాదు. శబ్దబ్రహ్మమునకు సంబదించినదే. శ్రవణమననాదులకు చిక్కునది, ధ్యానింపదగినది, ఉపాసింపదగినది అగుచున్నది. అది కేవల పరిపూర్ణ పరబ్రహ్మము కాదని పైన ఉదహరించిన కేనోపనిషద్మంత్రమునందు చెప్పబడినది. అయినప్పటికి **'శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి'** అని చెప్పబడింది. అనగా శబ్దబ్రహ్మము తెలిసినగాని ఆ శబ్ద బ్రహ్మమునకు పరమైన పరిపూర్ణపరబ్రహ్మము తెలుసుకొనుటకు అధికారి కాజాలడని పరిపూర్ణ భావజ్ఞులు జెప్పుదురు. కావున ఇచ్చట జనులు పూజించేది పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. పరిపూర్ణపరబ్రహ్మమే బ్రహ్మమని నిర్ణయము.

6. యన్మనసాన మనుతే యేనాహుర్మనో మతమ్।

తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

మనస్సు చేత గ్రహింప రానిది మాత్రమే బ్రహ్మము అని (పరిపూర్ణ పరబ్రహ్మమని) నీవు తెలుసుకొనుము. దేని సహాయము చేత మనస్సు గ్రహింపబడుచున్నదో, ఈజనులు ఇక్కడ పూజించేది బ్రహ్మ కాదని తెలుసుకో.

**పరిపూర్ణ ప్రబోధామృతము :**

**యన్మనసాన మనుతే** = మనసా=మనస్సు చేత, యత్= ఏది, నమనుతే=గ్రహించబడదో; **తదేవ బ్రహ్మత్వంవిద్ధి** = తత ఏవ = దానినే., త్వం =. నీవు., బ్రహ్మ = బ్రహ్మము అని., విద్ధి=తెలుసుకొనుము. అనగా మనసు చేగ్రహింపరానిది మాత్రమే బ్రహ్మమని తెలుసుకొనుము. ఆకాశాదిష్ఠానదేవతయగు సదాశివ ప్రత్యగాత్మ ప్రకాశము కంఠస్థానమందు జేరి స్పర్శతనాత్రతోగూడి మనస్సాయెను. మనస్సునకు అధిష్ఠానదేవత చంద్రుడు. ఈ చంద్రుడు మనస్సు మిశ్రమమై సంకల్ప వికల్పములు జేయు చుందురు. ఇది వాయు భూతము.

అంతరేంద్రియములలో జ్ఞానము తర్వాత రెండవ స్థానము లో మనస్సు గలదు. ఇట్టి మనస్సుతో కూడా గ్రహింప రానిది మాత్రమే బ్రహ్మము అనగా పరిపూర్ణ పరిబ్రహ్మము. అదెట్లో పరిశీలిద్దాము. మొదట శ్రీకృష్ణదేశి కేంద్రులవారి కందార్థదర్పు 34తో ప్రారంభిద్దాము. "**పలుకన బలుకగ రాకను। తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్।**" అని శెలవిచ్చి యున్నారు. అనగా పరిపూర్ణ పరబయలు వాక్కుచే చెప్పుటకు వీలుకాదు. లక్ష్య లక్ష్యార్థముగా మనస్సులో దానిని తలంచుటకు వీలులేదు. అంటే మనస్సు పరిపూర్ణ పరబ్రహ్మమును చేర లేక వెనుదిరుగును. పరిపూర్ణ పరబ్రహ్మమునందు మనస్సుతోచుచున్నది గాని మనస్సు నందు పరబాహ్యము లేదు. ఎట్లనగా సముద్రము నందు చేప తెలుయుచునున్నది గాని చెపలో సముద్రము లేదు. కనుక చేపకు సముద్రమును మననము చేయుటకు ఎట్లు సాధ్యపడదో, అట్లే పరబాహ్యమును మననము చేయుటకు మనస్సుకు సాధ్యము గాదు. పరబ్రహ్మము జగత్తును పుట్టించగోరి శ్రుతి॥ సో౾ **కామయుత బహుస్యాం ప్రజాయేయేతి**' యని తలంచి జగత్తును పుట్టించినాడు. అటువంటి తలంపు పరిపూర్ణ పరబయలుకులేదు. మనస్సు వ్యష్టి రూపముగా జీవుని యందు, సమిష్టి రూపముగా ఈశ్వరుని యందు, సమిష్టి భేదము కోల్పోయి సృష్టి కి పూర్వమునందును ప్రళయానంతరము కేవలమఖండ రూపమై స్వప్రకాశ చేతన మందు సాక్షి రూపము వహించు చున్నది. ఈ మనస్సే అప్పుడు స్వవశీయ మనస్సు అనబడును. కనుక జీవేశ్వర బ్రహ్మస్థానముల మూండింటి యందు జీవుని యందుండి, జాగ్రదవస్థలో 25 యింద్రియముల ద్వారా, స్వప్నావస్థలో 17 యింద్రియముల ద్వారా, సుషుప్త్యావస్థయందు స్వస్థానమైన అంతః కరణమందు అజ్ఞానములో ఉంటుంది. మనస్సు ప్రాణముతో కూడితల్లిగర్భము జేరి బిడ్డయందు క్రమశః వికాసము చెంది తిరిగి

మరణమందు ఉదానవాయువుతో చేరి,పిదప వ్యష్టిదేహము నందు చేయవలెను అంది ఉంటుంది. ఆ విధంగా వ్యష్టి మనస్సు అవస్థాత్రయములందు జనన మరణములందు తిరుగుచున్నది సర్వము మనస్సే.

**శ్లో॥ శృణుష్వ విద్వన్ మన ఏవ జీవో, మన ఏవ విశ్వం మన ఏవ ఈశః॥**
**మన ఏవ మాయా, మన ఏవ బంధో, మనోలయే ముక్తి రయ యదార్థః ॥**

॥ జీవన్ముక్తి ప్రకాశిక॥ అనగా మనస్సే జీవుడు, మనస్సే విశ్వము, మనస్సేఈశ్వరుడు, మనస్సేమాయా, మనస్సేబంధము, మనస్సులయమైన ముక్తి. ఇది యదార్థము. అట్టి మనస్సును యేస్థానమందున్ననూ లేకుండా చేయుట అమనస్కము. ధ్యాన పద్ధతి లో. అనగా అన్యవస్తు చింతనలేక మనస్సు నేకాగ్ర మొనర్చుట వల్ల మనోనాశనమందుట.తురీయావస్థ అని చెప్పబడే సమాధి యందు కూడా ఈమనస్సు రహితమగుట లేదు. నిర్విషయరూప విశ్రాంతి సుఖమునకు సాక్షిగా నుండి తిరిగి వ్యుత్థాన దశయందు జాగ్రత్తలో సంపూర్ణ రూపమును పొందుచున్నది. **శ్లో॥ 'విక్షిప్తావా సమాధిర్వా మనస్యాధ్వికారిణః'** ॥ వేదాంతదశి॥ కనుక సమాధి యందు కూడా మనస్సున్నది. ఇక ఈశ్వరస్థానములో సమిష్టి సూక్ష్మ శరీరాభిమానియగు హిరణ్యగర్భుని యందుండి ప్రళయామోదములు అనగా తిరోభావార్విభావములు చెందు చున్నది. సృష్టికి పూర్వం తాను తానుగా అనంతరము అధిష్ఠాన స్థానమందు సృష్టి స్థితిలయనులకు సాక్షిగాయున్నది. ఇట్టి మనస్సు చేత కూడా పరిపూర్ణ పరబ్రహ్మము తెలియరాదు. ఎందుకనగా మనస్సు పరిపూర్ణ పరబ్రహ్మమందులేదు. అది ఏది కాదు. అందు ఏమిలేదు. కనుకనే దానిని 'నిశ్శక్తి నిర్మలం పూర్ణం' అని అన్నారు. 'మనసైవాను ద్రష్టవ్యం., మనసైవాను శ్రోతవ్యం' మనస్సు చేత యీ బ్రహ్మము (అధిష్ఠాన చేతన బ్రహ్మము) చూడ దగినది వినదగినది. అనగా ఆత్మశుద్ధ మనస్సుకు గోచరించుచున్నది. కాని పరిపూర్ణ పరబ్రహ్మము మనోవాక్కుల కందరానిదై యున్నది. అందుకే కంటికి, మనస్సుకు గోచరించనిది మాత్ర మే బ్రహ్మమని ఈ మంత్రమున నొక్కి చెప్ప బడినది. బయలు ఎరుకల (అధిష్ఠాన బ్రహ్మముల) అత్యంత విభిన్న తత్వమును గూర్చిన ఈ కృష్ణదేశికుల కందార్థదర్వ61 పరిశీలిద్దాము. **"దానము ధర్మము సగుణ ధ్యానము ప్రతి మార్చనంబు తజ్జప తీర్థ స్నానము ।లివి ముక్తిదమని। మానవులొనరించిన బయలు మాటాడదేమీ ! ఔను కాదనక నీవనక నేనన కొక్క! మేనైన తాగాక మితిమీరి యున్నాది".** అనగా ప్రపంచ మందలి మానవులు మోక్షభ్రాంతి చేత దాన ధర్మములు, మూర్తి పూజలు, మంత్ర జపములు, తీర్థ యాత్రలు చేయుట చేత మోక్షము కలుగునని నిర్ణయించుకొని చేయుచున్నను పరబయలు మాట్లాడలేదు. ఎందుకనగా ఎరుక పద్ధతుల ఔనని కాదని, నీవని, నేనని, స్థూల సూక్ష్మ కారణ మహాకారణ కైవల్య శరీరములో నేదియుగాక పరబాహ్యము ఆది మధ్యాంతము అనునది లేక నిండియున్నదని భావము. రెండు బ్రహ్మములకు గల అత్యంత భిన్నత్వము గల దానిలో మనస్సుతో తెలియరానిది మాత్రమే

బ్రహ్మముకాని దేని సహాయముతో, మనస్సు గ్రహింపబడుచున్నదో అది బ్రహ్మముకాదు.


**శ్లో॥ జ్ఞేయ వస్తు పరిత్యాగే విలయం యాతి మానసం।**
**మానసే విలయం యాతే కైవల్య మవశిష్యతే॥** ॥శాండిల్య॥

తెలియదగినది లేనప్పుడు మనస్సు నాశనము చెందుచున్నది. మనస్సు నాశనము చెందగ పరిపూర్ణ పరబాహ్యమేశేషించును. ఈ ప్రకారము అచల పరిపూర్ణ పర బాహ్యము యొక్క నిర్ణయము ఆగమ నిగమ ఉపనిషత్ సాగర మధితార్థమున తేలిన సచ్చిదానందబ్రహ్మమున కతీతము అచల పరిపూర్ణ పరబాహ్యమని నిర్ణయము.

**యేనా హుర్మనో మతమ్** = ఏన = దేనిచేత, మన = మనస్సు, మతమ్ గ్రహించబడుతుందో, **నేదం యదిద ముపాసతే** : యత్ = ఏదైతే; ఇదం = ఈ (లోకః = జనలు) ఉపాసతే = పూజిస్తున్నారో; ఇదం = ఇది; న = కాదు.

మనస్సు చేత గ్రహించబడునది బ్రహ్మము కాదు. అదేట్లో పరిశీలింతము. ఆకాశమునందలి అష్టాంశము వాయువుతో చేరి మన స్సాయేనని సాంఖ్యము చెప్పుచున్నది. జ్ఞానేంద్రియములచే విషయపంచకము తెలుసుకుని అంతః కరణమునకు చేర్చి వాని యుక్తాయుక్తములను బుద్ధిచే నిర్ణయించి కర్మేంద్రియములచే కర్మచేయును. జ్ఞానేంద్రియములచే తెలుసుకున్న విషయ పంచకమునందు శబ్ద స్పర్శ, రూప, రస, గంధములు పని చేయుచున్నవి. జ్ఞానేంద్రియములలో పనిని బట్టి సంకల్ప వికల్పములు మనసునకు ఆధిభౌతికము, కనుక మనస్సుకు విషయములు రూప, రస, గంధాదులే. కనుక విషయములైన మనస్సు సంకల్ప వికల్పములు చేయును. విషయముల యొక్క ఆకర్షణ లేకుంటే అంతరేంద్రియములలో ఒకటైన మనస్సుకు సంకల్ప వికల్పములు లేవు కనుక సంకల్ప వికల్పములే మనస్సుకు పనిగా (విషయములుగా) నున్నవి. ఇట్టి మనస్సు తనంతటతాను సంకల్పములు వికల్పములు చేయుట లేదు. అట్లు చేయుటకు దానికి చేతన శక్తి లేదు. అట్టి చేతన శక్తిని కల్గించునది ఆత్మ. అందుకొరకే ఈ ఉపనిషత్తులోని రెండవ మంత్రము "**శ్రోత్రస్య శ్రోతం మనసోమనోయ........... భవన్తి**" అని గానం చేసింది. అంటే చెవికి చెవిగా మనస్సుకుమనస్సుగా, వాక్కుకు వాక్కుగా, ప్రాణికి ప్రాణిగా నుండి వాటినన్నింటిని నడుపుచున్నది. అట్టి ఆత్మ కూడా (బ్రహ్మము) పరిపూర్ణపరబ్రహ్మము కాదు అని ఈ మంత్రము వాకృచ్చు చున్నది. సృష్ఠికి పూర్వము అచలస్థితిలో నున్నప్పుడు బ్రహ్మమన్నారు. దానికి చలనము కలిగి జగద్రూపంగా పరిణామ చెంది "**తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్**" అనగా సృష్టించిన దానియందు తానే అను ప్రవేశము చేసినప్పుడు ఆత్మయని ఆ బ్రహ్మమునకే మరొక నామకరణము చేయబడినది. "**ఆకాశశ్శరీరం బ్రహ్మ**" అని శ్రుతి చెప్పుచున్నప్పుడు ఈబ్రహ్మము నిరావరణము కాదు. ఏలయునగా సృష్టిరూపము దాల్చు అపరిమిత శక్తి ఆ బ్రహ్మమునందే బీజరూపముగానుండి ఆవరణాత్మకమైన ఆకాశాది భూతములు గా విజృంభించెనని

చెప్పి తీరవలసిందే.

**శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా దేహోనాస్తి కదాచన**
**అస్తి నాస్తి కోవేద నిర్ణయో నాస్తి సర్వదా॥**

తా॥ ఆత్మకు అతీతమై విలక్షణమై కేవలాత్మ (పరిపూర్ణ పరబ్రహ్మము) ఒప్పుచున్నది. శరీరాత్మలతో కూడిన దేహము ఎప్పుడూనులేదు. కనుక ఉన్నదనిగాని లేదనిగాని తెలుసుకొనుటకు ఇక ఎవరున్నారు? ఎవరును లేరు. అప్పుడు యే నిర్ణయంములు లేవు. అని ఈ శ్లోక తాత్పర్యము. అంటే అధిష్ఠాన చేతన బ్రహ్మమును ఆత్మాతీత మన వచ్చునా? అనరాదు. ఏలననగా ఆ బ్రహ్మము యొక్క మాయా రూపమే ఈ సర్వ శరీరస్థచైతన్యమగు ఆత్మయై యున్నది. అతీతముగా ఆత్మను (అధిష్ఠాన బ్రహ్మమును) మీరి యున్నది. ఆత్మకానిది, ఆత్మతో ఏ కొంచము సంబంధ పడనిది, ఆత్మ లేనిది, ఆత్మ యొక్క పూర్వ పరములు గానిది ఆత్మకు సంపూర్ణముగా విలక్షణమైనది అగు వస్తువేదో దానినే ఆత్మాతీతమగువస్తువు అనబడును. కావున దేని సహాయముతో మనస్సు పని చేయు చున్నదో అది బ్రహ్మము కాదు అంటే పరిపూర్ణపర బ్రహ్మము కాదు.

### నేదం యదిదముపాసతే :

ఏదైతే ఈ లోకమున జనులు పూజిస్తున్నారో అది బ్రహ్మము (పరిపూర్ణ పరబ్రహ్మము) కాదు. స్త్రీ, పుత్ర, ధన, గౌరవ, కీర్తి ప్రతిష్ట, అధికారముల వంటి నశ్వరమగు ఇహలోక, పరలోక భోగ సామగ్రీ యందు ఆసక్తులైన మానవులు వానినే సౌఖ్యహేతువులుగా భావించేదరు. వాటిని సంపాదించి అనుభవించుటలోనే ఎల్లప్పుడు తలమునకలై యుండేదరు. అంతేగాక ఈ భోగ సామగ్రిని సంపాదించి సంరక్షించి వృద్ధి చెందుటకై తత్సంబంధితమగు వివిధ దేవతలను ఉపాసించేదరు. స్వయముగా వీరు జననమరణ చక్రములో పడిపోయిన కారణంగా శరీర దృష్టితో వినాశ శీలులైనారు - ఇట్టి భోగాసక్తులైన మనుజులు తమ ఉపాసన ఫల రూపముగా వివిధ దేవతలకు చెందిన లోకములను, విభిన్న యోనులను పొందెదరు.

బ్రహ్మలోకము వరకు గల అన్ని లోకములు, యోనులు, నశ్వరములు. కనుక అచటికి చేరుకొను జీవులుకూడా తిరిగి రావలసివచ్చును. పరిపూర్ణపరబ్రహ్మ ఒక్కటే శాశ్వతము. అట్టి బ్రహ్మమునకు "మ్రొక్కెరితర జేజేలు" అని కృష్ణదేశికులు గానము చేసినారు. ఇతర జేజేలు అనగా పరిపూర్ణ భోధ నెరిగిన సద్గురువుల దగ్గర బోధ తెలిసి కర్తృత్వరహిత కర్మాచరణ అనగా కర్మసన్యాసము గాక, కర్మఫలత్యాగముగాక కర్మచేసేవారిని ఇతర జేజేలని నిర్ణయము. ఆత్మస్వరూప నిశ్చయజ్ఞాన స్వరూపులే ఇతర జేజేలు. అట్టివారి కన్యమై వారిచే సేవింపదగినది పరిపూర్ణపరబయలే. సేవ లేక ఉపాసన అనుటతోనే సేవ్య వస్తువు, సేవ,సేవకుడు లేక ఉపాస్య వస్తువు, ఉపాసన, ఉపాసకుడు అనే త్రిపుటి సిద్ధమగుచున్నది. పరిపూర్ణపరబయలు త్రిపుటి రహితముగదా! కనుక

ఉపాసింపదగినది బ్రహ్మమేకాదు. అందుకే ఈ మంత్రమున "నేదంయదిద ముపాసతే" అని గానం చేసింది.

7. యచ్చక్షుషా న పశ్యతియే న చక్షూంషి పశ్యతి ।
తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే ॥

దేనిని నేత్రములు చూడలేవో అది మాత్రమే బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మముఅని నీవు తెలుసుకో, దేని సహాయమున నేత్రములు చూడగలుగుచున్నవో ఏదైతే ఈ లోకనమున జనులు ఉపాసించుచున్నారో అది బ్రహ్మముకాదు.

**పరిపూర్ణప్రబోధామృతము:**

**యచ్చక్షుషాన పశ్యతి** = యత్ - ఏది : చక్షుషా గాంచబడదో,

**తదేవ బ్రహ్మత్వం విద్ధి** = తత్ఏవ = దానిని, బ్రహ్మ = బ్రహ్మముగా, త్వం - నీవు, విద్ధి తెలుసుకొనుము.

అగ్నియొక్క గుణము రూప గుణము. రుద్రతన్మాత్ర ప్రకాశము కన్నుల స్థానమందుచేరి రూప తన్మాత్రతో కూడి చక్షువు ఆయెను. చక్షువునకు అధిష్ఠాన దేవత సూర్యుడు. కన్ను సూర్యుడు మిశ్రమమై రూప మెరుగును.

జలాధిష్ఠాన దేవత విష్ణువు. విష్ణువు ప్రత్యగాత్మ ప్రకాశము కన్నులస్థానమందు చేరి రూప తన్మాత్రతో కూడి రూపేంద్రియ మాయేను. రూపమునకు అధిష్ఠాన దేవత రుద్రుడు. రూపము రుద్రుడు మిశ్రమమై వర్ణము నెరుగును. దీనికి అగ్ని భూతము. రూపమున్న దానినే కన్ను గుర్తించగలదు. ఏది కండ్లకు కనబడదో అది మాత్రమే పరిపూర్ణ పరబ్రహ్మము. పరిపూర్ణపరబ్రహ్మమునకు రూపము లేదు. కావున కండ్లకు కనబడదు. అట్టి బ్రహ్మమును దిగువ శృతులు కీర్తించిన విధమును పరిశీలిద్దాము.

**1. "నైవచానమనసా ప్రాప్తుం శక్యోనన చక్షుషా అస్తీతి బ్రువతోఽన్యత్రకథంతదుపలభ్యతే"** కఠోప నిషత్తు 2-3-12.

తా॥ వాక్కు, మనసు చక్షువులకుప్రాప్తించరానిది. ఉన్నది అని చెప్పుట వినా మరొక రీతిగా దాని ఉపలబ్ధికాజాలదు.

**2. "అచక్షుష్కమశ్రోత్ర మవాగ్గమనః"**

తా॥ కండ్లు, చెవులు, వాక్కు, మనస్సులేనిది పరిపూర్ణపరబ్రహ్మము.

**3."అశబ్ధ మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్యమగంధ వచ్చయత్,**
**అనాద్యనంతం మహతః పరం ధృవం నిచాయ్యతం మృత్యు ముఖాత్ప్రముచ్యతే॥**
**కఠోపనిషత్తు 1-3-15॥**

తా॥పంచతన్మాత్మ రహితమైనది, ఆద్యంతములులేనిది గొప్పదని జెప్పబడే భూమా పదార్థము కంటెను పరముగా నున్నట్టియు స్థిరముగా నున్నదానిని (పరిపూర్ణ పరబ్రహ్మమును) యెరిగినవాడు మృత్యుస్వరూప సంసారమునుండి విడువ బడుచున్నాడు. ఇచ్చట పంచతన్మాత్రములు లేనిది పరిపూర్ణపరబ్రహ్మమన్నారు. పంచతన్మాత్రలలో రూపమొకటి, రూపము ఉంటేనే కండ్లకు కనబడును. రూపము లేనిది కనబడదు పరిపూర్ణపర బ్రహ్మమందు పంచతన్మాతలు గాని అందు ఎరుక స్థానమైన కన్నుగాని మరేది ఇతరములేదు. అందు ద్విపుటి - త్రిపుటులు లేవు. కనుక అది ద్విపుటి త్రిపుటి రహితమని వర్ణించబడింది. దానియందు జ్ఞానముగాని కర్మచేయుటకు వలయు ప్రాణశక్తిగాని, ఇంద్రియములుగాని దానిని నడిపించు అధిష్ఠాన దేవతలు గాని అన్యమేమిలేదు. అందులకు అది "నిశ్శక్తి నిర్మలం పూర్ణము" అని చెప్పబడింది. ఇంకా చెప్పాలంటే ఇంద్రియ గోచరమగు సమస్తము మరియు శుద్ధమనస్సుకు గోచరించు ఆత్మ, అధిష్ఠాన బ్రహ్మము వంటి వస్తువు పరిపూర్ణ మందు లేదు.

**"యత్రన్యాత్పశ్యతి నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి సభూమా"**॥ చాందో॥ 7.24.1

తా॥ ఎచట అన్యమేది కానరాదో అదియేభూమా (ఇచటభూమా అనగా పరిపూర్ణ పరబ్రహ్మము) పదార్థము అన్యము చూచేది వినేది తెలుసుకొనేది ఎచ్చటలేదో అది పరిపూర్ణపర బ్రహ్మము. ఆ విధంగా చూడబడేవీ తెలియబడేవీ లేనిచో తెలుసుకొనే జ్ఞానము తెలివిరూపకముగా నుండు జ్ఞానము కూడాలేవని తెలుసు కొనవలెను. అదియే పరిపూర్ణపరబ్రహ్మము.

ద్రష్టృ దర్శన దృశ్యం వా ఈషణ్మాత్రం కలాదికం అనాత్మేతి ప్రసంగోవా,
హ్యనాత్మేతి, మనోపివా ॥ఋభుగీత॥ 19 శ్లో. ప్రథమాధ్యాయం.

తా॥ ఏ ఆత్మకు చూచువాడు, చూడబడునది, చూపు అనే భేదము లేదో, అనాత్మయనెడి ప్రసంగముగాని, అనాత్మయనెడి మనస్సుగాని లేదో అది కేవలాత్మ, పరిపూర్ణ పరబ్రహ్మము. "ద్రష్టృ దర్శన దృశ్యానాం విరామో యత్రవాలభత్"॥ తేజో॥ త్రిపుటి ఎచ్చోట లేదో అదియే పరిపూర్ణ పరబ్రహ్మము.

బయలును గూర్చిజెప్పిన శ్రీకృష్ణదేశికేంద్రుల వారి కందపద్యమును పరిశీలింతము
**క.ప.61. "బయలనిన నిత్యవస్తువు బయలన నొక్కరీతి నుండు బ్రహ్మాండములో । బయలనిన కండ్లబడనిది। బయలన బ్రహ్మాండమవల బరగెడిది సుమీ"॥ అని తెలవిచ్చియున్నారు.**

తా॥ అచల పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది. కాలత్రయములతో బ్రహ్మాండము మార్పుజెందునట్లు (ప్రళయమును పొందునట్లు) మార్పుజెందక ఇటువంటిదని జెప్పుటకువీలుగాక ఆది మధ్యాంతములులేక నిండి నిబిడీకృతమై బ్రహ్మాండములోపల

బయట అచలపూర్ణ పరబయలు యుండును. అది కన్నుల యందు ప్రవేశించదు వెళ్ళిపోదు. గనుక కన్నులకు అగుపడనిది మాత్రమే బ్రహ్మము.

**యేన చక్షూంషిపశ్యతి** = యేన=దేనిచేత, చక్షూంషి= కన్నులను; పశ్యతి = చూస్తాదో.

**నేదం యదిద ముపాసతే** : యత్ = ఏదైతే; ఇదం = ఈ (లోకః = జనలు) ఉపాసతే = పూజిస్తున్నారో; ఇదం = ఇది; న = కాదు.

దేనిచేత కండ్లు చూచు చున్నవో అది బ్రహ్మముకాదు. కండ్లు కేవలం చూచుటకు ఉపయోగపడు గోళములు (పరికరములు). కండ్లద్వారా చూచునది ఆత్మనే. ఈ ఆత్మను చర్మ చక్షువుచే గాకున్నను జ్ఞానచక్షువుచే ఆబ్రహ్మమును చూడవచ్చును. కనుకనే **"ఆత్మవారే ద్రష్టవ్యం...."** అనీ, **"మనసై వాను ద్రష్టవ్యం...."** అనీ శ్రుతి వాక్యములు పలుకుచున్నవి. అయితే ఇక్కడ మనస్సనగా శుద్ధమనస్సు, అతీంద్రియమగు మనస్సు అని శ్రుతుల తాత్పర్యము. ఇట్టి అతీంద్రియమనస్సుకు కూడా గోచరించనిది, ఆ పరిపూర్ణపరబ్రహ్మమని ఈ మంత్ర ముద్ఘాటించుచున్నది. పరిపూర్ణపరబ్రహ్మముగాన వచ్చుట లేదు గదా! దేనికిని తెలియబడని అవిజ్ఞేయబ్రహ్మమున్నదనుట ఎట్లు సమంజసము. అనగా దాని అచల ఋషుల సమాధానమేమనగా ఆ పరిపూర్ణపరబ్రహ్మము యెరుకతో తెలియబడదు, గాని **"లేని ఎరుకతో కనిపెట్టు"** మన్నారు. అనగా పరిపూర్ణమందు యెరుకకు మూలంగాని స్థానముగాని లేదని గురువాక్య రీత్యా దృఢ నిశ్చయము చేసుకొన్నప్పుడు, ఉన్నది పరిపూర్ణ బ్రహ్మమేనని అపరోక్షజ్ఞానము కలుగును. ఎరుకను విడిచినప్పుడు అది అపరోక్షమే. అనగా ఎరుక రహితమందే పరిపూర్ణపరబ్రహ్మ నిశ్చయమన్నమాట. మరియెరుకను విడచుట ఎట్లనగా **"క.ద. 131 ఎరుక తనకుదావిడిపో। దెరుకనువిడిపించలేరు యెవ్వరు ధాత్రిన్। గురుడొకడు తప్ప"** అంటూ **"గురునకు పరిచర్యయొనర్చి బోధా పద్ధతి వినినన్"** అని అన్నారు. ఆ పరిచర్యవల్ల ఫలితము గురుకృప. గురుకృపవల్లనే 1. గురుపరమాత్మ యొక్క స్వరూపసాక్షాత్కారము కలుగును. 2. యెరుక బంధము వీడిపోవును. 3. పరిపూర్ణము స్వతసిద్ధమై అపరోక్షమగుననే మూడు కార్యాములు సిద్ధించును. శ్రీకృష్ణదేశికేంద్రుల వారు తమ క. ద. ॥ 209 ॥ **"అపరోక్షమౌనే మనుజాలకు పరోక్షమైన బయలు గురుకృపలేకన్"**। అని ప్రశ్నించి అందుకు జవాబుగా ఆ కందార్థములోనే **"అపరోక్ష మౌను మనుజాలఃకు పరోక్షంబైన బయలు గురుకృపకలుగా। కీలిదె లేని। యెరుకతా తొలగా"**. అని చెప్పుచు, **"విపరీతమౌ బుద్ధి విడిచినీ వెప్పుడు ఉపచారములు చేయుచుండుము గురునికీ"** అని ఆదేశిస్తున్నారు. **"పూర్ణమదః పూర్ణమిదం"** అనే శ్రుతిలో ప్రత్యక్షముగా గానవస్తున్న "ఇదం" శబ్దవాచ్యమగు శుద్ధయెరుక విడిచినచో పూర్ణమదః అని చెప్పబడిన పరోక్ష పూర్ణము (పరిపూర్ణ పరబ్రహ్మము) అపరోక్షము (ఉన్నదే అదిగనుక) కాగలదన్నమాట. ఇచ్చట ఒక విషయము స్పష్టము. పరిపూర్ణపరబ్రహ్మము

ప్రాప్తించియే యున్నది. క్రొత్తగా ప్రాప్తించవలసిన అవసరములేదు. ఏలననగా ఆ పరిపూర్ణ పరబ్రహ్మము నిత్య ప్రాప్తము. స్వతసిద్ధమై యున్నది. దాని కన్యంగా ఏవస్తువును లేదు. ఎరుక (తాను) అను తెరయే అవరోధముగా నున్నది. ఆ ఆవరణ రహితమందు పరిపూర్ణపర బ్రహ్మము యొక్క నిశ్చయమైనయునికి ఆరూఢమగుచున్నది. ఎంత నడివర్షకాలమైనను మేఘము చాటున సూర్యుడు ఉండనే వున్నాడు. సూర్యుడు క్రొత్తగా ఉదయించవలసిన పనిలేదు. మేఘా వరణము వలన సూర్యుడు కనబడుట లేదు. కనుక ప్రాప్తించవలసినది అవలోకనము మాత్రమే. పరిపూర్ణ పరబ్రహ్మము సాధనాంతరము, నిరపేక్షము.

సాధరణముగా ఏ వస్తువైన చూడవల యునన్న చూచువాడు, చూపు, చూడబడిన వస్తువు (ద్రష్టా, దృక్కు, దృశ్యము) లనే త్రిపుటి యుండదు. తాను తన మనస్సు వస్తు రూపమే అయిపోవును, కాని పరిపూర్ణ బ్రహ్మము యొక్క అవలోకనములో తానే లేడు. అప్పుడే ఏకము అనేకము అనే నిర్ణయమే లేదు.

ఇతరులు జెప్పె బ్రహ్మము ఎరుకనే గాని పరిపూర్ణ పరబ్రహ్మముగాదు. ఈ ఎరుక బ్రహ్మము అనగా జ్ఞానా జ్ఞానరూపమైన బ్రహ్మము నిష్క్రియము సాక్షిమాత్రమని ఇతరులంటారు. గాని ఇది సరికాదు. ఎరుకనే (జ్ఞానము) ఒక స్థితి యందు (సృష్టికి పూర్వం) బ్రహ్మము "జ్ఞానాదేవతు కైవల్యం" అనే రీతిగా ప్రజ్ఞాన ఘనమైయుండి తనను తాను మరచిన స్థితి యందు అవ్యక్తరూపమైయున్నది. అనగా తన స్వరూప జ్ఞానము మరిచెనన్నమాట. జ్ఞానా జ్ఞాన రూపముగా నున్న ఈ బ్రహ్మము నిష్క్రియమనుట చెల్లునా, అంటే చెల్లదు. ఎందుకనగా జ్ఞానమునకు ఎరుగట ఎరుగక పోవుట రెండు క్రియలుగలవా? అనగా సాక్షిగా నుండుట, ఉండక పోవుట కూడా అంటే పనిచేయు శక్తి యున్నచో పనిని ఆపు చేయుశక్తి కూడ ఉండును. కనుక ఒకానొక స్థితిలో ఏ పని చేయనట్లు తోచిన అది నిష్క్రియ మనరాదు. పై వివరణను బట్టి ఎరుక బ్రహ్మములేక అధిష్టానచేతనబ్రహ్మము ను పరిపూర్ణపరబ్రహ్మము అనరాదు.

"బయలెరుకల అత్యంత విభిన్న త్వమను" శీర్షికన శ్రీకృష్ణ దేశికుల కందార్థదర్వును పరిశీలిద్దాము.

**67. క.ద. "చచ్చుట పుట్టుట మేలుకవచ్చుట । గాఢా సుషుప్తివచ్చుట। లీ నాల్గచ్చము సహజమెరుకకు పొచ్చము। యీ ఎరుకనిల్వబోదు మాయప్పా। అచలము కిట్లు లేదుగ దప్పా। మచ్చికతో రెంటి మర్మామునీకిప్పు। డెచ్చుగదెల్పితి నెరుగు మెరుక నిల్వబోదుమాయప్పా। అచలము కిట్లు లేదు గదప్పా।"**

ఓ శిష్యుడా! చచ్చుటయును, పుట్టుటయును, మెలుకువ వచ్చుటయును గాఢసుషుప్తి బొందుటయును,ఈ నాలుగు లక్షణములు యెరుకకు సహజముగానున్నవి. గనుక దీనిని అచలపరిపూర్ణమని నమ్మినవారిని మోసముచేయును. ఎందుకనగా యెరుక

ఎచ్చట కూడ నిలిచియుండదు. అచలపరిపూర్ణపరబయలు చావదు, పుట్టదు మెలకువనొందదు, సుషుప్తి బొందదు. ఈ రెంటి నిర్ణయము నీకు జెప్పినాను. కనుక తెలుసుకొమ్మని భావము. ఇట్లెరుగుటవల్ల మనకు తెలిసిన దేమగా ఎరుకబ్రహ్మమును బ్రహ్మమనరాదు.

8. యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥.

చెవిద్వారా వినజాలనిది మాత్రమే బ్రహ్మమని నీవు తెలుసుకొనుము. దేనిచేత వినికిడి గ్రహించబడుచున్నదో, జనులు ఈ లోకమున పూజించునది బ్రహ్మము కాదు.

**యచ్ఛ్రోత్రేణ నశృణోతి** = యత్=ఏది ; శ్రోత్రేణ = చెవి ద్వారా; నశృణోతి = వినబడదో,

**తదేవ బ్రహ్మత్వం విద్ధి** = తదేవ = అదియే ; బ్రహ్మ = బ్రహ్మము అని; త్వం=నీవు,విద్ధి = తెలుసుకొనుము.

**పరిపూర్ణ బోధామృతము.**

మానవుడు చెవుల ద్వారా వినజాలనిది మాత్రమే బ్రహ్మము. అగ్ని యొక్క గుణము రూప గుణము. రుద్రతన్మాత్ర ప్రకాశము చెవుల స్థానము నందుజేరి శబ్దతన్మాత్రతోగూడి శ్రోత్ర మాయెను. ఈ శ్రోత్రమునకు అధిష్ఠానదేవత దిక్కులు, శ్రోత్రము దిక్కులు మిశ్రమమై శబ్దము నెరుగును.

జలాధిష్ఠాన దేవత విష్ణువు. విష్ణువు ప్రత్యగాత్మ ప్రకాశము చెవుల స్థానమందు జేరి శబ్దేంద్రియ మాయెను. శబ్దమునకు అధిష్ఠాన దేవత సదాశివుడు. శబ్దము సదాశివుడు మిశ్రమమై ధ్వని నెరుగును. దీనికి ఆకాశభూతము.

మానవుడు శబ్దేంద్రియమైన చెవి ద్వారా సకలశబ్దములను వినగలడు. ఈ విషయేంద్రియములతోపాటు తక్కిన నాల్గు విషయేంద్రియములను (అనగా స్పర్శ, రూప, రస, గంధములు) అరికట్టినప్పుడు మనస్సు నిశ్చలస్థితికి జేరును. దానితోపాటు బుద్ధి తన స్వరూపమునందు నిశ్చయమగును. ఇదే సమాధి స్థితి **ఈ అతీతస్థితి యందు విశ్వమునకు, జీవేశ్వర జగత్తుకు కారణమైన పరమాత్మ స్వరూపమును ప్రత్యక్షముగా చూడగలుగును.** కాని ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షము గాదు. అనగా శబ్ద తన్మాత్రద్వారా శబ్దము, పరిపూర్ణ పరబ్రహ్మమును గుర్తించ జాలదు. కావున ఏది ఇతర తన్మాత్రలచేగాని శబ్దతన్మాత్రచే గాని తెలియరానిది పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియదగును. ఎందుకనగా పరిపూర్ణపరబ్రహ్మము శుద్ధము.

**శ్లో॥ యథానాహం తథాశుద్ధం తన్మాచ్ఛుద్దేన నిర్ణయః॥**
**జగదస్తీతి కోవేద నాస్తికో నచ నిర్ణయః॥**

తా॥ నేను లేకుండవుంటే ఎట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణపరబ్రహ్మముండును. నేను లేకుండుట చేతనే అది శుద్ధమని నిర్ణయించబడినది. నేనులేనిచో జగత్తు ఉన్నదని

తెలుసుకొనే వారెవరు? అనగా గురువు, శాస్త్ర, వేదములందు బుద్ధి లేని వారు గాని, ఏ నిర్ణయము గాని వుండటయు పొసగదు. కనుక పరిపూర్ణపరబ్రహ్మము శుద్ధము. అందు ఏమి లేదు. పంచతన్మాత్రలు కూడాలేనిది. ఈ భావమునే వేమనయోగి **''నీ వుండిన జగముండును। నీవేగిన జగములేదు యవినీతోడన్ । భావింప నినుదలచిన । యీవిశ్వము బండిసున్న యిది గనువేమా॥** మరియు శ్రీ కృష్ణ దేశి కేంద్రుల వారు కం॥228. **" నేనిల్వ జగము లేకను। నేనేగిన జగములేదు । నిజమీ జగమున్। నేను లేనప్పుడు గల దానిని పరిపూర్ణమనుచు దల పోయదగున్''** అని గానము చేసినారు. జగము లేక నేను నిల్వను. నేనుపోయినట్లయితే ఈ ప్రపంచము నిలువదనేడిది నిజము. ఈ జగము, నేను లేనప్పుడు యుండునట్టిది పరిపూర్ణ పరబయలే ఉండునని తెలియుమని శిష్యునికి నిశ్చయముగా జెప్పి యున్నాడు. కావున పరిపూర్ణ పరబ్రహ్మమే బ్రహ్మముగాని మరే యితరము బ్రహ్మము గాదని ఈ మంత్రమున జెప్పబడినది.

**ఆత్మేతి శబ్ధహినోయ। ఆత్మశబ్దార్థవర్జితః**
**సచ్చిదానందహీనోయ। ఏషైవాత్మసనాతనః॥ తేజోబిందు''**

తా॥ ఆత్మగాని శబ్దముగాని, శబ్దార్థ ప్రతిపాదిత వస్తువుగాని తనయందు లేనిది, సత్తుచిత్తు, ఆనందములు తన యందులేకవున్నదే, సనాతనమైన కేవలాత్మలేక పరిపూర్ణ పరబ్రహ్మము. దీనినే బ్రహ్మమన వలెను.

**యేన శ్రోత మిదంశ్రుతమ్** =ఏన=దేనిచేత; ఇదం=ఈ, శ్రోతం = వినికిడి; శ్రుతం = వినబడుతుందో;

**నేదం యదిద ముపాసతే :** యత్ = ఏదైతే; ఇదం = ఈ (లోకః = జనలు) ఉపాసతే = పూజిస్తున్నారో; ఇదం = ఇది; న = కాదు.

ఎవడు వినికిడికి కారణమగు చున్నాడో అతడు బ్రహ్మముకాదు. అట్టిది శోత్రియ బ్రహ్మమనబడును. లేదా అధిష్టాన చేతన బ్రహ్మము అనవలెను. అదెట్లో విచారింతము.

**శ్లో॥ యద్యద్పశ్యతి చక్షుభ్యాం తత్తదాత్మేతి భావయేత్।**
**యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్॥ యోగతత్వ॥**

తా॥ తన్మాత్రలైన శబ్దస్పర్శ రూప, రస, గంధాత్మికమగు సర్వము ఆత్మయే, ఏలననగా పంచభూతములగు పంచతన్మాత్ర రూపమగు (చూచేది, వినేది) ఆత్మయే. పంచీకృతమై విషయరూపకముగా పరిణమించినది గనుక "సర్వంయదయమాత్మా" అంతయు ఆత్మరూపమే. ఇట్టి ఆత్మరూపముగా ఎరుక బ్రహ్మమునుజ్ఞేయ బ్రహ్మమనవలెగాని అవిజ్ఞేయముగా కీర్తించబడిన పరిపూర్ణపరబ్రహ్మమునుజ్ఞేయ బ్రహ్మము అనరాదని భ్రాంతి రహిత శ్లోకమున శ్రీసదానంద యిలపకుర్తివీరవెంకటరామచంద్రరావు దేశికుల వారు యిచ్చిన వివరణమును చుద్దాము.

"1. పంచతన్మాత్ర విషయములను మాత్రమే తెలుసుకొను జ్ఞానము పంచతన్మాత్ర

రహితమైన, జ్ఞానా జ్ఞానరహితమగు పరిపూర్ణపరబ్రహ్మను తెలుసుకొనజాలదు. **"కాదిదినీచేతెలియును ఏదిర తన్మాత్రనమితి ఈ బట్టబయుటా"** అని కృష్ణదేశికేంద్రులవారి కందార్థము జెప్పుచున్నది.

2. అవలోకనము అనగా చూచుట అని సామాన్యార్థము. ఈ అర్థము పరిపూర్ణపరబ్రహ్మమును కంటితోగాని మనస్సుతోగాని చూచుట బొత్తిగా పొసగదు. విశేషార్థములో అవలోకనమనగా వివేచించుట లేక విచారించుట. అట్టి విచారణ వలన పరోక్ష జ్ఞానము అనగా ఉండజాచుకొనుట **"Indirect Knowledge"** మాత్రమే కలుగును. అనగా పరిపూర్ణపరబ్రహ్మము ఒకటి కలదని మాత్రమే ఆరూఢమగును. **వివేచనయునగా ఎరుకచేత భావించుట మాత్రమే జరుగును.** కనుకనే **"ఎరుకలేక సేవించదగును"** అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చినారు. మరియు **"లేనేరుకతోదీన్ని కనిపెట్టి పోదోలు మెరక"** యని మరొక చోట జెప్పియున్నారు. దీపము వస్తువును ప్రకాశింపజేయును, గాని జ్ఞానము పరిపూర్ణ పర బ్రహ్మమును ఎంత మాత్రము ప్రకాశింపజేయలేదు. **"పరిపూర్ణ మనగా నెట్టిదో యెరిగేదనని యెరుక బయటకేగిన యెరుకే ఎరుకకు శూన్యంబయ్యేను। ఎరుకను జన్మించి నట్టిఈ విశ్వమంతా। ఎకరువలెనే ఏమీ లేదంతా.."** ఎరుకను జన్మించినట్టి ఈవిశ్వము, ఎరుక ఆవరణము విశ్వము నందలి సర్వము జ్ఞేయమనదగును. కనుక జ్ఞాన జ్ఞేయములన్న యెరుక విశ్వములే. పరిపూర్ణమును ఎరుగుటకు ప్రయత్నిస్తే యెరుక విశ్వములు రెండు నశించునని తెల్పి యున్నాడు.

**3. శ్లో॥ జ్ఞానంజ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా!**
**కరణ కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥భ.గీ॥ 18-18**

జ్ఞాతృ, జ్ఞానజ్ఞేయములు కర్మవృత్తికి హేతువులై జ్ఞేయవస్తు ప్రాప్తికి అనుగుణమగు సాధనారూపకర్మమును చేయుటకు ప్రేరేపించి కర్తకర్మ, క్రియలనె మరొక త్రిపుటికి కారణమగుచున్నది అని భావము. జ్ఞానకర్మలు లేనిది, సాధనాంతర నిరపేక్షము అయిన పరిపూర్ణపరబ్రహ్మమును కర్మవృత్తి జనకమగు జ్ఞేయరూపంగా భావించి పేర్కొనుట అనుచితము, పరమాత్మ (అఖండ ఎరుక) జ్ఞానఘనముకదా! జ్ఞాతృజ్ఞాన, జ్ఞేయములు, కర్త కర్మ క్రియల వలె సర్వ త్రిపుటులకు అదే అత్యంతమూల కారణము. సర్వమును సృష్టించి అందుతానే అనుప్రవేశము గావించుట అనుకర్మ క్రియలన్ని వాన్నికున్నవి గదా! మరియు **"ఆటాడి ఆడకుండును...."** అనెకందార్థములో ఎరుకే సర్వకర్త అని, అచలపరిపూర్ణ పరబ్రహ్మము సర్వదా అకర్తయని యుద్ఘాటించియున్నారు. కనుక జ్ఞేయశబ్దము పరిపూర్ణమునకు ఎంత మాత్రము వర్తింప నేరదు.

4.మనోవాక్కుల కందని పరిపూర్ణపరబ్రహ్మమును ఏ శబ్దము చేతను పేర్కొన జాలము. జ్ఞానముచే తెలియబడే జ్ఞేయశబ్దముచే అసలే పిలువరాదు. మరియు

మాయవంటి అనిర్వచనీయవస్తువే పరిపూర్ణ పరబ్రహ్మమని కొందరందురు. అనిర్వచనీయమంటే ఇతమిద్ధమని ఏ నిర్వచనము చెప్పరానిది అని మాత్రమే అర్థము. ఆదిశంకరులు వివేకాచూడామణిలో **"సన్నాప్యసనాప్యుభయాత్మికానో..... మహాద్భుతా** నిర్వచనీయరూపా" అని మాయను వర్ణించినారు. అంటే సత్తు, అసత్తు, సదసత్తు కూడ అదే అయివుంది. అన్నీ అదేగాని ఏ ఒక్కటి అయివున్నదని నిర్దేశించి చెప్పరానిది. అది భిన్నమా అభిన్నమా, ఉభయాత్మికమా అంటే ఎట్లు చెప్పినను చెప్పవచ్చును. అన్నీ అయి ఒక్కటిగా కూడ ఉన్నది. అట్లే సాంగము అసంగము, ఉభయాత్మికమై వుంది. నిర్వచించుటకు సాధ్యము కాకుండా ఉన్నది. కాని పరిపూర్ణము శబ్ద నిశ్శబ్దములమీరి, వాక్కుకు కేవలం అగోచరమైయున్నది. ఏలననగా అది సర్వలక్షణ విలక్షణమైయున్నది. సర్వాతీతమగుటచే జ్ఞేయమని ఎంతమాత్రము చెప్పరాదు.

జ్ఞానమే జ్ఞేయమని కొందరు, జ్ఞేయమే బ్రహ్మమని కొందరు భిన్నాభిప్రాయములు వ్యక్తపరచుచున్నారు. జ్ఞాన జ్ఞేయములు రెండూపోవునవే. దీని రహితము నందే జన్మరహితము జన్మరాహిత్య స్థితి అని చెప్పెదము. గుర్తెరిగిగాని ఎవరు ఏ కర్మచేయరు. కర్మ ఉన్నంత వరకు జన్మ తప్పదు. జన్మవచ్చికర్మలు చేయును. ఆ కర్మానుభవము వలె జన్మనెత్తును. ఇట్లు జన్మవల్ల కర్మ, కర్మ వల్ల జన్మ. ఇట్లు అనంతముగా సంసార చక్ర భ్రమణములో జీవుడు పరిభ్రమించుచున్నాడు. కర్మను ప్రేరేపించు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయముల రహిత స్థితిని ఈ శ్లోకముటంకించుచున్నది. యథార్థము గాని ఊహ (లేక) భావమే భ్రాంతి గదా! యదార్థ అయదార్థ జ్ఞానములు కలిగించు సంవిద్రూపమగు లేని యెరుకయే పరిపూర్ణపర బ్రహ్మమందు భ్రాంతి, భ్రాంతి కారణములు లేనే లేవు. జ్ఞానాజ్ఞేయములు రెండు లేని, రెండు కాని పరిపూర్ణ పరబ్రహ్మమేయున్నది అని అచలఋషుల సిద్ధాంతము."

పై వివరణను బట్టి మనకు తెలిసినదేమనగా ఏనికిడికి కారణమగు వాడు బ్రహ్మకాదు. ఏ భ్రాంతికైనను భ్రాంతిచెందువాడు, భ్రాంతి చెందింపజేయు పదార్థము, భ్రాంతిరూపముగా తోచబడు పదార్థము అను త్రిపుటి వుండి తీరవలసనదే. పరిపూర్ణమందు ఈ త్రిపుటిగాని మరే త్రిపుటికాని లేనేలేవు. పరిపూర్ణబోధచేత పరిపూర్ణపరబ్రహ్మము అవగాహనమైన, సకల భ్రాంతులు నశించుచున్నవి. ఏలననగా సకల భ్రాంతులకుమూలమైన మూలములేని ఈగుర్తెరిగె శరీరమే, పరిపూర్ణ బోధవలన లేకుండా పోవుచున్నది. కనుకనే పరిపూర్ణ బోధ సర్వభ్రాంతి వివర్జితము అని కొనియాడబడినది.

*9. యత్ ప్రాణేన న ప్రాణిత యేన ప్రాణః ప్రణీయతే।*
*తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిత ముపాసతే॥*

ఎవడునాసికమునకు (ప్రాణమునకు) అందుకున్నాడో అతడు మాత్రమే బ్రహ్మము

అని నీవు తెలుసు కొనుము. ఏవడు నాసికముచేత [illegible] పూజించేది బ్రహ్మముకాదని తెలుసుకొనుము.

పరిపూర్ణ ప్రభోధామృతము:-

**యత్ప్రాణేనన ప్రాణిత :** =యత్=దేనినైతే; ప్రాణేన = ప్రాణము చేత (ఊపిరిచేత): నప్రాణితి= వాసన చూడజాలడో.

**తదేవ బ్రహ్మత్వం విద్ధి :** =తదేవ=అదియే; బ్రహ్మ=బ్రహ్మము, త్వం=నీవు,విద్ధి = తెలుసుకో

మానవుడు ఊపిరి చేత వాసనచూడజాలడో అది మాత్రమే బ్రహ్మమని నీవు తెలుసుకో. వాయువు యొక్క గుణము స్పర్శము. ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము హృదయస్థానమందు జేరి రసతన్మాత్రతో కూడి ప్రాణవాయువు వాయెను. ఈ ప్రాణ వాయువు అధిష్ఠాన దేవత విశిష్టుడు, ఈ ప్రాణవాయువు విశిష్టుడు మిశ్రమ మగుటవలన నిశ్వాసమై ఉచ్ఛ్వాస నిశ్వాస జరుగును. దీనికి జలభూతము, పంచప్రాణంబుల నిర్ణయమును గూర్చి భద్రాద్రి రామ శతకమందు చక్కగా వర్ణించబడినది.

16.సీ॥ ప్రాణుండు హృదయాబ్జ పదమందు వాసమై। నానెపు। శ్వాసముల్ నడుపు చుండు,। పాయ్వుపస్థలం దపానుండు। మలమూత్రముల విసర్జన జేసి। మొలను యుండు। నాభియందున సమానంబుండి। సమముగా నాళ్ళనన్నింటిని నడుపుచుండు। ఘనయుదానుండును కంఠమందున నుండి। వైఖరీపలుకులు పలుకజేయు। వ్యానపవనంబు దేహ సర్వాంగములను నిండి। శీతోష్ణస్పర్శల నెరుగజేయు ॥రమ్య॥

సమానము నాభి యందుండి నాళ్ళకన్నరసము పంచును. వ్యానము సర్వాంగము లందుండి శీతోష్ణముల నెరిగించు చుండును. ఉదానము కంఠమునందుండి శ్వాస ఉచ్ఛ్వాసలు నడుపును, ప్రాణవాయువును మూలా ధారము నుంచి ఓం అని వెళ్ళి నాభిచక్రమందు "హం" అని తాకి కపాలంబున ముట్టి ముక్కు కుడిద్వారమునుండి 12 అంగుళాలు బయటికి వెళ్ళి 4 అంగుళాల ప్రమాణము బాహ్యము నందు లయమై 8 అంగుళాల ప్రమాణముతిరిగి లోపలికి పోయి కనుబొమ్మల నడుమ నిలుచును. ఈ ప్రకారము రాత్రింబవళ్ళు (60) ఘడియలకు 21 వెయ్యి ఆరునూర్లు (21,600) శ్వాసలు నడుచును. అందులో 7,400 శ్వాసలు నష్టమై పోవును. అందువలన ఆయువు క్షీణించును. అపాన మపాయూపస్థలు యందుండి మలమూత్రములను వెళ్ళజేయును.

జీవోపాధులందు సర్వేంద్రియముల ద్వారా సర్వ వ్యవహారములు చేయించుశక్తినే ప్రాణశక్తి యనిపేరు, ఇదియే జీవులకు జన్మమృత్యు జరావ్యాధులు కలిగించుచున్నది. శక్తి ఉత్పన్నము కావలెనన్నచో చలన ముండకతప్పదు. చలనలక్షణముగలది ప్రాణము మరియు చలనముంటే తప్ప ప్రాణము తెలియబడదు. కనుక ప్రాణచలనములకు అవినాభావ సంబంధము లేక గుణ - గుణి, ధర్మ-ధర్మి సంబంధము. శరీరమందు ప్రాణము

ప్రవేశించుట తోనే శరీరమునకు చలనత్వమేర్పడుచున్నది. సజీవమని చెప్పబడుచున్నది. 
శరీరమును సంపూర్ణముగాను, శాశ్వతముగాను ప్రాణము విడిచి పోవుట మరణం. అసంపూర్తిగా విడుచుట కూడా కలదు. సమాధి యందు ప్రాణక్రియలు పోయినవే గాని ప్రాణము పూర్తిగా విడిచి పోవుటలేదు. ఎట్లనగా ఆహార పానీయములు లేవుకనుక సమాన రూపముగా పచనక్రియ, అపాన రూపముగా విసర్జన క్రియ చేయుట లేదు. వ్యానము శీతోష్ణ స్పర్శనలను గుర్తించుట లేదు. ఉదానము పలికించుట లేదు. ప్రాణము ఉచ్ఛ్వాస నిశ్వాస లేదు. రూపముగా పిండ బ్రహ్మాండములకు రాక పోకలు సాగించుటలేదు. అయినను ఈ క్రియలన్ని జరిపించు ప్రాణశక్తి మాత్రము శరీరమును విడువక సుప్తమైయున్నది. ప్రాణక్రియలు పాణీంద్రియ వ్యాపారములు ఏమి చేయలేకపోయిన ప్రాణము పోయిన దనజాలకున్నాము. ఇప్పుడు పంచ ప్రాణక్రియలు ప్రాణముకాదని స్పష్టమైనది. ఇవన్ని, యే చలన శక్తి కారణముగా జరుగుచున్నవో దానినే ప్రాణమనాలి. ఈ శక్తి ఎవరిది? శక్తిగల శక్తుడెవడు? అతనినే దేవుడని సామాన్యులన్నారు. పరమాత్మయనివేదాంతులన్నారు. శక్తిద్వయమని పరిపూర్ణలన్నారు. వస్తు నిర్ణయ రూపముగా గురుముఖతః తెలుసుకొనవలసి యున్నది. ప్రాణశక్తి శరీరమున ప్రవేశించుట జననము. శరీరమును వదలినచో మరణము. ప్రాణము క్షీణించినచో ముసలి తనము. పంచప్రాణ రూపముగా సక్రమముగ జరుగకపోవుట వ్యాధి. ఉ॥సమానము సరిగా పని చేయనిచో అజీర్ణవ్యాధులు వచ్చును. కనుక జన్మమృత్యు జరా వ్యాధులన్నిటికి ప్రాణమే మూలాధారము అని గుర్తెరుగవలెను.

దేహధర్మములుగల జనన మరణములు ప్రాణము యొక్క ప్రవేశ నిర్గమ నాడులవలన కలుగుచున్నవి. అయితే ప్రాణము ఒకప్పుడు ఒకశరీరమును, మరోకప్పుడు మరొకశరీరమును ధరించుచు శాశ్వతముగా నుండునట్లు గానవచ్చుచున్నది. "జీవ మెన్నడూనాశన మొందదు" అనే ఊహాకు తావిచ్చుచున్నది.

**శ్లో॥ వాసాంసి జీర్ణాని యథావిహాయ၊ నవాని గృహ్ణాతినరో౽పరాణి၊**
**తథాశరీరాణి విహాయ జీర్ణా၊ న్యన్యాని సంయాతి నవానిదేహీ** ॥భగీ॥ 2-22

చినిగినబట్టలను వదలి నూతనవస్త్రము ధరించునట్లు జరా వ్యాధులచే శిథిలమై జీర్ణమైపోయిన శరీరమును వదలి నూతన శరీరమును ధరించునని భగవద్గీత ఉద్భోధించు చున్నది. ఈశరీర యంత్రము ఇతర యంత్రాధికముల వలననే కొంత కాలమునకు శిథిలమగుటయు, ఆ శరీరము ప్రాణము వదలి పోవుటయు తప్పదు కనుకనే "జాతస్య హిధృవో మృత్యుః ధృవం జన్మమృతస్యచ" అనగా పుట్టినది చచ్చుట, చచ్చినది పుట్టుటయు తప్పదు. అయినప్పుడు ఏది చచ్చినదో అదే తిరిగి పుట్టుచున్నది, అన్నప్పుడు ఆ చచ్చిపుట్టేది ఏది? దేహము కాదు. దేహము ఇక్కడనే బూడిద అగుచున్నది. లేదా మట్టితో కలిసి పోవుచున్నది. కనుక చచ్చిపుట్టేది ప్రాణమని అనవలెను. అయితే చస్తూ పుడుతూ తిరిగి చస్తూ పుడుతూ వుంది కనుక దీనికి నాశనము తేలికగా సంభవించదు అని

ఒప్పుకోవలసినదే. కాని పరిపూర్ణ బోధవలన మాత్రము ఇది కూడా శాశ్వతము గాదని ఋజువగుచున్నది. మరణ మందు మనః ప్రాణముల కెడబాటు కలుగుటలేదు కనుక మనః ప్రాణములు రెండు ఎన్నడు కలియవో నాడే సున్నసుమీ యెరుక మాట అని కృష్ణదేశికులన్నారు. ఈ మనః ప్రాణములలో వ్యష్టి సమిష్టిగానున్న ప్రాణము అమృత స్వరూపము. కనుక మనస్సు లేకుండా చేయాలి. అమనస్కము వల్లకుడా మనస్సు లేకుండా పోవుటలేదు. కనుక మనస్సు రహిత పరచాలంటే మనస్సు యొక్క మూలమును గుర్తుయెరిగి ఆ మూల వస్తువు అను జ్ఞానమునకు పరిపూర్ణపరబయలు నందు స్థానముగాని మూలముగాని లేదని దృఢపడాలి. మనస్సు అనగా సంస్కారముల మూట కనుక సంస్కారం నాశనం కలిగే విధంగా అనగా కర్తృరహితముగా శేష జీవితం సాగించాలి. అప్పుడే మనోనాశనము, జన్మరహితము అగును.

ఇట్టి ప్రాణము ద్వారా పరిపూర్ణ బ్రహ్మమును తెలుసుకొనుటకు వీలులేదు. ఎందుకనగా పరిపూర్ణపరబ్రహ్మమందు ప్రాణములేదు. రెండింటి యందు సమాన ధర్మములుంటేనే అది తెలియవచ్చును. ప్రాణమునందున్న ధర్మములు పరిపూర్ణమునందు లేవు. కావున పరిపూర్ణ పరబ్రహ్మమే బ్రహ్మము కాని, అనిత్యమైన ఆత్మరూప బ్రహ్మము బ్రహ్మముకాదని ఈ ఉపనిషద్మంత్రార్థము.

**యేనప్రాణఃప్రణీయతె** =యేన=దేనిచేత, ప్రాణః=ప్రాణము: ప్రణీయతే = శ్వాసించునో

**నేదం యదిదముపాసతే** =నేదం = ఇదికాదు,; యదిదం = ఏదైతే; ఉపాసతే = ఉపాసించ బడుతుందో. జనులు ఇచ్చట పూజించేది బ్రహ్మము కాదు.

దేనిశక్తి చే శ్వాసించి చున్నదో, ఇచట ఉపాసింపబడుతుందో అది బ్రహ్మముకాదు. నేత్రముతో ఆత్మను చూడగలవా? ప్రాణముతోఆత్మను శ్వాసించగలవా? అంటే ఈ విధముగా ప్రశ్నించునది లేక అట్లు ప్రశ్నించుటకు ఆధారముగానున్నది ఏది? కన్నా, ముక్కా, చెవియా, నాలుకనా, చర్మమా అంటే అన్నియు ఆ పనులు నిర్వహించే పరికరములె లేక సాధనములె. అవన్ని పని చేయుటకు సత్తానిచ్చునది ఆత్మయేయని ఇది వరకే తెలుసుకొన్నాము. ఇచ్చట తెలుసుకొన్నామంటే తెలివితానై యుంటుందని అర్థము. ద్రష్ట దృశ్యములు ఏకమైన ఆ అపూర్వసమ్మేళనములో తెలుసుకొనేదెవరు? తెలియబడునది యేమిటి? సమస్తము ఆత్మయే. ఈ సచ్చిదానంద రూపమే. ఆ పనులన్ని చేయించుటకు ఆధారము మూలమైయున్నది. కనుక అదే అన్నిటికి కర్తయని తేలినది. ఈ భావమునే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు ॥క.ద.52॥ **ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేను బొమ్మయాటాడకనే। ఆటాడు ఎరుకయునియెడి। యాటాడించేడివాడు అతడేరాకర్త।..... చేటుపాటుల రెంటిచే వచ్చు ఫలము ముమ్మాటకి కనుభవించి జననమరణము లొంద। నత డేరాకర్త అంతటికీ యీ అచలమకర్తా॥''** అనిశెలవిచ్చియున్నారు. ఈ ఆట శాశ్వతముగా ముగింపు అయినప్పుడే (అనగా

బ్రతికియుండగానే ఎరుక అను అహం పదార్థామును రహిత పరచుకొన్నప్పుడు) జన్మరాహిత్యము చేకూరగలదు. ప్రాణము దేహమునందు ప్రవేశించుట జననము, దేహమును విడుచుట మరణము. ఈ ప్రవేశ నిర్గమములు లేకుండుటయే అమరము లేక అమృతము అనగా చచ్చేది పుట్టేదేదో యది పోకయుండుట. పుట్టిచావక యున్నా, చచ్చిపుట్టుకున్నా అమృతమే. ఇట్టి అమృతత్వము ఆశించి "మృత్యోర్మాఅమృతంగమయా" అనగా మృత్యువు నుండి అమృతత్వమునకు పోదునుగాక అని ప్రార్థించున్నాడు. అట్లు ప్రార్థించుట నిద్రరాకుండా ఎప్పటికీ మేల్కొనే యుండాలని కోరుకొన్నట్లే. అనగా ఒక ప్రాణికి మరణించుట మరణించకపోవుట అను రెండుస్థితులు. పరమాత్మయే అమృత మృత్యువులను రెండు రూపముగల వాడైయున్నాడు. ఈ విధముగా రెండుస్థితులలో ఉండే బ్రహ్మము, పరిపూర్ణపరబ్రహ్మము అనరాదు. మరిదేనిని బ్రహ్మము అనవలెనంటే పుట్టనిది చాననిది పరిపూర్ణ పరబ్రహ్మము. ఒకప్పుడు లేకుండా వుంటే పుట్టిందనాలి, లేక చచ్చిందనాలి. కాని ఎల్లప్పుడు సర్వకాలాల యందు, సర్వావస్థల యందు ఉన్నదానికి పుట్టుక చావులు లేవు. పరిపూర్ణ పరబ్రహ్మము తాను పుట్టనిది కనుక ఇతరమును పుట్టించ జాలదు గిట్టింప జాలదు. ఏలననగా సృష్టిలో ఈ పుట్టుక ఉన్నప్పుడు ఈ జీవి తనవంటి మరొక జీవిని ఉత్పత్తిచేయడానికి సామర్థ్యము కలిగి ఉంటుంది. ఉ॥వృక్షము - బీజము. ఇది పరస్పర కారణ కార్యములుగా ఉంటున్నాయి. పుట్టేటప్పుడు కారణరూపముగా పుడుతున్నాయి. పోయేటప్పుడు కార్యమును తన యందిముడ్చుకొని పోతున్నది.

**"నతోహిమాయయా జన్మయుజ్యతే నతుతత్వతః॥**

**"తత్వతోజాయతేయస్యజాతం తస్యహిజాయతే"॥** మాండూక్యకారికలు॥

అనగా పుట్టని దాని నుంచి ఏదియు పుట్టజాలదు. పుట్టిన దాని నుంచియే మరొకటి పుట్టును. దీనినే అన్వయవ్యతిరేకముగా జెప్పితే పుట్టించుటకు కారణమైనదేదో అనగా సృష్టి కారణమైన దేదో అదిపరిపూర్ణపరబ్రహ్మము కాదు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు అన్యముగా తోచబడు వానిలో పరిపూర్ణ పరబ్రహ్మము మూలము కాదు. కాబట్టి పరిపూర్ణ పరబ్రహ్మము తానుపుట్టలేదు, ఇతరమును పుట్టించదు. కనుక అదే అజము అమరము అయి ఉన్నది. సృష్టి కారణమైనదానిని బ్రహ్మము (అనగా బృహత్పదార్థము, భూమా పదార్థము, గొప్ప పదార్థమని వాడినా) అది అమరము అజము అగు పరిపూర్ణ పరబ్రహ్మకాదు. జ్ఞానస్వరూపమైన ఇతరులు జెప్పే బ్రహ్మమునకు ఆవిర్భావ తిరోభావములున్నవి. ఆవిర్భావతిరోభావ ములు లేక, రాకడపోకడలు లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. దానినే బ్రహ్మమనాలి, గాని ప్రాణమునకు యేది ఆధారముగా, మూలముగా నున్న ఆత్మ (ఎరుక బ్రహ్మము) ను బ్రహ్మమనరాదనిస్పష్టపరిచనది. ఈ ఉపనిషత్తులోని ఈ మంత్రములు.

**నేదం యదిద ముపాసతే :** బ్రహ్మమును గూర్చి సాక్షాత్తుగా చెప్పగల వాక్యములే

వుండుటకు వీలులేదు. కనుక ఆ బ్రహ్మమును అశ్రుత్యర్థము అని అన్నారు. అట్టి బ్రహ్మమును శ్రవణము చేయుటెట్లు? అట్టి బ్రహ్మమును గురించిన వాక్యములే లేనిచో దేనిని మననము చేయవలయును. ఆ బ్రహ్మము అమనస్కరూపమైన మనస్సుచే కూడా తెలియరానిదిగా నున్నది. కనుక దానిని మననము చేయుటకు సాధ్యము కాదు. శ్రవణ మననములు చేయరాని దానిని నిధి ధ్యాసనము చేయజాలము. తానే ఆ బ్రహ్మమని మహా వాక్యములు ఘోషించుచుండగా, ఆ బ్రహ్మమును తన శ్రవణ మనన నిధి ధ్యాసాదులకు విషయము గావించుటయు పొసగదు. కనుక శ్రవణాది సాధనలు ఆ బ్రహ్మ విషయమై నిరర్థకమగుచున్నవి. కావున ఈ ప్రజలు పూజించేది బ్రహ్మముకాదు.

**మొదటి భాగము సమాప్తం**

# కేనోపనిషత్తు

## రెండవ భాగము

ఈ భాగమున గురువు ఆధ్యాత్మిక సత్యాన్ని కడు యుక్తితో బోధిస్తాడు. పరబయలును ఆపరోక్ష మొనర్చుకొనుటకు వలయు మనోభావన్ని పొందుటకు శిష్యునికి తోడ్పడుతాడు. శ్రద్ధతో ప్రయత్నించిన శిష్యుడు తాను ఆ సత్యాన్ని అర్థం చేసుకొనుటలో ఎంత మాత్రం దోషం ఉండకుండా జాగ్రత్తగా అంచన వేయుమని గురువు ఈ మొదటి మంత్రములోనే హెచ్చరిస్తాడు.

*1. యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్।*
*యదస్యత్వం యదస్య దేవేష్వథను మీమాంస్య మేవతే మన్యే విదితమ్॥*

గురువు:- "బ్రహ్మమును గూర్చి నాకు తెలియును" అని నీవు భావింతువేని అది నిజముగా అతిస్వల్పమైనదే. దేవతలలో నీవు దర్శించు బ్రహ్మముగూడ స్వల్పమైనదియే, కనుక నీవుబ్రహ్మను గూర్చి ఇంకను విచారించవలసి యున్నది.

శిష్యుడు: "నేను బ్రహ్మమును తెలుసుకొన్నానని భావిస్తున్నాను".

యదిమన్యసే సువేదితి దహరమే వాపినూనం త్వం వేత్థ బ్రహ్మణోరూపమ్:

యది=ఒకవేళ; త్వం=నీవు; బ్రహ్మణః = బ్రహ్మము యొక్క; రూపం = స్వరూపము; సువేద = చక్కగా తెలుసుకొంటిని; ఇతి = అని; మన్యసే = తలంచుచున్నావో; అపి = కూడ; నూనం = నిజముగా, దహరంఏవ = అల్పమైననదియే; వేత్థ = తెలుసుకొన్నావు.

**పరిపూర్ణ ప్రభోధామృతము :**

గురుదేవుడు శిష్యునికి ఇది వరలో దేనిచేత నెట్టబడి మనస్సు విషయములపైకి

పోవు చున్నదన్న శిష్యుని ప్రశ్నకు రెండవ మంత్రము ద్వారా ఆత్మను గురించి వివరంగా చెప్పి యున్నాడు. ఈ భాగమున గురువు శిష్యునికి ప్రభోధించిన ద్వివిధములైన బ్రహ్మములను గురించిన బోధను ఆలకించాడు. తానుదేనిని తెలుసుకొనవలెనని గురువు సన్నిధికి చేరినాడో అది ఫలించినదని ఎంత గానో ఆనంద పడు శిష్యుని ముఖ కౌళికలను గురువు వీక్షించి నాడు. తాము ప్రభోదించిన భోధ శిష్యునికి బోధ పడినదని గురువులు కూడ ఆనంద పడుట సహజము. కాని ఈకేనోపనిషత్తునందు అందుకు భిన్నముగా ఋషి ఆనందపడలేదు. శిష్యునికి కలిగిన ఆనందము గురునికి హృదయమున సంశయము, భయము రేకెత్తించినది. ఎందుకనగా గురువు ఎరుక బ్రహ్మమును మరియు బ్రహ్మమును అనగా పరిపూర్ణపరబ్రహ్మమును గూర్చి శిష్యునికి తెలిపియున్నాడు. ఎరుగనటువంటి బ్రహ్మమును ఎరిగిన శిష్యుడు "బ్రహ్మమును గూర్చి నాకు బాగా తెలుసును" అని అనుటలో శిష్యునికి తన నిజస్వరూపము లేదా స్వస్వరూపము (తానైన బ్రహ్మము) తెలియ వచ్చిందని మురిసి పోతున్నాడు గాని, తనకు తెలియరాని, తనకు అన్యముగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుసుకొనజాలక పోయే గదా అని గురువు గ్రహించినాడు. ఎందుకనగా "నతత్ర చక్షుర్గచ్ఛతి" అనే మంత్రములో పరిపూర్ణ పరబ్రహ్మము విషయేంద్రియములచే తెలియరానిదిగదా! శిష్యుడెట్లు బ్రహ్మమును గూర్చి నాకు బాగా తెలుసును" అనెడి సంశయము భయము అతనిలో ఆవరించినది. అంతేకాక 3 నుంచి 9వరకు గల మంత్రములలో వాక్కుకు అందనిది మనస్సు కందనిది బ్రహ్మముకాని వాటి కందేది బ్రహ్మముకాదని స్పష్టపరిచియున్నారు. అందుకే వెంటనే "యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపినూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్" అనగా ఆ బ్రహ్మను గూర్చి నాకు బాగా తెలుసును అని నీవు అందువేని అది నిజముగా నీవు తెలుసుకున్నది చాలా అల్పము. దేవతలలో నీవు దర్శించు బ్రహ్మము కూడ స్వల్పమైనదే, కనుక నీవు బ్రహ్మను గూర్చి ఇంకా విచారించవలసి యున్నదని హితవు పలికినాడు.

సద్గురువు నుంచి వెలువడిన జ్ఞానము గంగా ప్రవాహము వంటిది. పాత్రల పరిమాణమును బట్టి జలము లభ్యమగునట్లు శిష్యుల సామర్థ్యమును బట్టి జ్ఞానము లభించును. కావున సచ్ఛిష్యులు గురువు చెప్పిన విషయములు నిశితముగా మననము చేయవలయును. సందేహము కలిగిన వెంటనే గురువు సన్నిధి జేరి సందేహ నివృత్తి గావించు కొన వలయును. లేనిచో "సంశయమే జన్మహేతువు" అన్నట్లు ఆ సంశయమే తిరిగి జన్మకు కారణమగును.

ఉత్తమ శిష్యుడు"**సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని**" అనగా తనయందు సర్వభూతములను, సర్వభూతములందు తనను దర్శించును. సాక్షాత్తు అతడు పరబ్రహ్మ స్వరూపడని భావించి, విశ్వసించి అఖండ జ్ఞాన స్వరూపుడై నిలుచును

ఇట్టి స్థితిలో గురువు చెప్పి చూయించిన పరిపూర్ణపరబ్రహ్మమును ఉండజూచి ఎరుకలేక సేవించును. అయితే ఇక్కడ మన పరిశీలనలో ఉన్న శిష్యుడు అఖండ జ్ఞాన స్వరూపమును దర్శించినవాడు కనుక బాగా ఆబ్రహ్మను గూర్చి తెలిసిందన్నాడు.

నాకు బాగా తెలిసింది అని శిష్యుడు పలికిన పలుకులు అలంకించిన గురుదేవుడు శిష్యుని అవగాహనను శంకించుటలోన్యాయముందని పించుచున్నది, ఎందుకనగా మానవ జీవిత లక్ష్యము జన్మరాహిత్యరూప మోక్షముగాని, ఇతరులు జెప్పే జీవబ్రహ్మైక్యమోక్షము గాదు. ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును తాను తానై యున్న స్థితిలో నున్న ఎరుకచే కూడా తెలియరానిది. శిష్యుడు తెలిసినదని అనుటచే అతనికి బ్రహ్మమును గూర్చి తెలియదనేటిది నిశ్చయించుకొన్న వాడై ఇంకాయిట్లు చెప్పి యున్నాడు. దేవతలలో నీవు దర్శించు బ్రహ్మము స్వల్పమైనదే. కనుక ఆ బ్రహ్మమును గూర్చి ఇంకా విచారించవలసి యున్నదని హితవు పలికినాడు.

**"యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మ నలభ్యతే"**

అనగా తెలియబడే సమస్తము ఎంత వరకు వదలిపెట్టనో అంతవరకు ఆత్మజ్ఞానము లభించిందని అన్నపూర్ణోపనిషత్తు ప్రవచనము. కనుక "నాకు ఆబ్రహ్మమును గూర్చి తెలియును." అని చెప్పుటలో ఉపాధి సహిత బ్రహ్మను గూర్చి తెలుసుకొన్నాడని బోధపడుచున్నది. ఎందుకనగా ఈ విధముగా తెలియబడు జ్ఞానము పరిమితమైనదిగా గలదు. ఆరోపిత జ్ఞానం కాగలదు. బ్రహ్మము తెలియ వచ్చేది కాదు గదా! బ్రహ్మమునకు రూపములేనందున ప్రత్యేకముగా తెలియబడదు. బ్రహ్మరూప సహితుడని తెల్పినను అలా తెల్పుట ఉపాసనా సౌలభ్యము కొరకని గ్రహించుమంటారు. కాని ఇందులో సత్యములేదు. శిష్యుడు మొదట తనకు ఉపాదియున్నట్లు నిర్ణయించుకొని ఆతర్వాత బ్రహ్మమును తెలుసుకొనుటకు ప్రయత్నించుట వల్ల అప్రయత్నముగా బ్రహ్మమునకు గూడ ఉపాధిని తగిలించును. ఉపాధిసహితము నందు భేదములు గోచరించు అవకాశము కలదు. నిరుపాధిక బ్రహ్మమందు భేదము గోచరించే అవకాశము లేదంటారు. ఉపాధి తొలగగానే జీవుడు దేవుడగు చున్నాడు. అందుకు పైంగలోపనిషత్తు పలికిన వాక్యము "ఉపాధి విలయా త్పరమాత్మని విలీయతే" అనుప్రమాణమాణము జూపుచున్నారు.

ఈవిధముగా లేదనుట సబబుగా లేదనిపించు చున్నది. ఉపాధి సహిత ఉపాధి రహిత బ్రహ్మములకు భేదము చెప్పరాదు. ఎందుకనగా

**శ్రుతి॥ యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ**
**మృత్యోః సమృత్యు మాప్నోతి యఇహనేవ పశ్యతి ॥కఠో॥**

**తా॥** ఇక్కడేమున్నదో దీనికి (పిండాండమునకు) అక్కడ బయట (అనగా బ్రహ్మాండమందు) అదే యున్నది. ఈవిధముగా గమనించని వానికి జన్మపరంపరలు తప్పవు. What is true of the Microcosm is also true of Macrocosm and vice versa.

ఆత్మ వస్తువునకు అణువునందు లేక మహత్తునందు కూడా సమాన లక్షణాలుండాలి. ఒకటి మాత్రము సత్యము. పిండాండ బ్రహ్మాండములందు ఎక్కడ పరిక్షిస్తే అక్కడ ఈ స్వరూప జ్ఞానమైన ఎరుక ఉన్నట్లు తెలియజడుతుంది.

అచల ఋషియైన గురువు తనకు శరణాగతుడైన శిష్యునికి ఈ కేనోపనిషత్తులోని మొదటి భాగములో 3,4 వ మంత్రములో ద్వయోపాధిగల బ్రహ్మమునకు అతీతముగానున్న పరిపూర్ణ పరబ్రహ్మమును జెప్పియున్నాడు. అది తెలిసినదానికంటె, తెలియరానిదానికంటే అతీతమని, దానిని గూర్చి బోధించి, పూర్వీకుల నుండి అలాగే విన్నామని తెల్పియున్నాడు. కనుక శిష్యుడు అది బాగుగా తెలుసునన్నది అధిష్ఠాన బ్రహ్మను గూర్చి చెప్పినాడేగాని, పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి కాదని సుస్పష్టము. ఎందుకనగా **"నేను లేనప్పుడు అది"** కనుక నాకు తెలిసినదని అన్నప్పుడు **"నేను"** అనే వాడు ఇంకా అతనితో మిగిలియుండుటచే అధిష్టాన బ్రహ్మమును గూర్చి చెప్పినట్లె గదా! కనుక అతనికి పరిపూర్ణ పరబ్రహ్మ తెలియదన్నట్లే. బ్రహ్మను గూర్చినాకు తెలుసునన్న వెంటనే శిష్యునికి అపరోక్షము కాలేదనెడి సంశయము మదిలో మెదలినవాడై **"అథను మీ మాంస్యమేవతే"** ఆ బ్రహ్మమును గూర్చి ఇంకా నీవు తెలుసుకోవలసి యున్నదని అన్నట్లేగదా! అదెట్లనగా

ఎరుక బ్రహ్మమును ***"ఏష సర్వేషు భూతేషు.... సూక్ష్మదర్శిభి"*** ॥కఠ॥ *1,3,12* లో చెప్పినట్లు సూక్ష్మమైన ఆత్మను తత్వవేత్తలు తమ సునిశితమగు ఏకాగ్ర బుద్ధిచే చూచుచున్నారు. కావున అధిష్ఠాన చేతన బ్రహ్మమును సునిశితమైన బుద్ధిచే చూడవచ్చును. అట్టి బ్రహ్మమును తెలిసిందని శిష్యుడు తెల్పియున్నాడు.

శిష్యుడు, గురుడు చెప్పి చూయించిన పరిపూర్ణ పరబ్రహ్మమును ఉండచూచుకొనవలయును. ఈ ప్రక్రియ గురువును సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడే, జ్ఞాన స్వరూపుడే అని నమ్మిననాడు తనకు అది ఉన్నది, అది వున్నది (అది ఉన్నదని చెప్పుటకు వినా మరో మార్గము లేదు. అట్లు చెప్పరాదుగాని విధిలేక చెప్పినారు) చెప్పి దానిని ఉన్నదని నమ్ముటచేత పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ఉనికి ఉపలబ్ధికాగలదు. అప్పుడే చూచిన యెరుకలేక పాయెగదా అనెడి నిశ్చయము కలుగును. ఇట్లు వస్తు నిశ్చయముగా బోధించవలె. శిష్యుడు ఎరుకలేక సేవించవలె. అప్పుడే అది అపరోక్షము. అందుకే పరిపూర్ణ బోధ ***"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథ కోటి భిః"*** అని కోటి గ్రంథములచే తెలియరానిది పరిపూర్ణ గురువుల ద్వారానే అది అపరోక్షము కావలె.

ఇట్లు విన్న శిష్యుడు జిజ్ఞాసి. గనుక విషయమును శ్రవణము చేస్తే సరిపోదని యెంచి మననము చేసాడు. నిధి ధ్యాసనము సాగించాడు. శోధించి సత్యమును తెలుసుకొనుటకు ప్రయత్నించినాడు. అనుభూతిని పొందినాడు. మళ్ళీ గురుదేవుని సమీపించి **"మన్యేవిదితమ్"** నాకు బ్రహ్మము తెలిసినదని భావిస్తున్నాను అన్నాడు.

**యదస్యత్వం యదస్యదేవేష్వథను మీ మాంస్యమేవ** =యదస్య = బ్రహ్మ విషయమైన దేనిచే; త్వం = నీవు; యత్ = ఏదైతే, అస్య = బ్రహ్మము యొక్క; దేవేషు = దేవతలలో (అదికూడ స్వల్పమైనదే); అథ = ఇప్పుడు; ను = ఈకారణముచే; తే = నీకు; మీమాంస్యంను ఏవ = విచారించవలసినదియే.

దేవతలలో పరిచ్ఛిన్నమైన బ్రహ్మము కూడ అతి స్వల్పమైనదే. కనుక నీవు బ్రహ్మను గూర్చి ఇంకా విచారించవలసి యున్నది.

అద్వైత పద్ధతి యందు **"ప్రజ్ఞానం బ్రహ్మ" "జ్ఞానా దేవతు కైవల్యం" "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" "నిత్యం విజ్ఞానం ఆనందం బ్రహ్మ"** ఇత్యాది శ్రుతుల ననుసరించి బ్రహ్మము జ్ఞాన రూపమని నిర్ణయించబడినది. ఈజ్ఞాన రూపమైన బ్రహ్మము సకల దేశాల యందు సమస్తమైన వస్తువులయందు ఉన్నదా? అంటే ఈజ్ఞానము ఏవస్తువు నందు పర్యవసించునో ఆవస్తువే గోచరిస్తుంది. తత్కాలమందు అన్యవస్తు గ్రహణము కలుగుట లేదు. సర్వత్రా ఉంటే సర్వ వస్తువులు ఏకకాలమందే గోచరించాలి. చూద్దామంటే అట్లు గోచరించుట లేదు. నీ వ్యష్టి జ్ఞానము నీ యందు మాత్రమే సర్వత్రా ఉంటుందిగాని నీకు బయట ఉంటే ఒకేసారి ప్రతివాడు సర్వేంద్రియాలు ఆ విషయములన్నీ ఏక కాలమందే గ్రహింప గల్గాలి కదా? మరియు

**శ్లో॥ అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకం!**
**ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూప తతోద్వయం"**

అని "వేదాంతపంచదశి"లో చెప్పబడినది. కాని అస్తి భాతిప్రియ రూపమైన బ్రహ్మములేక జ్ఞానము నామరూపాలున్న చోటనే ప్రకటితమౌతుంది. మరియు సర్వాధిష్ఠానమైన జ్ఞానమునకు తెలియజేయు సత్తా మాత్రమే ఉందని చెప్పబడుతుంది. ఈశ్వర స్థానమున ఈ ఎరుకరూప తెలివి పంచవిధములై సృష్టి, స్థితి, లయ, విస్మృతి, ఆకర్షణము చేయుచున్నది. ఈవిధంగా స్థాన భేదము చేతను, ఉపాధి భేదము చేతను మార్పుచెందే జ్ఞానము సర్వత్రా ఏక రూపముగా లేదు. కొన్ని యెడల సామాన్య జ్ఞానంగా, కొన్ని చోట్ల విశేష జ్ఞానంగా ఉంటూ ఉన్నది.

బ్రహ్మము సమిష్టి రూపమైన అఖండ జ్ఞానమనీ, దానికి సర్వజ్ఞత్వ లక్షణాలున్నాయని పూర్వపక్షం రావచ్చును. కాని లక్షణములు విచారించు చోట వ్యష్టి సమిష్టుల భేదము అంతరించును. అద్వైత పద్ధతి యందు మహావాక్య విచారణచే ముఖ్యంగా **"ప్రజ్ఞానం బ్రహ్మ"** విచారణ యందు వ్యష్టి సమిష్టుల కభేదం ప్రతిపాదింప బడింది. ఒక బస్తాలోని పంచదార ఒకపలుకును పరిక్షిస్తే మొత్తం పంచదార కంతకు అదే లక్షణం నిర్ణయించ వచ్చును. **"అణోరణీయాన్ మహాతో మహీయాన్"** అని చెప్పబడిన ఆత్మ వస్తువునకు అణువునందు మహత్తునందు సమాన లక్షణాలుండాలి. పిండబ్రహ్మాండములందు ఎక్కడ పరీక్షిస్తే అక్కడ ఈజ్ఞాన రూపమైన యెరుక వున్నట్లు

తెలియబడుతుంది. ఎట్లనగా పిండాండమందు ఆత్మస్థానమని చెప్పబడ్డ నేత్రమో, భ్రూమధ్యమో, సహస్రారమో అయినప్పటికి దేహమంతట రక్తమాంసములున్న ప్రతిచోట వాటి సూక్ష్మరూపాలయైన ప్రాణప్రజ్ఞలు సమిష్టి రూపమైన గుర్తు ఏస్థానములో పరిక్షించి చూస్తే ఆస్థానమున భాసిస్తుంది. అందుకే కృష్ణదేశికుల వారు **"అంతటగలదేగాని ఎరుక అంతట గలదా"?** అని ప్రశ్నించి యున్నారు. కనుక ఇదే ఇందులో వుండే చిత్రము. ఎక్కడ చూచిన ఉన్నదిగాని ఏక కాలమున మాత్రం అంతటాలేదు.

ఇంకా కొంత విచారిస్తే ప్రాణులలో, దేవతలలో పరిచ్ఛిన్నమైన బ్రహ్మరూపము జీవ తనువులందు, ఈశ్వర తనువులందు స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరాలలో పరిణామస్థితి అవస్థనుబట్టి జ్ఞానము గొప్ప కురుచలై యుంటుంది. కావున ఈమంత్రమున గురువు ప్రాణులలో, దేవతలలో బ్రహ్మము స్వల్పమని అందుకే చెప్పి యున్నారు.

అంతేగాక కారణ కార్యములుగా జూచినా, వృక్షబీజంగా పరిశీలించినా బీజములోని అంకురము చాలా స్వల్పమైనదాని నుండి ఉద్భవించే వృక్షము మహావృక్షముగా ఎదుగుట మనము చూస్తునే ఉన్నాముగదా! మరియు ఈబ్రహ్మముఉపాధుల పరిణాముల బట్టి కూడా ఉందని చెప్పవచ్చును.

శిష్యుడు గురువువద్ద జ్ఞానాన్ని పొంది సాధన ద్వారా తన నిజస్వరూప జ్ఞానాన్ని పొందగలిగాడు. ఇతరులు ఇదే బ్రహ్మము అంటారు. ఇదే మోక్షమంటారు. ఇంతకన్నా ఇంకా తెలుసుకొనవలసినది లేదంటారు. కాని ఆత్మసాక్షాత్కారము పొందినా తానెవరో తనకు తెలిసివచ్చినదిగాని తన కన్యంగానున్న పరిపూర్ణ పరబ్రహ్మము శిష్యునికి తెలియదు. గురువు ఆవిషయము జెప్పిన, అందు గురి కుదురక పోవుటవల్ల ఆత్మసాక్షాత్కారమే అంతా అనుకొన్నట్లు గోచరమగుచున్నది. ఆత్మ సాక్షాత్కారమువల్ల తాను తెలుసుకొన్నది అల్పమే దానివల్ల జన్మరాహిత్యము సిద్ధించదు. జీవిత లక్ష్యము నెరవేరదు. గురుదేవుడు ఆబ్రహ్మమును గూర్చి ఇంకా విచారించ వలసి యున్నదన్నాడు.

**మన్యేవిదతమ్** = మన్యే = అనుకుంటున్నాను; విదతమ్ = తెలుసును.

గురువచనములు విన్న శిష్యుడు జిజ్ఞాసి గనుక విషయము శ్రవణం చేస్తే సరిపోదని యెంచి మననము చేసాడు. అంతేగాకుండ నిధి ధ్యాసనము సాగించాడు. శోధించి సత్యమును తెలుసుకొన ప్రయత్నించినాడు. అనుభూతిని పొందినవాడు. మళ్ళీ గురుదేవుని సమీపించి "మన్యేవిదితమ్" అన్నాడు. అంటే గురుదేవా! నేను ఆబ్రహ్మమును తెలుసుకొన్నానని భావిస్తున్నాను. అని సవినయముగా విన్నవించాడు.

**2. నాహం మన్యే సువేదేతి నో న వేదతి వేద చ,**
**యోనస్తత్ వేద తద్వేదనో న వేదేతి వేద చ॥**

నాకు అది బాగా తెలిసినది అని అనుకోను. నాకు తెలియదు అనికూడ కాదు. మా ఇరువురిలో ఎవడు తెలిసిన దనియు, తెలియదని అనియు తెలుసుకొనునో అతడికే బాగా తెలియును. ఇక్కడ శిష్యుని దృఢ నిశ్చయంలోని గొప్పతనం తెలుస్తుంది.

సువేద = బాగాతెలిసినది; ఇతి = అని; అహం = నేను; మన్యే = అనుకోనడము; న = లేదు; నో నవేద = తెలియదని కూడా కాదు; ఇతి = ఆవిధముగా; వేదచ = తెలుసుకూడా; న = మాలో; యః = ఎవడు; తత్ = ఆ బ్రహ్మను; వేద = తెలుసుకొనునో; తద్వేద = అది తెలియును; నోనవేదతి = నాకు తెలియదు అనువాడికి తెలియును; వేదచ = తెలుసుకూడ;

## పరిపూర్ణ ప్రబోధామృతము

### *1. నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చః-*

పరిపూర్ణ బ్రహ్మము యొక్క ఉనికి, సహజస్థితి ఈమంత్రము ద్వారా మనకు తెలియుచున్నది. పరిపూరపరబ్రహ్మము తెలిసినదన్నా తప్పే. ఎందుకనగా పరిపూర్ణగురువాక్యానుసారము పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది. అంతట నిండి నిబిడీ కృతమై ఏకమై యున్నది. కనుక తెలియదనరాదు. మరియు తెలియనిది అని అంటే తప్పే. ఎందుకనగా అందుతెలుసుకొనే ఎరుక (తెలివి) లేదు గదా. అందు పంచ తన్మాత్రలు లేనందున అది తెలియదు. అట్లని తెలియనిది కాదు. ఈభావమునే శ్రీకృష్ణదేశి వేంద్రులవారు క.ద. 39 లో **"లేదనకు ఉన్నదదిగో! నే దెలిసితి ననకు దీన్ని నీ వెరిగేవా! "కాదిది నీచే దెలియను! యేదిరా తన్మాత్ర సమితి యీబట్ట బయటా! దీనికి సాటేది యెచ్చోట!"** అని శెలవిచ్చి యున్నారు. అనగా పరిపూర్ణ పరబయలు లేదని జెప్పకుము. ఉన్నదదిగో చూడుము. దానిని ఎరిగితినని జెప్పకుము. దానిని నీవెరుగుటకు సాధ్యమగునా? సాధ్యముగాదు, ఎందుకనగా దానియందు పంచ తన్మాత్ర స్వరూప స్వభావములు లేవు. పరిపూర్ణమునకు సమమైనది యితరము యేమి లేదు. ఈపద్యములోనే **"వాదేల లేనెరుకతో దీనికనిపెట్టి! పోదోలు మెరుక నింకేది బట్టదు చాలు"** అని హితవుకూడా చేసి యున్నారు. అనగా లేనెరుకతో ఉన్నబయలును తెలుసుకొని లేనెరుకను లేదని విడిచి పెట్టినచాలును. జననమరణ రహితమునకు మరేది పట్టదు. అని భావము. మరియు క॥ద॥ 40॥ **కనవచ్చి యిట్టిదట్టిది! యనియన రాకుండు బయలు! నదెకనుగొనుమీ! కనరాక పోతే శూన్యం! బను మిట్టిది యట్టిదనచు పలుక వచ్చిననూ, యెరుకదాంట్లోపలికి జొచ్చిననుః॥"** అని శెలవిచ్చి యున్నారు. పరబయలునందు ఎరుక ఉన్నట్లు తోచునుగాని నిజముగా లేదు. గనుక పరబయలు తప్ప యితరము మేమీ లేనేలేదని నిర్ణయము. మరియు క॥ద॥ 41॥ నందు **"కనవచ్చు బయలు లేదని! యనవచ్చునే యిట్టి దట్టి దనవచ్చునెఛీ! యనరాదు యెరుక కెన్నడు! కనుకనే యీబయలు యెల్ల కాలమంచుందీ! దీనందెరుకే కాలాము లేందీ! వినుమీ లేనెరుకాను వివరించ శూన్యామా!**

**అనుమానమే మెరుక గను విశ్వమట్టిదే! కాలామంచుందీ దీనందెరుకే కాలము లెందీ''!!**

అని శెలవిచ్చి యున్నారు. కనవచ్చు బయలు ఉన్నదని నమ్మిన లేక దృఢమైన వానికి బయలు ఎల్లప్పుడు కనిపిస్తూనే ఉంటుంది. అగుపడెడి బయలు లేదన వచ్చునా! చెప్పరాదు. ఎరుక, బయలును జూచి యిట్టిదట్టిదని చెప్పగలవా? ఛీ దానికి చెప్పరాదు. కాబట్టి పరబయలు ఎల్ల కాలముంటుంది. ఇందులో యెరుక ఏ కాలము ఎప్పుడు లేనేలేదు. గనుక వినుము. ఈ లేనెరుకను విచారించిన **"యదృశ్యం తన్నశ్యం"** అను న్యాయమున శూన్యమైపోవును. గనుక ఈయెరుకచే తెలియ బడుచున్న ఈప్రపంచము కూడ ఉత్తదే యని తెలుసుకోమన్నాడు.

'నాకు బాగుగా తెలుసును అని అనుకోను' అనె విషయమును గూర్చి విచారింతము. పరిపూర్ణ పరబ్రహ్మము పలుకున బలుకగ రానిది. సర్వ లక్షణ విలక్షణమే దాని లక్షణము. భావాభావ పదార్థము కాదు. అది స్వతసిద్ధము. అది ఏమనరానిదని ఊరుకున్నారు. **"అస్తీత్యేవో పలబ్ధవ్యః"** అని దానిని అస్తి పదార్థమని అందామనుకొన్న అస్తి అనె పదము నాస్తి అనె పదమును అపేక్షిస్తుంది. కనుక అది అస్తినాస్తుల కానిది **"అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే"** అనగా అస్తి అని చెప్పుటకంటే మరొక విధంగా ద్యోతకముకాదు. కనుక సాపేక్షిక పదమైనను మరొక గతిలేక అస్తి అని వాడినారు. అది చిద్ఘనము, ప్రజ్ఞాన ఘనము కాదు. ఏలననగా దానియందు ఎరుక (తెలివి, జ్ఞానము, సంవిత్తు) లేనే లేదు. వ్యష్టి సమిష్ట్యాత్మకమగు ఆతెలివి ఏమార్పులు యెన్నడు ఎరుగక ఒక్క తీరుగా నున్నది. అది నిరావరణమైనది. అది సూక్ష్మముకాదు, స్థూలము కూడా కాదు, కనుక పరిపూర్ణ పరబయలునందు ఎరుక పరిణామ రూపమగు మరుపుగాని లేదు. అది ఎరుక మరుపులు లేనిది. కనుక అది తెలియ రానిది. క్లుప్తంగా చెప్పాలంటే అది ఏమి కానిది, ఏమి లేనిది. **"అది తెలియ బడనిది అని తెలుసు కొంటిని"** అంటె సరిపోతుందేమో. (చూడుము పరిపూర్ణ దర్శనము పుట సంఖ్య (10). ఇంకా పరిపూర్ణ పరబయలు ఎటువంటిదనగా

**క॥ద॥ 33॥ "ఎరుకైన రీతినుండును। యెరుగనశక్యం బటంచు। యెన్నిన యెరుకన్। యెరుగుదుననినను యెరుకకె। యెరుగుట దుర్లభము సుమ్మి। యీవుత్త బయలూ। యెరుగనే యెరుగ। దెరుకానీ బైలూ। ...."** అని

శ్రీకృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చి యున్నారు. అనగా అచలపరిపూర్ణ పరబయలు యెరుకైనట్టులను, యెరుగుటకు శక్యంబు గానట్టులను, యే ఎరుక తెలుసుకొంటున్నదో ఆయెరుకకే ఈగుర్తులన్నీ. అదేవిధముగా అచల పరిపూర్ణ పరబాహ్యమందు ఐక్యము పొందుతానని నిర్ణయించుకొన్నా పొంద నశక్యము.. ఎందుకనగా అచల పరిపూర్ణ పరబయలు ఈఎరుకను ఎరుగదు.

ఇప్పుడిక తెలియరానిది కూడాకాదు అను విషయమును పరిశీలింతము. "అత్యంత విలక్షణమైన నిరపేక్షక స్వయంసార వస్తువేదో యున్నదని దానిని తెలుసుకొనవలెనని జిజ్ఞాసి ఆశపడుతున్నాడు. కాని తెలియబడే లక్షణమే ఉంటే ఆవస్తువు జ్ఞేయ పదార్థకోటిలో చేరి జ్ఞాన విషయమై జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ త్రిపుటిలో చేరిపోవును. కనుక ఈసాపేక్షిక జగత్తునకు ఆ నిరపేక్షక వస్తువు కారణముగాని, ఆధారముగాని, తానే ఆకేవలత్వమున నిలిచి ఈసాపేక్షిక జగత్తు యొక్క ఉనికి విమర్శించవలెననిగాని, ఆనిరపేక్షక స్వయం సార కేవలత్వమును తెలిసి ప్రేమించి దానితో ఐక్యము పొందవలెనని ఆశించుట నిరర్థకమే. ఎంత ప్రయత్నించినా మానవుడు తానుతానుగా ఉండి సాపేక్షక జగత్తును విడువగలుగుట అసంభవము. తన ఉనికియే మానవుని ఈ సాపేక్షిక జగత్తునకు సర్వదా బంధించి యున్నది. తాను పొందగలిగినది సాపేక్షిక శాంతి మాత్రమే, సాపేక్షిక శాశ్వతత్వము మాత్రమే, సాపేక్షిక ఏకత్వము మాత్రమే. ఏలననగా తాను, ఆ నిరపేక్షిక కేవలత్వము రెండు ఉనికి కలిగి యుండుట అసంభవము. తాను లేకుంటే తప్ప ఆ కేవలత్వము సిద్ధించదు. తానుండి ఆ నిరపేక్షిక కేవలత్వమును గుర్తించవలెననెడి అడియాసలోనై మానవుడు సృష్ట్యాది నుండి ప్రయత్నించుచున్నాడు. దేశకాల ధర్మములను సామర్థ్యరూపశక్తిని, ఆసక్తిగల వ్యక్తిని లేక శక్తివంతుని లేక స్థానమును, ప్రకృతి పురుషులను, ప్రాణ ప్రజ్ఞలను, సద సత్తులను విమర్శించి చూచుచూ, అందేదో ఒక దానిని ఆ నిరపేక్షక స్వయం సార వస్తువుగా నిర్ణయించి ప్రతిపాదిస్తు, తిరిగి తన పొరపాటును గుర్తిస్తూ ముందు ముందు జిజ్ఞాస సాగిస్తునే యున్నాడు. కాని, దేశము, కాలము, కర్మము, శక్తి, శక్తుడు ప్రకృతి పురుషుడు, ప్రజ్ఞ, సత్తు, అసత్తు, ఇవన్నీ సాపేక్షక పదార్థ జాతమును మీర జాలక పోవుచున్నవి. ఇట్టి నిరపేక్షిక కేవల వస్తువు ఒకటి యున్నది అను భావన మాత్రముతో ఆ జిజ్ఞాసి ఉపశాంతి పొందవలసినదేనా? ఆహా అంతే! **"నైవ వచా నమనసా ప్రాప్తుంశక్యో నచక్షుషా అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుప లభ్యతే** ॥కఠ॥ అనగా వాక్కు, మనస్సు, కండ్లకు ప్రాప్తించరానిది, ఉన్నదని చెప్పుటకు వినా మరోరీతిగా దాని ఉపలబ్ధి కాజాలదని శ్రుతి ఘోషించుచున్నది. అస్తి నాస్తులు రెండు పరస్పర సాపేక్షికములు కదా! అయితే ఇక ఎట్లు? **"అది తెలియబడనిది అని తెలుసుకొంటె"** అంటే సరిపోతుందేమో" పరిపూర్ణ దర్శనము - పుట 10. పరిపూర్ణము ఉన్నదన్నా తప్పే. లేదన్నా తప్పే, ఎందుకనగా అది మాటలకు అందదు. కన్నులకు కానరాదు. విషయ పంచకమైన శబ్దాది విషయములకు గోచరముగాని దాన్ని, ఉన్నదనుట తప్పే గదా! ఇక లేదంటే తప్పెట్లనగా అది ఏమికానిది, ఏమిలేనిది, అహం (నేను) లేనప్పుడు ఉన్నది. కాని అహం (నేను) అనే ఎరుక లేనప్పుడు పరిపూర్ణపరబ్రహ్మ ముంటుంది గాని, అప్పుడు దాన్ని కనుగొనుటకు ఎరుకలేదు, కనుక అది చూచుటకు వీలు లేదు.

ఎరుక మరుపులు సాకార నిరాకారములు, సగుణ నిర్గుణములు, సదసత్తులు

లేని పరిపూర్ణ పరబ్రహ్మమును దేనిచే గ్రహించగలము అను ప్రశ్న ఎదురగుట సహజము. అది ఏమి కానిది, ఏమి లేనిది. **"నేతి నేతి నేతీతి హోహచ"** అన్న రీతిగా వ్యతిరేక పద్ధతి **(Nagative)** గా దానిని విచారించకొనవచ్చును. గాని గ్రహించుట ఎట్లు? అందుకే శ్రీకృష్ణదేశికేంద్రలవారు "లేనెరుకతో దీన్ని కనిపెట్టి పోదాలు" మన్నారు. "చూస్తూనే ఎరుక పారిపోవు"నన్నారు. పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షమగుట, ఎరుక లేకపోవుట సమకాలమందే జరిగిపోవును. పరిపూర్ణమును జాచిన ఎరుక లేదు అన్నారు. తెలియుట, అపరోక్షమనుట అపచారమే. నరుని నోట ఉచ్ఛిష్టము కానిది ఇదివోక్కటే. కనుక ఏ నిర్ణయ చేయుటకు వీలులేదు. నిర్ణయమే మహాపాపమన్నారు.

**క.ద॥42" గురుమూర్తి జూపకున్నను। పరిపూర్ణం బెట్లు తనకు ప్రత్యక్షమగున్। గురుమూర్తి జూపెనేనియు। పరిపూర్ణము తనకు లెస్స ప్రత్యక్షమౌరా। చూస్తూనే ఎరుక పారిపోవునురా। యెరుకబోయిన వెనుక యెవరా ప్రత్యక్షాన్ని యెరిగిట్టి దట్టించెరిగే వారటుమీద।"**

సద్గురుమూర్తి చూపకుండిన పరిపూర్ణ పరబయలు తనకు సాక్షాత్కార మెట్లగును. సద్గురుమూర్తి చూపిన యెడల పరిపూర్ణ పరబయలు జనన మరణములు లేనిదని తనకు సాక్షాత్కారమగును. పరిపూర్ణ పరబయలును దర్శించిన, యెరుక పోయిన తర్వాత ఆ సాక్షాత్కారము తెలుసుకొని యిటువంటిది అటువంటిది యని చెప్పుటకు ఎవరుండరని భావము, మరొక కందార్థ దర్పనందు

**క.ద॥209 "అపరోక్షమౌనె మనుజులు కు పరోక్షంబైన బయలు గురు కృపలేకన్। అపరోక్షమౌను మనుజులు కు పరోక్షంబైన బయలు గురు కృపగలుగా! కీలిదెలేని। యెరుకతా తొలుగా॥ విపరీత మౌబుద్ధి విడిచినీవెప్పుడు ఉవచారవములు చేయు చుండూము గురునికీ। గురుకృప గలుగా॥"**

సద్గురు దయ కలుగనిచో తనకంటే వేరుగా నున్నట్లు తెలియుచున్న అచల పరిపూర్ణ పరబయలు తెలియబడదు. సద్గురుమూర్తి కరుణ కలిగినచో తనకంటే వేరుగా నున్నట్లు తెలియుచున్న అచల పరిపూర్ణ బయలు తెలియబడును. అచల పరిపూర్ణ పరబయలు తెలియుటయే లేనెరుక తొలగుటకు కీలు, గనుక పరిపరివిధముల పోవునట్టి బుద్ధిని విడిచిపెట్టి సద్గురువు కరుణా కటాక్షము కలుగునటుల త్రికరణ శుద్ధి ప్రవర్తన యును - **గురు భక్తి,** చతుర్విధ శుశ్రూషలను - **గురుసేవ,** కర్తృత్వరహిత కర్మాచరణయను వ్రతము -**గురునిష్టయను** నిర్ణయములు అనగా గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ ఆచరించుటవల్ల అతనికి నీయందు దయ గలిగి ఆ రహస్యమును అనగా అచల పరిపూర్ణ పరబయలును వస్తు నిశ్చయముగా తెలియజేయును.

పై కందార్థములో చెప్పినట్లు పరిపూర్ణ గురువు ద్వారానే అది తెలియవచ్చును.

అందరికి తెలిసిన, తెలియసాధ్యమైన విషయముల గురించి చెప్పుటకు గురువెందుకు? అవసరములేదు. తన విజ్ఞానముచే తెలుసుకొంటు సర్వజ్ఞత్వమునకు దగ్గర అగు చున్నాడు. కాని మనో వాక్కులకు అందని పరిపూర్ణ భావము అట్లు తెలియుటకు సాధ్యముకాదు. ఏలననగా ఆ పరిపూర్ణ భావమును సర్వజ్ఞత్వ లక్షణములుగల అధిష్ఠాన చేతన బ్రహ్మమగు ఎరుక కూడా తెలుసుకొనజాలదు. ఆ పరిపూర్ణమునందు ఎరుక లేదు. కనుక తెలియరాని ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థముగా తెలుపుట వేదముల మరియు వేదముల అంతమున నుండు ఉపనిషత్తుల ముఖ్యోద్దేశము. మిగతా విషయములను గూర్చి వేదములు తెలుపనక్కర లేదు. మానవుడు తెలుసుకొనగలడు. ఏలననగా ప్రత్యక్షముగా జీవజగత్తులు తెలియబడుచున్నవి. వీటి సృష్టి స్థితి లయముల కాధారమగు సగుణ నిర్గుణ బ్రహ్మమును కూడా అనుమాన ప్రమాణములచే నూహించి అతీంద్రియ బుద్ధిచే గ్రహించవచ్చును. కనుక ఇతర వాదములు తెలియుటకు వేదములు అక్కరలేదు మరియు వాక్కుల కందని, నిరపేక్షకమైన నిష్ప్రతియోగికమైన శుద్ధ నిర్గుణమైన, ఆత్మాతీతమైన, అవా ఙ్మానస గోచరమైన పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియజెప్పుటకు మాత్రమే గురువు అవుసరము. అది గురువుద్వారానే తెలియదగినది, ఏలననగా అచల ఋషులు జనన మరణ విధానము ఈపరిపూర్ణ బోధయందు మాత్రమే గలదని తెలుసుకొని దానిని పరమగోప్యంగా నుంచి తమ్మాశ్రయించిన లక్షణయుతులకు మాత్రమే ఉపదేశ రూపకముగా ప్రసాదిస్తు ఈపరిపూర్ణ భావమును గురుగోప్యముగా కాపాడి పోషిస్తూ వచ్చినారు. కనుక పరిపూర్ణ గురువుల ద్వారాకాక మరొమార్గమున ఇది తెలియబడదు. అందుకే ఈమంత్రమున శిష్యుడు **"నాహంమన్యేసువేదేతి నోనవేదతి వేదచ"** అనగా బ్రహ్మము నాకు తెలుసునని అనుకోను, తెలియదు అని కూడా కాదు, తెలుసు కూడా అంటే అదికేవలం **పరిపూర్ణ గురువు ద్వారా మాత్రమేనని** గ్రహించవలయును. **ఆ॥ గురువు చెప్పు విద్య గురునకు తెలుసును। గురువు చెప్పు విద్య గురువు ఎరుగు। గురువు మహిమ పరమ గురునకు తెలుసును ॥వే॥** తా॥ గురువు చెప్పు విద్య మరొక గురువునకే తెలుసును కాని వేరొకరికి తెలియదు. పూర్ణ గురువులు తెల్పు విద్య గురుత్వము పొందిన గురువుకే తెలియబడును. గురువు యొక్క మహిమ (రహస్యము) పరమ గురువుయగు పరిపూర్ణ గురువునకే తెలియునని వేమన వక్కాణించుచున్నాడు.

పరిపూర్ణ పరబ్రహ్మమును ఎట్లు తెసుకొనవలెనో? వివరించుట ఎట్లో? ఇతరులకు తెల్పుట ఎట్లో? దేశికవర్యులు శ్రీశ్రీ. ఇలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు గారు తమ **"పరిపూర్ణ దర్శనము"** లో పరిపూర్ణ ప్రకరణమున తెల్పిన విధానమును యిచ్చట పరిశీలనార్థము పొందు పరచుచున్నాను. "ఉన్నవి రెండే. ఒకటి పరిపూర్ణము రెండవది లేని ఎరుక. కనుక లేనెరుకను క్షుణ్ణముగా వివరించి చూపించి అది కానిది అది లేనిది యేదో అదే పరిపూర్ణము అని మాత్రము చెప్పవచ్చును. అట్టిలేనెరుకను విడిచితే అంతా

పరిపూర్ణ పరబ్రహ్మమే. వాక్కుచే చెప్పరాని దానిని చెప్పుట కింతకంటే మరో మార్గము లేదు. దీనిని గురించి తెలుసుకొన్న శిష్యుడు, ఎట్లు దీనిని తెలుసుకొనునంటే, గురువు చెప్పి చూపించిన లేనెరుకను ముందుగా తెలుసుకొనును. అది మాత్రము అంత సులువుగా తెలియబడునా? అంటే తెలియబడదు. కాని అంతః కరణశుద్ధి కలిగిన శిష్యుడైతే ఆలేనెరుక స్వరూపుడుతానే అయి నిలుచుటే ఆ లేనెరుకను తెలియుట. **అట్టి స్థితి యందే, తానుగాని పరిపూర్ణపరబ్రహ్మమున్నది. ఇదే పరిపూర్ణమును ఉండజూచుకొనుట. అట్లు ఉండజూచిన తెలివి లేనేలేదని దానిని రహితమొనర్చుకొనుటే లేనెరుకతో పరిపూర్ణము గనిపెట్టుట. ఇదే ఎరుకలేక సేవించుటకు సోపానము''.** ఇదంతా వాచాజ్ఞానము. దీనిని మీరు మీమీ గురుపుంగవులకు చతుర్విధ శుశ్రూషలు చేసి **"ఈగుట్టు దేశికుని నోట గట్టిగ తెలుసుకో"** మని హితవు పలికియున్నారు. శ్రీకృష్ణదేశి కేంద్ర ప్రభువులు. అందుకే **"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథ కోటిభిః"** మరొక మార్గము లేదు.

యోనస్తత్ వేద తద్వేదనో న వేదేతి వేద చ :-

ఇచ్చుట గురువు ప్రశ్నకు సమాధానంగా, శిష్యుడు మనలో ఎవడు తెలిసినది అనియు తెలియనిది అనియు తెలుసుకొనునో అతడికే బాగా తెలియును. పరిపూర్ణ పరబ్రహ్మము, తెలియరానిదని ఇదివరకటి మంత్రములలో జెప్పిన దీఉపనిషత్తు, తెలియవచ్చేది బ్రహ్మము కాదని కూడా చెప్పింది. మరి ఈమంత్రమున అది తెలుసునను కోవడము లేదు. తెలియదని కూడా కాదు అని గ్రహించినవాడు దానిని గ్రహించగలడు అని విశదపరచినది. ఈవాక్యములలోని అర్థమును గ్రహించినట్లయితే బోధ పడునదేమనగా పరిపూర్ణ బోధ యందు కేవలం గురు శిష్యుల మధ్య తెలుపుట, తెలుసుకొనుట యనుక్రియ జరుగును. ఎందుకనగా ఈ బోధ యందు గురువు తన గురువు ద్వారా ఆవిధముగా ఎరిగినవాడు. గనుకనే తన శిష్యునికి తన గురువు చెప్పి చూపించిన విధమును తెలియజేయును. అంతేగాక అందలి మర్మధర్మములు తన గురువు ద్వారా విన్నవాడు, కన్నవాడు, కనుక తన శిష్యునికి తెలియజేయును, కనజేయును. అట్లు వినని గురువు ద్వారా బోధ బడసిన ఆగురువు తాను చెడుటయేగాక తన్నాశ్రయించిన శిష్యులను కూడా చెడగొట్టిన వాడగును. అట్టి వారు **"ఉట్టికెగరలేనివాడు స్వర్గమునకు ఎగురునట్లు"** ఉండును. పరిపూర్ణము తెలియుననుట కేవలము గురువు ద్వారా తన శిష్యునికి తెలియును. ఇతరులకు ఇది తెల్పరాదను గురుగోప్య నిర్ణయమును పాటిస్తూ నేటికిని పరిపూర్ణ భావమును కాపాడి పోషిస్తున్నారు.

పరిపూర్ణ పరబ్రహ్మము తానైన సచ్చిదానంద వస్తువు కాదు. తానుగాని, తన జ్ఞాన ప్రకాశముగాని ఆపరిపూర్ణ పరబ్రహ్మమందు జొరబడుటకు వీలు లేదు. అది పంచతన్మాత్ర రహితము కనుక యింద్రియములచేగాని, భావాభావరహిత మగుటచే

మనస్సుచేగాని తెలియరానిది. ఇట్లు తనసంగతినీ, తనకన్యమై సర్వాతీతమైనదాని విషయము గురుముఖతః తెలుసుకొన్నవాడే బ్రహ్మజ్ఞాని. ఆ బ్రహ్మజ్ఞాని కూడ ఈమంత్రమున పేర్కొన్న విధముననే దానిని తన గురువు ద్వారా తెలుసుకొన్నవాడు గనుకనే అదే **"నాహం మన్యే నువేదేతి, వేదచ"** దానిని నేను చక్కగా తెలుసుకొంటిననిగాని, తెలుసుకొన జాలక పోతిని, అనిగాని తలంచుటలేదు. అని తెలుసుకున్న వాడే బ్రహ్మజ్ఞాని, ఏలననగా అది తెలివిచే గ్రహించదగినది అంటే అదే తానైపోవును. నాకు వేరుగా దాని గ్రహించితిని అని అంటే అదినాకు వేరైన జడవస్తువు కావలెను. పరిపూర్ణము తెలివి రూపముగాదు. జడరూపముగాదు. కనుక పరిపూర్ణ మెరుకల రెంటిని ఆ విధముగా తమ తమ గురువుల ద్వారా తెలుసుకొని తరించవలసినదే. ఎందుకనగా అది గుహ్యాతి గుహ్యమైన గురుశిష్యుల మధ్యగల మహోన్నతమైన, అతి గూఢమైన విషయము. అందుకే ఈఉపనిషత్తున పేర్కొనబడిన గురువు శిష్యులలో ఎవరు ఈవిధముగా తెలుసుకొన్నారో వారికి మాత్రమే పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్ష మని వక్కాణించబడింది.

**క.ద॥179 "నామాట లెస్సవినుమా। సామాన్యం బనుచుజాడ। జనదీ బోధన్। ప్రేమాతి శయమునన్ గని। వేమారిది గురుని నోట। వినవలె సుమ్మీ। నిత్యము చదువు కొనవలెనమ్మీ।"** అనీ **క.ద॥184 "తాబేటి తలపుచేతను। తాబేల్పిల్లల క్షుదార్తి। తలగుట తెలియున్ తాబేటి గర్భమందున। తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ। సద్గురు బోధట్లరయా నితరులకూ।"**

అటువలెనే సద్గురు పుత్రులకు సద్గురు ప్రబోధప్రభావము తెలియును. గాని ఇతరుల కేంతమాత్రము తెలియదు. జనన మరణ బాధలేని సద్గురువులచే నీ పరిపూర్ణ బోధను బడయ జాలక ఎరుక భ్రాంతి గల వారిచే బోధపొందిన వారికి జనన మరణ బాధ తోలగదని భావము.

3. "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః ।
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్ ॥

ఎవడు తెలియదనెనో వానికి తెలుస్తుంది. ఎవనికి తెలిసిన దనునో వానికి తెలియదు, పండితులకు అది తెలియనిది. కాని అజ్ఞానికి అది తెలసినది.

యస్యామతం తస్యమతం = యస్య = ఎవడు; అమతం = తెలియదు అనునో; తస్య = అతనికి; మతమ్ = తెలుసును;

మతం యస్యన వేదస =యస్య = ఎవడు; మతం = తెలిసినదనునో; నవేద = తెలియనివాడు

ఎవడు తెలియ దనునో వానికి (పరిపూర్ణ పరబ్రహ్మము) తెలియును. తెలుసునన్నవాడే

దానిని నిజంగా తెలియనివాడు.



పరిపూర్ణ ప్రబోధామృతము :

జ్ఞాన జ్ఞేయములలో సమాన ధర్మములున్నప్పుడే వస్తువు గోచరించును లేక తెలియవచ్చును. ఉ॥ రూపతన్మాత్ర నుండి కలగిన చక్షురింద్రియమునకు రూపములున్న వస్తువులే గోచరించునుగాని, రూపములు లేని వాయువు ఆకాశములు కనిపించవు గదా! అట్లే శ్రోత్రేంద్రియముచేత రూపమును గుర్తించ జాలముగదా! జ్ఞానము నందలి సత్వగుణాంశము జ్ఞేయవస్తువు నందలి సత్వగుణాంశముతో గూడినప్పుడే వస్తువు యొక్క జ్ఞానము కలుగుచున్నదని శాస్త్రజ్ఞులంటున్నారు. నిర్విషయ మనస్సు శుద్ధమగుటచే అట్టి మనస్సు శుద్ధమగు ఆత్మను అపరోక్షము చేసుకొనగలదు. కనుకనే **"ఆత్మవారే ద్రష్టవ్యం"** మరియు **"మనసైవాను ద్రష్టవ్యం......."** అనే శ్రుతులు పలుకుచున్నవి. కనుక అదియే అఖండ ఎరుక, అట్టి ఎరుక పరిపూర్ణపర బ్రహ్మమందు లేశమైన లేదు. కనుక ఎరుకచేత పరిపూర్ణ పరబ్రహ్మము గుర్తింప బడజాలదు. మరియు జ్ఞాన రూపము సత్వగుణరూపము. పరిపూర్ణము గుణత్రయ రహితము లేక శుద్ధ నిర్గుణము అని కీర్తించబడుచున్నది. పరిపూర్ణము ఎరుక రెండింటిలో సమాన ధర్మములు ఏమీలేవు. కనుక ఎరుకకు పరిపూర్ణ పరబ్రహ్మము జ్ఞేయమని ఎంత మాత్రము చెప్పరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము ఎప్పటికి అవిజ్ఞేయముగా నుండి పోవలసినదే. అయితే శ్రుతి యుక్తి తర్కముల చేతను, గురువాక్యము చేతను పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క ఉనికి మాత్రము నిశ్చయము కాగలదు. **ఇదియే ఉండజాచుకొనుట.** అట్లు పరిపూర్ణ పరబ్రహ్మము అనుమాన ప్రమాణము చేతనే తెలియదగినదని అనరాదు. అది ప్రత్యక్ష ప్రమాణ గమ్యము కాదు. షట్ప్రమాణములు పనికి రావు. అది ప్రమాతృ ప్రమాణ ప్రమేయములను త్రిపుటి కతీతము. కనుకనే అప్రమేయమన్నారు. మరియు పరిపూర్ణ పరబ్రహ్మమును జ్ఞేయమనియంటే అది దృశ్యకోటిలో చేరిపోవును. ఏలననగా

**"యద్యత్పశ్యతి చక్షుభ్యాం తత్తాదా త్మేతినిశ్చయా!**
**యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా"**

అనే శ్రుతి నిర్ణయానుసారము జ్ఞానేంద్రియ పంచకముచే తెలియబడు సమస్తము ఆత్మే (ఎరుకనే) నన్నమాట. జ్ఞానేంద్రియములు పరికరములు మాత్రమే. వాటి ద్వారా తెలుసుకొనేది మనస్సు లేక జ్ఞానము. కనుకనే జ్ఞేయవస్తువులన్ని దృశ్యకోటిలోచేరి **"యదృశ్యం తన్నశ్యం"** అనె శ్రుత్యానుసారము శ్యాపత్తికలే అగుచున్నవి. పరిపూర్ణము దృశ్యముగాదు నశ్యము గాదు. జ్ఞేయముకాదు అవిజ్ఞేయము కాదు. సర్వ ద్విపుటులకు త్రిపుటులకు తెలియరానిది. కావున అది తెలియరానిది, అట్లు తెలియరానిదని తెలసినవాడు గనుకనే తెలియదు అని చెప్పును. పరిపూర్ణ పరబ్రహ్మము తెలియరాదనెడి

సత్యమును సత్యముగా నెరిగినవాడు సద్గురువు ద్వారా ఉన్నదనెడి ఉనికిని ఉపలబ్ది పొందినవాడు. కనుక అతనికి తెలుసునన్న మాట.

ఆ పరిపూర్ణ పరబ్రహ్మమెట్లుండునో తెలుసుకొనవలెనని ఆశపడుట సహజమే కాని అది **"ఇట్టి దట్టిదని యనరానిది వట్టి యాశలచేత పట్టుబడక ఆగుట్టు దేశికుని నోట గట్టిగా తెలుసుకోమని"** శ్రీకృష్ణ దేశికులు హెచ్చరించి యున్నారు. ఐనప్పటికి ఈతృష్ణ చల్లారుటలేదు. అది ఇట్టి దట్టిదని తెలుసుకొనగల్గుదుననుట వట్టి భ్రాంతియే, ఈభ్రాంతి రహితమునకు మరొక శ్లోకం **"యథానాహం తథాశుద్ధం తస్మాద్ శుద్ధేన నిర్ణయః"** అనగా నేను లేనప్పుడెట్లుండునో ఆవిధంగానే పూర్ణపరబ్రహ్మము శుద్ధముగా ఉండును అని తెలిసికొని తృప్తి చెందవలసినదే. అట్లు దానిని ఇట్టిది అట్టిదని తెలుసుకొనజూచుట భ్రాంతియని గ్రహించినవాడే తెలిసినవాడు. నేనులేనప్పుడు శూన్య ముండును అని అనుకొని పరిపూర్ణము శూన్యము, రెండు ఒక్కటే, అని ఎవరైన అంటే అది శుద్ధ తప్పు, ఎట్లనగా నీవుండి శూన్యమును తెలుసుకొంటివా? లేక నీవు లేక శూన్యమును తెలుసుకొంటివా? నీవుంటే అది శూన్యమెట్లగును? నీవు లేకపోతే అది శూన్యమని ఎట్లు చెప్పగలవు? కనుక దానితో పోల్చ దగిన సాటిదేది లేదు. నోటితో యేమనుటకు వీలులేదు. పరిపూర్ణమని, శుద్ధమని మరేమనిగాని పలుక రానిది. ఈ వివరణము వలన తేలు సారాంశమేమనగా ఎవరికి తెలియదు అని అనునోవానికి పరిపూర్ణము తెలియును. ఎందుకనగా అది నేను లేనప్పుడు ఉండునుగదా! కనుక నేను లేకుంటే ఆపరిపూర్ణమును తెలుసుకొనె వారెవరుందురు. మరియు నేను ఉంటే పరిపూర్ణము అపరోక్షము కాదుగదా! నేను ఉండి పరిపూర్ణమును తెలిసినదంటే అది భ్రాంతి రూపముగదా! కనుక ఎవడు అది తెలియదు అనునోవానికది అపరోక్షము. వాని కది ఉపలబ్ది కాగలదు. ఎవడు తెలిసినదనునో వానికది అపరోక్షము కాదు. ఎందుకనగా తానుండి ఆపరిపూర్ణమును తెలుసుకొనవలెనని ఆశపడుట వట్టి ఆశ, మరియు భ్రాంతి. ఇచ్చట శ్రీకృష్ణ దేశికుల వారి **39**వ కందార్థమును పరిశీలింతము.

క.ద. **"లేదనకు మున్నదదిగో। నేదెలిసితి ననకు దీన్నినీ వెరిగేవా। కాదిది నీచే తెలియను। యేదిర తన్మాత్ర సమితి యీ బట్ట బయటా। దీనికి సాటిదేది యెచ్చోట"**

అనగా ఈ పరబయలులేదని చెప్పకుము. ఉన్నదదిగో చూడుము. దానిని యెరిగితినని జెప్పకుము. నీవు దానిని ఎరుగుటకు సాధ్యముగాదు. ఎందుకనగా దాని యందు పంచతన్మాత్రల స్వరూప స్వభావములు లేవు. దీనికి సమమైనది ఇతరము ఏది లేదు. వస్తువు యొక్క స్థాన, స్వరూప, స్వభావములు తెలిసిన తదుపరి వాదముతో పనిలేదు. లేనెరుకతో ఉన్న పరబయలును తెలుసుకొని గురు వాక్యాను సారము లేనెరుక లేదని విడిచి పెట్టిన జనన మరణ రహితమునకు చాలును.

క్లుప్తంగా జెప్పాలంటే పరిపూర్ణ పరబ్రహ్మము "నేను లేనప్పుడు అది స్వతః సిద్ధం" పరిపూర్ణము తెలియదు అన్నవానికే అది తెలియును. ఎట్లనగా నేను లేనప్పుడు అది అపరోక్షము మరియు అది తెలియునన్నవానికి తెలియదు. ఎందుకనగా పరిపూర్ణ పరబ్రహ్మమందు తెలుసుకొనె ఎరుకలేదు. తన్మాత్రలు లేవు. రెంటి యందు సమాన ధర్మములు లేవు. కనుక అది గోచరము కాదు. గురుడు తెలియరాని దానిని తెల్పియున్నాడు. శిష్యుడు ఎరుకనువదలి చూడవలసి యుండును. **అది తెలియరానిదని తెలుసుటే అపరోక్షము.** దానిని నేను తెలుసుకొంటి నంటే నీవుండి తెలుసుకొంటివా? లేక నీవు లేక తెలుసుకొంటివా? అంటే నీ వుండి చూచిన అది గోచరము కాదు. నీవు లేకుండ చూచితివా? నీవే లేవు మరెట్లు చూచితివి? అనెడి ప్రశ్న వస్తుంది. కనుక ఎవడు తెలియదు అని అనునోవానికి తెలుసును. ఎవడు తెలియును అని అనునో వానికి పరిపూర్ణ పరబ్రహ్మము తెలియదు.

"నిర్ణయోనాస్తి సర్వదా" నిర్ణయమే మహాపాపం. ఏనిర్ణయముజేసిన మాటల నిర్ణయమేకదా! శబ్దనిశ్శబ్దములకు మీరినది. పరిపూర్ణ పరబ్రహ్మను గూర్చి చెప్పు శబ్దములు లేక వైఖరీ వాక్కుకు సమమగు మాటలు లేనేలేవు. కనుక మాట మాయ అని బోధతో సహా వాగ్వ్యాపారమంతయు కలలోని ముచ్చట్లని శ్రీకృష్ణ దేశి కేంద్రుల వారుసెలవిచ్చి యున్నారు. అట్లే ఏ నిర్ణయము జేసిన తెలివితో (ఎరుకతో) చేయవలసినదే గదా! ఆ ఎరుకలేనిదే అయితే ఆ ఎరుక జేసిన నిర్ణయములు లేనివే కాగలవు. కనుక నిర్ణయమే మహాపాపము. కావున ఈమంత్రమున జెప్పినట్లు తెలియును అన్నవానికి తెలియదు. ఎవడు తెలియదు అని అనునోవానికే తెలుసును. అట్లు నిర్ణయం చేయుట కూడా మాటల నిర్ణయమే కదా (సమారాధనకదా). మాటలే మాయ కనుక అట్లు నిర్ణయం చేయుట కూడా మహాపాపము. ఈవిషయమంతా గురుముఖంగా తెలుసుకొని పరిపూర్ణమును అపరోక్షము జేసుకొనవలసినదే.

**అవిజ్ఞాతాం విజ్ఞానతాం** = **జ్ఞానవంతులకు తెలియదు**
**విజ్ఞాత మవిజానతామ్** = **అజ్ఞానులకు అది తెలియును**

సర్వద్వంద్వమైన సచ్చిదానంద స్వరూప బ్రహ్మము. సర్వ ద్వంద్వరూపములు లేనిది పరిపూర్ణపరబ్రహ్మము. ఈపరిపూర్ణపరబ్రహ్మమే అచలము, సత్యము, నిరంజనము, పరాత్పరము, బాహ్యమని కొనియాడబడినది.

**"అచలమేవ సత్యం, నిరంజనం, నిర్వికల్ప పరాత్పరం బాహ్యముపైతి విద్వాన్ అన్య జ్ఞానం భ్రాంతి వృద్ధి ప్రయాతి యేవం జ్ఞాత్వా జన్మరాహిత్యమశ్నుతే"**

అచలము-చలము, సత్యము-అసత్యము, అంజనము-నిరంజనము, సవికల్పము-నిర్వికల్పము యిత్యాదులన్ని ద్వంద్వములే, సాపేక్షకములే. పరిపూర్ణము నిర్ద్వంద్వము, నిరపేక్షకము, పలుకుల కందనిది. సచ్చిదానంద బ్రహ్మము సర్వముతానై

యున్నందున, సర్వద్వంద్వములు అదే. కనుక అచలము సత్యము, నిరంజనము, నిర్వికల్పము పరము అయిఉన్నది. ఈపరమునకు పరమై యున్నందున పరాత్పరమని బాహ్యామని పరిపూర్ణ పర(బహ్మమని చెప్పబడునదై పరిపూర్ణ బోధజ్ఞులైన స్వచ్ఛందుల చేతనే సమీపింపదగినది. ఏలననగా పరిపూర్ణ పర(బహ్మము తెలియబడునది అని గాని తెలియరానిదనిగాని చెప్పుటకు వీలు లేనిది. కనుక ఉపైతి అనబడినది. విద్వాన్ అనే మాటకు శా(స్త్ర పండితుడని అర్థము కాదు. **"పాండిత్యం నిర్విద్యా"** అని శృతి. విద్యా విద్యలకెల్ల అతీతమైన నిర్విద్యా స్వరూపమే పరిపూర్ణ పర(బహ్మము. గురూపదిష్ట మార్గమున అనగా లేనెరుకతో దానిని కనిపెట్టినవాడే పండితుడు. **"చూస్తూనే ఎరుకపారి పోవునురా"** చూచిన ఎరుక లేదు. గనుక చూచితిననిగాని, చూడలేదనిగాని అతడు చెప్పజాలడు. ఇతరమైన జ్ఞాన మార్గముచేత (భ్రాంతి విస్తారమగునేగాని జన్మ రాహిత్య విధానము తెలియరాదు.

ఇచట ఒక విషయము గమనించవలసి యున్నది. అదే మనగా పండితుడని బిరుదాంకితునికి గురువు జెప్పిన వాక్యమునందుగాని, మం(త్రమునందుగాని, మం(త్రార్థమునందుగాని గురి లేకుండును, పండితుడు గురువు జెప్పిన మాటలను తాను శా(స్త్రాములలో తెలుసుకొన్న జ్ఞానముతో పరిశీలించును, తర్కించును. తాను పాండిత్యము ద్వారా పొందిన జ్ఞానానికి అవి సరితూగక పోయినచో వాటిని నమ్మక సంశయములో పడిపోవును. జన్మరాహిత్య మార్గమునకు దూరమగును. ఆశా(స్త్రములో అట్లున్నది, ఈశా(స్త్రములో ఇట్లున్నది. కావున గురుడు జెప్పిన దానిని నమ్మక వాద (ప్రతివాదములకు దిగును **"సంశయమే జన్మహేతువు"** అనె న్యాయమున జ్ఞాని (ప్రవర్తించును. అంతా నాకు తెలుసును. నాకు తెలియని దేమున్నది అని అనుకొనును. ఇంతటి సూక్ష్మమైన బోధలోని సత్యమును కనుగొనుటకు అతని జ్ఞానమునకు అతని అహం అడ్డువచ్చును. కనుక పండితునికి అహం ఇంకాపోలేదు. గనుక అతనికి పరిపూర్ణ పర(బహ్మము తెలియదు. కాని అజ్ఞానియైన వానికి శా(స్త్రములలో విషయములు తెలియవు. గురువు జెప్పినదే సత్యమని నమ్మును. గురువుపైన గురియుండును. కనుక అతడు జెప్పె మాటలపై కూడ గురియుండును. గురువు జెప్పినదే దైవ వాక్కుగా భావించి అందులోనే యుండును. బోధ దృఢమై ఆరూఢ జ్ఞానము కలిగి తొందరగా తరించును. **నమ్మితే సోమ్ము లేకుంటే దుమ్ము.** నారద సూ(త్రములలోని **74**వ సూ(త్రములో **"వాదోనావలమ్బ్య"** భగవద్భక్తులు వాదమునకు దిగరాదు. పండితుడు వాదమునకు దిగును, అజ్ఞాని వాదమునకు దిగడు. కావున పండితునికి తెలియదు, అజ్ఞానికి తెలియును. చివరగా వేమన పద్యమును పరిశీలింతము, **ఆ॥ నేరనన్నవాడు నెరజాణ మహిలోన। నేర్తు నన్నవాడు వార్త కాడు। యూరకున్న వాడే యుత్త మోత్తముండు। విశ్వదాభిరామ వినురవేమ॥** అచల పరిపూర్ణము వాక్కుకు, మనస్సుకు అందనిది అని నిర్ణయము జేసి, అది వున్నదని గాని నాకు తెలియబడనిదని చెప్పువాడు నెరజాణ

అనగా నేర్పరి. అచల పరిపూర్ణపరబ్రహ్మమును నేను చూచినాను అని చెప్పువాడు వార్తకాడు, అనగా వాగుడుకాయ. అట్లుగాక తానే (ఎరుక) శూన్యమని తెలుసుకొని ఆపైనున్న పరిపూర్ణపరబ్రహ్మమును ఉన్నదని గాని లేదని గాని ( తెలసినదని గాని, తెలియదని గాని) నిర్ణయముచేయక ఊరకున్నప్పుడే వుత్తమోత్తముడని వేమన వేదాంతము. పరిపూర్ణ పరబాహ్యమును చూచినావా? అని ప్రశ్నించిన వారికి వేమన సూచించినట్లు వూరకుండుటయే సరియైన సమాధానయని తెలియగలరు.

4. ప్రతిబోధవిదితం మత మమృతత్వం హి విన్దతే!
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతే ఽ మృతమ్!!

బోధ వలన (పరిపూర్ణ బోధ వలన) పొందిన జ్ఞానము నిశ్చయముగా అమృతత్వమునకు (విశాలార్థములో జన్మరాహిత్య మోక్షమునకు) చేర్చును. ఆత్మ జ్ఞానము వలన ఆర్జించిన విద్యా బలము (జ్ఞానమువల్ల) అమరత్వమునకు చేర్చును.

**1. ప్రతి బోధ విదితం మతం** = ప్రతి బోధ విధితం = బోధ వలన పొందిన (పరిపూర్ణ బోధ వలన పొందిన) మతం = విషయము, జ్ఞానము వల్ల;

**2. అమృతత్వము విన్దతే** =అమృతత్వము = జన్మరాహిత్య మోక్షమును; హి = నిశ్చయముగా; విన్దతే = పొందుతాడు.

**3. ఆత్మనా విన్దతే వీర్యం** =ఆత్మనా = ఆత్మజ్ఞానమువల్ల; వీర్యం = నిజమైన బలము; విన్దతే = లభిస్తుంది.

**4. విద్యయా విన్దతేఽమృతమ్** = విద్యయా = జ్ఞానము ద్వారా (పరమాత్మ జ్ఞానము ద్వారా) అమృతమ్ = అమరత్వము; విన్దతే = పొందుతాడు

**పరిపూర్ణ ప్రబోధామృతము :-**

ఈమంత్రము నందు పరిపూర్ణ బోధ వలన నిశ్చయముగా అమృతత్వమునకు అనగా జన్మరాహిత్య మోక్షము లభించుననెడి విశాలార్థమును గైకొని ఫలశ్రుతి చెప్పబడినదిగా గ్రహించ వలయును మరియు ఆత్మ జ్ఞానమువల్ల (పరమాత్మను గూర్చిన జ్ఞానమువల్ల) తన స్వరూప జ్ఞానమువల్ల అమరాత్వాన్ని పొందుతాడు అనగా స్వర్గలోకము ప్రాప్తించును. కాని జన్మరాహిత్యము కాదు.

*1. ప్రతి బోధ విదితం మతం అమృతత్వం హి విన్దతే :-*

కేనోపనిషత్తునందు మొదటి నుండి ఆత్మను గురించి మరియు పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి వివరించబడినది. అందువల్ల ఈమంత్రములో పరిపూర్ణ బోధవల్ల నిశ్చయముగా అమృతత్వము అనగా జన్మరాహిత్య మోక్షము పొందుతాడు.

మొదట పరిపూర్ణ బోధను గురించి చెప్పి దాని ఫలశ్రుతిని పరిశీలింతము,

పరిపూర్ణబోధను బహుక్లుప్తంగా చెప్పవలయునన్న పరిపూర్ణమును, లేనెరుకను యెరిగి, యెరుకను మానుమని సిద్ధాంతము చేయబడినది. ఈవాక్యములో తాత్విక నిర్ణయముతోపాటు కర్తవ్యము కూడా ఉపదేశించబడింది. పరిపూర్ణమును, లేనెరుకను గురుముఖంగా విచారించి తెలుసుకొనుట తాత్విక పరిశోధనకు సంబంధించినది. తదుపరి రెంటిని ఏయెరుకచే గ్రహించితివో ఆ ఎరుకను వదిలివేయుమని కర్తవ్యోపదేశము చేయబడింది.

**శ్లో॥ అశరీరం సర్వదా ఽ స్తి శరీరం రహితం సదా!**
**అయమేవ సద్యోముక్తి రన్యథా భ్రమకారణమ్!!**

శరీరము లేని పరిపూర్ణ పరబ్రహ్మమే ఎల్లప్పుడు ఉండి ఉన్నది. శరీరము ఎప్పుడును లేదు. ఈసిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించును. ఇతర సిద్ధాంతములు భ్రాంతి కారకములే అగుచున్నవి.

## పరిపూర్ణ బోధ నిశ్చయము

1. పరిపూర్ణ పరబయలు శాశ్వతమైనది.
2. లేనెరుక అశాశ్వతము లేనిది, లేనిది.
3. నేను లేననుట ఎరుక రహితము

కర్తృత్వరహిత కర్మాచరణవల్ల సంకల్పరూప మనస్సుండదు. అప్పుడు నీ యందు నీవు లేకుండ పోదువు. అప్పుడే వేయించిన విత్తనము మరల మొలకెత్తనట్లు భ్రాంతి రహితమగును. తిరిగి జన్మ లేకుండ పోవును. ఈ ప్రబోధ నిశ్చయమును శ్రీ భూమానంద హనుమంత దేశికేంద్రులు చాలా స్పష్టముగా చెప్పినారు. పరిశీలించండి. క.ద. 7 " పరిపూర్ణ మనిన అచలము। యెరుకనగా యెరుక మరుపు। యెరిగెటిదన్నా గుర్తుగ। రెంటిని ఎరిగియు యెరుగక యుంటేను చాలు। యెరుకుండదన్నా। మాట్లాడకు యేమిలేదన్నా। నిరతాము యీ రీతి నిష్ట జెందిన యపుడె। మరణ జననమూలానె మాయ భ్రాంతి దొలుగు యెరుకుండా దన్నా। మాట్లాడకు ఏమిలేదన్నా।

**"భ్రాంతి రహితమే మోక్షము"**
**భ్రాంతి యుడగిన బ్రహ్మంబు బట్టబయలు"**

కనుక నిశ్చయముగా జన్మరహితమగును. కావున ఈబోధవలన అనగా పరిపూర్ణ బోధ వలన **"అమృతత్వం హి విన్దతే"** అని ఈమంత్రమున ఫలశ్రుతి జెప్పబడినది. అనగా నిశ్చయముగా జన్మరాహిత్య మోక్షము లభించునని జెప్పబడినది. అమృతత్వము అనగానేమో విచారింతము. అమృత మనగా చావనిది, నాశనముగానిది, మోక్షము, పరబ్రహ్మము అనేవి శాశ్వతములు గనుక అమృత శబ్దముచే అవికూడా లక్షింపబడుచున్నది.

"అమృతం అంటే మృత్యువు లేకుండుట కాదు. మృత్యువు భయము లేకుండుట.... అభయమే అమృతం" - శ్రీ మదాంధ్రవచన అమృత ఉపనిషత్తులు పుట సంఖ్య 438, డా॥ దాశరథి రంగాచార్య. సనత్సు జాతీయంలో మోహమే మృత్యువని జ్ఞానులు చెప్పుచున్నారు. కాని ప్రమాదమే మృత్యువని తెల్పబడింది. **ప్రమాదమనగా తానెవ్వడో ఎరుగక పోవుటయే ఆ పమాదము.** అనగా తానెవ్వడో తెలియుట అమృతము. అంటే నేను ఆత్మనని తెలుసుకొని ఆత్మభావముతో ఉండుట అమృతత్వము ఇంతేనా? అంటే సరిపోదు.

**"జాతస్యహి ధృవో మృత్యుః ధృవం జన్మమృతస్యచ"**

అనగా పుట్టునది చచ్చుటయు, చచ్చునది పుట్టుయు తప్పదు. అన్నప్పుడు ఏది చచ్చినదో అది మరల పుట్టినది అన్నప్పుడు ఆ చచ్చి పుట్టేది ప్రాణమే అయితే, చస్తు పుడుతూ తిరిగి చస్తూ పుడుతుంది. కనుక దీనికి నాశనము తేలికగా సంభవించదు. కాని పరిపూర్ణ బోధవలన ఇది కూడా శాశ్వతము కాదని ఋజువగుచున్నది.

ప్రాణశక్తి దేహమందు ప్రవేశించుట జననము, దేహమును విడుచుట మరణము, లేక మృతము. ఈ ప్రవేశ నిర్గమములు లేకుండుట అమృతము అనగా చచ్చిపుట్టేదేదో అది పోక ఉండుట. పుట్టి చావకయున్న, చచ్చి పుట్టుకున్న అమృతమే. ఇట్టి అమృతత్వము ఆశించి **"మృత్యోర్మా అమృతంగమయా"** అనగా మృత్యువునుండి అమృతత్వమునకు పోదును గాక! యని ప్రార్థించుచున్నాడు. అట్లు ప్రార్థించుట నిద్రరాకుండ ఎల్లప్పటికి మేల్కొని యుండాలని కోరుకొన్నట్లే. అనగా ఒక్క ప్రాణికే మరణించుట, మరణించకుండ నుండుట అనే రెండు స్థితులు. అందు ఒక స్థితిని కోరుకుంటున్నాడన్నమాట. అమృత మృత్యువులు సాపేక్షిక పదములై యున్నవి. పరమాత్మయే అమృత మృత్యువులు రెండు రూపములుగా గలవాడై యున్నాడు.

శ్రుతి॥ "ఉభయం హై తదగ్రే ప్రజాపతి రాస! మర్త్యం చైవా మృతంచ!
తస్యప్రాణా ఏవామృతాంసుః! శరీరం మర్త్యం॥"

అనగా ప్రజాపతికి ప్రాణ శరీరములు రెండు అమృత మృత్యు స్వరూపములుగా నున్నవి. ఇందు ప్రాణము అమృతము, శరీరము మృత స్వరూపమని భావము. భగవద్గీతలో **"అమృతం చైవ మృత్యశ్చ సదసచ్చాహ మర్జున"** అనగా నేనే అమృత మృత్యువులను, సదసత్తులు అయి ఉన్నాడంటున్నాడు భగవానుడు. ఇదే భావమును శ్రీకృష్ణదేశి కేంద్రులవారు

**క.ద.53॥దేహమున జూచు కన్నులు! దేహమునకు వేరులేని తీరున! ఎరుకే కోహంకస్త్వం! తవదాసోహం సోహంబటంచు! చూచుచుండు సుమీ! తనకు తానే తోచుచుండు సుమీ! దేహిదేహము లానె తెరుగున ప్రసరించి! దేహముగాని**

విదేహిగ! తనను తాజూచుచుండుసుమీ॥"

అని శెలవిచ్చి యున్నారు. అనగా దేహమును జూచు కన్నులు దేహమునకు వేరుగా లేని విధమున, ఎరుక దేహమునకు వేరుగా లేదు గాని, ఒకప్పుడు నేనెవ్వడను, నీవెవ్వడవు, నీకు నేను సేవకుడను, మరొకప్పుడు నేనే బ్రహ్మను, అని తనంతట తానే ఊహించుకొను చుండును. తనకు తానే నానా విధములుగా తలంచు చుండును. ఇదియును గాక, ఈఎరుక దేహిదేహములుగా పరిణమించి నేను దేహమునుగాను విదేహినని తన్ను తాను జూచుచుండును. కనుక అమృత మృత్యువులే ప్రాణ శరీరములు లేక దేహిదేహములై ప్రసరించేది ఆపరమాత్మ స్వరూపమే, అదే **"ఆటాడి ఆడకుండును! ఆటాడిన మేనిబొమ్మ...... జనన మరణము లొందనతడేరా కర్త! అన్నిటికి యీ అచలమకర్తా"** ఈ ఆట శాశ్వతముగా ముగింపు అయిననాడే కేవల జన్మరాహిత్యము. ఆస్థితి మృతముగాదు అమృతముగాదు. ఈరెండు లేనిది. ఈరెండు కానిది. అమృత మత్యువులను ద్వంద్వ స్వరూపము చెందు వస్తువు యొక్క రహిత స్థితి పరిపూర్ణ బోధ వలననే చేకూరగలదు. కావున ఈబోధ వలన కలిగిన జ్ఞానమువల్ల నిశ్చయముగా జన్మరాహిత్య మోక్షము లభించునని ఈమంత్రముద్బోధించుచున్నది. ఇచట అమృతత్వమునకు మహోన్నతమైన విశాలమైన అర్థము గ్రహించవలసి యుండును. మానవుని జన్మ యొక్క లక్ష్యము అమృతత్వము అనగా ఎప్పటికి చావకుండుటగాదు. మరియు ఎంతకాలము బ్రతికియున్నా దీర్ఘకాలములు భోగములనుభవించినా ఎప్పటికైనా పుణ్యము క్షీణించగనే మళ్ళీ పుట్ట వలసిందే, కనుక జన్మరాహిత్య మోక్షమే మోక్షము. అదే మానవ జీవిత పరమ లక్ష్యము. ఆ లక్ష్యమును పొందవలయునన్న పరిపూర్ణ గురువుల నాశ్రయించి బోధ విని గురు సాక్షాత్ పరబ్రహ్మయని దృఢముగా నమ్మి, వారుపదేశించిన షోడశి మంత్రమును సదా జపించుచు, గురువు ఉపదేశించిన వాక్యములను ఆచరణలో పెట్టి, కర్తృత్వ రహిత కర్మాచరణ ఆచరించినచో అహం పదార్థ రహితం స్థితిజెంది జనన మరణమనే భ్రాంతి రహిత మగును.

ఆత్మనా విన్దతే వీర్యం! *విద్యయా విన్దతే ఽ మృతమ్ :-*

ఆత్మజ్ఞానం ఆర్జించిన విద్యాబలము (జ్ఞానబలము) వల్ల అమరత్వము అనగా జీవ బ్రహ్మైక్య మోక్షము లేక స్వర్గము లభించును. అవస్థాత్రయము నందలి సంగతులను శరీరము జ్ఞానములేని జడపదార్థమగుటవల్ల యెరుగజాలదు. కాబట్టి దేహము కంటెను వేరుగా ఒక జ్ఞాన స్వరూపమగు వస్తువు ఈశరీరము నందుండి సకల విషయముల నెరుగుచు చెప్పుచున్నది. అట్టి జ్ఞాన స్వరూప వస్తువే ఆత్మ అనబడును.

నేననే వృత్తి సహితంగా సర్వవృత్తులు అంతఃకరణము దాని సంకల్పరూప వృత్తి మనస్సునకే కలుగుచున్నది. ఆ వృత్తులకు సత్తా యిచ్చునది ప్రత్యగాత్మ ప్రకాశము. ప్రత్యగాత్మ తాను స్వయంగా గుర్తించకున్నను అంతఃకరణమునకు గుర్తించుశక్తి

నిచ్చుచున్నది. నేను "అహం వృత్తికి అత్యంత మూలకారణమగు ప్రత్యగాత్మనే నేను గాని దేహేంద్రియ మనః ప్రాణములను కాను. ప్రత్యగాత్మా **"శివోహం"** ఇదే ఆత్మభావము. దేహేంద్రియ విశిష్టమైనప్పుడు ప్రత్యగాత్మ నిరుపాధికమైనప్పుడు పరమాత్మ లేక అధిష్ఠాన బ్రహ్మము. కాని నేను (అహం) లేనప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధం.

**శ్లో॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్వ జ్ఞానార్థ దర్శనం!**
**ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం మదతో౽ న్యథా!**

**తా॥** నిత్యమగునది ఆత్మ ఒక్కటే అని యెరింగి ఆత్మతత్వము యొక్క సాక్షాత్కారము పొంది యుండుటయే జ్ఞానముగాని మిగతా అంతయు అజ్ఞానమే, మరియు **"సర్వ భూతస్థమాత్మానం సర్వ భూతాని చాత్మని"** అనగా తనయందు సర్వ భూతములను, సర్వ భూతములందు తనను చూడగల్గుటయే జ్ఞానము.

ఈ ఆత్మజ్ఞాన బలము వలన అమరత్వము చేకూరునని ఈమంత్రము ఉద్బోధించు చున్నది. అదే జీవబ్రహ్మైక్యమని యెంచి, తాము తెలిసిన బ్రహ్మమే సర్వము, అదే మోక్షము అని భ్రాంతి జెందుట గలదు. ఈజ్ఞానము వలన నీవు బ్రహ్మము ఒకటేనని తెలిసినది. అంటే నీ నిజరూపము ఆపరమాత్మ స్వరూపమనే జ్ఞానం కలిగింది. నీవు బ్రహ్మము అని తెలిసింది. ద్వైతము పోయి అద్వైతం సిద్ధించినది. తిరిగి **"క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి"** అనె న్యాయమున మళ్ళి జన్మవచ్చును. కనుక అమరత్వమనే మాట పొసగదు.

*5. ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీ న్మహతీ వినష్టిః!*
*భూతేషు భూతేషు విచిత్య ధీరాః! ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి!!*

ఇక్కడ ఈప్రపంచములో దానిని (పరిపూర్ణ పరబ్రహ్మమును) అపరోక్షమొనరించుకొన్నట్లయితే ఆపైన నిజమైన జీవితము ఉన్నది. ఇక్కడ అపరోక్ష మొనరించుకోనట్లయితే సర్వనాశనమే. ధీరులైనవారు సర్వప్రాణులందు ఆత్మను దర్శించినవారై ఈలోకము నుండి ముక్తిని పొంది అమరత్వాన్ని పొందుతారు.

ఇహ = ఇక్కడ (ఈప్రపంచములో) అవేదీచేత్ = తెలుసుకొన్నట్లయితే; అథ = అప్పుడు; సత్యమ్ = నిజమైన రూపము; అస్తి =ఉన్నది; ఇహ = ఇక్కడ; న అవేదత్ చేత్ = తెలుసుకొననిచో; మహతీ = గొప్ప; వినష్టిః = వినాశనము.

భూతేషు భూతేషు = సమస్త ప్రాణులందు; ధీరాః = ధీరులైనవారు; విచిత్య = చక్కగా గ్రహించి లేక సాక్షాత్కరించుకొని; అస్మాత్‌లోకాత్ = ఈలోకముల నుండి; ప్రేత్య = ముక్తులై; అమృతాః = అమరులు; భవన్తి = అగుచున్నారు.

**పరిపూర్ణ ప్రబోధామృతము :-**

ఇక్కడ అనగా ఈలోకమున తనువు చాలించక మునుపే పరిపూర్ణ పరబ్రహ్మమును అపరోక్షముగా పొందుకొనిన యెడల నిజమైన జీవితము గడుపగలడు. అప్పుడు అతడు అహం పదార్థ రహితస్థితిలో నుండును. అట్టి వాని జన్మ సార్థకమైనది. అప్పటి నుండి వాని నిజమైన జీవితము ప్రారంభమగును. అట్టి వాని స్థితిని గురించి శ్రీకృష్ణదేశికేంద్రుల వారు

**క.ద. 282 "ఎరుకను విడనాడినయా। పురుషుని స్థితి యెట్టిదనిన పొందుగ వినుమీ। సరిపడు సరిపడదనకను। సరిగా వర్తింపుచుండు సమరస బుద్ధిన్ కార్యములందు। సహజ ప్రవృద్ధిన్। పరిపారి విధమూల పరువూలూ బెట్టాడు। మరివైరాగ్యము చేత మానుకోనుండాడు।"**

అని కందార్థదర్పులో పరిపూర్ణమును అపరోక్షము జేసుకొన్నవాని స్థితిని చక్కగా వర్ణించి యున్నారు. అతడు సమరస బుద్ధితో కార్యములు జేయును. గనుక ఇది సరిపడుననియు, ఇది సరిపడదనియు చెప్పడు. చేయవలసిన సకల కార్యములు చేయు చుండును. స్వార్థము కొరకు ఏపనులు చేయడు వైరాగ్యము బూని చేయవలసిన పనులు మానడు. అట్టివాడు కృతార్థుడు. వాని జీవితము ధన్యము.

నామరూప క్రియా నటనలు ఏమీలేని ఈపరిపూర్ణ పరబ్రహ్మము తెలియుటకు అఖండ ఎరుక రూపుడై తా నిలిస్తే అపుడు తన్ను విడిచి చూస్తే పరిపూర్ణ పరబ్రహ్మ అపరోక్షమగును. అపుడు అతనికి అంతా కుంఠితము గాని వైకుంఠమే. కల్పనా రహితమైన కైలాసమే అని దీక్షితులవారు అన్నారు.

ఇట్లు పరిపూర్ణ పరబ్రహ్మమును అపరోక్షము గావించుకొన్నవాడు, సత్య స్వరూపమును తెలియును. నిజమైన జీవితము అప్పటి నుండియే ప్రారంభమగును. సత్యము ఒకటే. రెండు సత్యము లుండుటకు వీలు లేదు. ఆ సత్య వస్తువే పరిపూర్ణ పర బ్రహ్మము. షడూర్మ్ములలో శోక మోహములు మనోధర్మములుగా జెప్పబడినవి. అట్టి మనో రూపమగు వ్యష్టి అంతః కరణము, దాని కత్యంత మూలమగు పరా ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనేలేదని ఆరూఢ పరచుకొన్న రాజయోగి ఎల్లప్పుడు ఎట్టి పరిస్థితులందు తన అంతః కరణ స్థిమితమును కోల్పోడు. పారమార్థికముగా మానవుడు ఆశించదగిన జన్మరాహిత్యము సిద్ధించును. ఇదే ఈలోకమునందు సిద్ధించగల ఉత్తమ ఫలము. అతడే నిజమగు స్వార్థరహితమగు సమిష్టి శ్రేయోదాయకమైన కర్మ చేయు సమర్థుడు. ఏలననగా స్వ+అర్థము=స్వార్థము. తన యొక్క వస్తువు అనగా **"నేను"** అను వస్తువునందు సంపూర్ణముగా సమస్తాభిమానములను వదలినవాడు. ఈ నేనను వస్తువు వ్యష్టి యందు ప్రత్యగాత్మగాను - జీవుడు, సమిష్టియందు పరమాత్మగాను యున్నది. కనుక **ప్రత్యగ్బ్రహ్మైక్య రూపమగు అఖండ ఎరుక అనె వస్తువే స్వార్థము.** పరిపూర్ణము

నందు ఈ **"స్వార్థ"** సార్థక నామధేయమగు అఖండ ఎరుక లేదనే భావం దృఢం అయితేనే గాని వ్యష్టి రూపమగు స్వార్థము పూర్తిగా పోనేపోదు. ఆ ఆత్మ యందలి ప్రేమయే సర్వ వస్తువులందు తనకు ప్రేమాభిమానములు కల్పించుచున్నది. ఈభావమును **"ఆత్మవస్తు కామాయా సర్వం ప్రియంభవతి"** అని బృహదారణ్యక శ్రుతి చెప్పుచున్నది. కనుక విశ్వమానవ కళ్యాణము కొరకు స్వార్థ రహిత కర్మ జరుగవలెనంటే పరిపూర్ణ బోధ యందారూఢత సాధించిన రాజయోగి వలననే కాగలదు. అంతేగాక మానవజన్మ సాఫల్యమగు జనన మరణ రహిత రూపమగు పరమ పురుషార్థము కంటే మంగళ కరమైన మరొకటి సిద్ధించవలసినది లేదు. కావున సద్గురువుల నాశ్రయించి పరిపూర్ణ బోధ పడయుటకు యత్నించవలయును.

**న చేది మహావేదీన్మహతీ వినష్టి :-**

ఈలోకమున మానవ జన్మలోనే పరిపూర్ణపరబ్రహ్మమును అపరోక్షము గావించుకొననిచో మహానష్టము సంభవించునని ఈమంత్రము ఉద్ఘాటించుచున్నది

నష్టము గూర్చి చెప్పాలంటే పెట్టుబడి పెట్టినంత గూడా రాబడిలేక పోతే నష్టము సంభవించును. మానవ జన్మకు వచ్చుట యే జీవితమునకు గొప్ప పెట్టుబడి. ఎందుకనగా **(84)** ఎనుబది నాలుగు లక్షల జీవరాసులలో చేసిన పుణ్యము వలన మానవ జన్మ లభిస్తుందంటారు. ఇట్టి మానవ జన్మ రావడమే తాను చేసిన పుణ్య ఫలమే పెట్టుబడి. ఈజన్మకు రావడము చాలా దుర్లభము. మానవ జన్మకు వచ్చి పరిపూర్ణ బోధలభించడం మరీదుర్లభము. అదియునుగాక జన్మరాహిత్య మోక్షము మానవ జన్మ యందే సాధ్యము. ఇతర జీవుల జన్మలందుగాని, తీరా దేవతా జన్మలందుగాని జన్మరహితముగాదు. కనుక మానవుడై పుట్టినందులకు జన్మరాహిత్మ మోక్షము సిద్ధించుటయే లాభము. అట్లుగాకున్న జన్మరహితముగాక పుట్టిచచ్చి, పుట్టి మళ్ళి పుట్టి సంసారమనే మహాసాగరమును దాటలేక సుఖ దుఃఖములనుభవించ వలసినదే. ఇదే మానవజన్మకు వచ్చి జన్మరాహిత్యము గావించు కొనక, జన్మ జరాదుఃఖములనుభవించుటయే మహానష్టము.

కావున ఎవడు ఈలోకములో ఆత్మను దర్శించి ఆపై ఎవడు పరిపూర్ణ బ్రహ్మమును అపరోక్షము చేసుకొంటాడో వానిదే నిజమైన జీవితము. అట్టి వారే ధీరులు. ఆ సత్యాన్ని ఈజన్మలోనే ఇక్కడనే ఇప్పుడే అపరోక్షము గావించు కొనుము. సత్యము స్వతసిద్ధము. తన శక్తుల నన్నిటి వడ్డి దానిని అపరోక్షము గావించుకోమంటుంది ఈమంత్రము. అప్పుడే వ్యక్తి జీవన యాత్ర నిజంగా మొదలవుతుంది. ఈశరీరము రాలిపోకముందే నిజమైన జీవితాన్ని చవిచూడమంటుంది ఈఉపనిషద్మంత్రము. ఈపిలుపును నిర్లక్ష్యముచేసి ఈ అవకాశమును ఈజన్మలో జారవిడిస్తే దుర్లభమైన మానవజన్మకు వచ్చి, జన్మకడతేర్చుకోనుటకు లభించిన సదవకాశమును జారవిడిస్తే అంతా నష్టమే. ఇహలోక సుఖములుగాని పరలోక సుఖములుగాని క్షణికములు. మానవ జన్మకూడ

క్షణ భంగురమే. కనుక క్షణికములైన ఇహపరలోక సుఖములను ఈ అపార నష్టమును పూడ్చలేవు.

జన్మ కారణమగు వస్తువును వస్తుతః గుర్తెరిగి దానిని రహిత మొనర్చి జన్మ రాహిత్యమును పొందు విధానమే పరిపూర్ణ బోధయందు గలదు. తత్ఫలితమాశించువారు ఎప్పటికైనా ఈమార్గమును అవలంభించ వలసినదే, ఇదొక మతము కాదు. ఇది ఒక సిద్ధాంతము. ఈసిద్ధాంతము వేదము లెంత సనాతనమో అంతే సనాతనమైనది. వేద సమ్మతమైనది. సర్వ సిద్ధాంతముల సమన్వయము జేసుకొన్న అతీత సిద్ధాంతమని తెలియవలెను. హేతువాద యుక్తమై సర్వ భ్రాంతి రహితమే ఆశయముగా గలవారికి శిరోధార్యమై యున్నది. ఎవరు సత్యాన్వేషణ తత్పరులై విమర్శించినచో ఈసిద్ధాంతములోని సత్య వస్తువు గోచరమై ఈసిద్ధాంతము యొక్క లావు, ఔనత్యము తెలియును.

ఇది కథ గాదు వేద వేదాంత సిద్ధాంత విచారణ, జనన మరణ వ్యథ మాన్పుటకే **"ఆగమనిగమో పనిషత్సాగరమధితార్థ"** మని గ్రహించగలరని ప్రార్థించుచున్నాను.

భూతేషు భూతేషు విచిత్యా ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి :-

సమస్త ప్రాణులందు జీవులందు ఆత్మను ఎవరు (బ్రహ్మమును) దర్శించి ఇహమును త్యజించిన వారు **"అమృతాభవన్తి"** అమృతులగు చున్నారని అర్థము. అమృతులగు చున్నారంటే చావులేక ఉందురు. గురువాక్యోపనిషత్తులోని ఈదిగువ శ్లోకమును పరిశీలింతము.

**శో॥ 2॥ సూక్ష్మాత్సూక్ష్మ పరం నిత్యం। తత్త్వమేవ త్వమేవ తత్। జాగ్రత్స్వప్న సుషుప్త్యాది। ప్రపంచం యత్ప్రకాశతే। తద్బ్రహ్మమితి జ్ఞాత్వా। సర్వబంధైః ప్రముచ్యతే॥**

తా॥ ఆబ్రహ్మము సూక్ష్మమైన దానికంటే మిక్కిలి సూక్ష్మమై పరమై, నిత్యమై యున్నది. ఆపరబ్రహ్మమే సమిష్టి రూపములో నీవై వ్యష్టి రూపములో ఆబ్రహ్మమే నీవైయున్నావు. అది జాగ్రదవస్థ మొదలగు అవస్థలచే ప్రపంచమునందు ప్రకాశించుచున్నది. అట్టి బ్రహ్మమే నేనని తెలిసికొనినచో సర్వబంధముల నుండి విముక్తుడవగుదువు. **"జీవో బ్రహ్మైవనా పరః"** జీవుడు బ్రహ్మమే ఇతరము కాదని అద్వైత వాదము వర్ధిల్లినది. **"ఆ బ్రహ్మస్తంభపర్యంతం పరమాత్మ స్వరూపకం"** అనగా కానవచ్చేది తోచి వచ్చేది సమస్తము పరమాత్మ స్వరూపమేనని **"బ్రహ్మణోన్యం నకించన"** బ్రహ్మము కంటే అన్యమైనది కొంచమైన లేదని శ్రుతులు ఘోషించు చున్నవి. అపుడింక తాను బ్రహ్మను అగుట అంటే ఏమిటి? ఇది వరకు బ్రహ్మమై యుండక పోతే ఇప్పుడు క్రొత్తగా బ్రహ్మము కావలసి యుండును. ఇదివరకే బ్రహ్మమైయుండి అది విస్మరించి నేను బ్రహ్మముగా మారిపోవాలని కోరుకొనుట అజ్ఞాన కార్యమే. నీవు అనుకొన్న అనుకోకపోయిన నీవు బ్రహ్మమువే. ఉపనిషత్తుల సందేశములో "ప్రతి దేశములో ప్రతి

సమాజంలో మనిషి ఒక ఆదర్శప్రాయమైన పరిపూర్ణత్వం కొరకు వెదుకుతాడు. ఆ 
ఆదర్శం మీలో ఉన్నది కనుకనే మీ గుండె కొట్టుకుంటున్నది. మీరు దానిని గుర్తించుట లేదు. అది ఎక్కడ నుండో వినపడుతుందను కొంటున్నా మీలోనున్న భగవంతుడే తనను అన్వేషించి సాక్షాత్కరించుకోమని ప్రేరేపించు చున్నాడు. దేవాలయాలలో భూమ్యాకాశములో ఎక్కడెక్కడో వెదకి వెదకి ప్రదక్షిణ ముగిసిన పిదప ప్రారంభ స్థానానికి అంటే ఆత్మ కడకే వస్తారు. ఎవనికై మీరు ప్రపంచమంతా వెదకినారో, ఎవనికై దేవాలయలలో వెదకినారో, విలపించి ప్రార్థించినారో వాడు అతి సమీపస్థుడు. మీ ప్రాణాలకు ప్రాణం, మీ ఆత్మ అనే సత్యం గోచరిస్తుంది. అదే మీ నిజతత్త్వం, దాన్ని వ్యక్తపరచండి. అదిజ్ఞేయం దాన్ని తెలుసుకోటానికి మనము వ్యర్థ ప్రయత్నం చేస్తాం. మీరు పరిశుద్ధులు కానక్కరలేదు. మీ రిప్పటికే పరిశుద్ధులు, పరిపూర్ణులు. ప్రకృతి తెరవలె అడ్డుపడి ఆ వాస్తవాన్ని మరుగు పరుచున్నది....... అది నిత్యజ్ఞాత, అదిజ్ఞేయం అయివుంటే తన ఈతత్వాన్ని కోల్పోతుంది. అది నిత్యద్రష్ట నిత్యసాక్షి, జ్ఞానం విషయీకరణ చేస్తుంది గనుక అది ఉపాధి. జ్ఞానం ఒక క్రిందిస్థాయి ఒక అవనతదశ. నిత్యజ్ఞానులైన మనం దానిని మరల ఎరుగుట ఎందుకు? అది ప్రతి వ్యక్తిలోని నిజతత్వం. దానిని ప్రత్యక్ష పరచటానికి మనిషి ఎన్నో విదాల ప్రయత్నిస్తున్నాడు". చూడుము ఉపనిషత్తుల సందేశము పుట సంఖ్యలు 208, 209. సృష్టి కలిగిన విధానము పరిశీలించినట్లయితే సృష్టిని కల్గించి, అన్ని జడమగుటవల్ల వాటి యందు బ్రహ్మము అనుప్రవేశము గావించెను. అంటే అన్నిటి యందు తాను ఉండుటవలన వాటికన్నిటికి చలనము కలిగినది. అన్నిటియందు బ్రహ్మసూక్ష్మాతి సూక్ష్మముగా నున్నాడని చెప్పి తీరవలసిందే. అయితే అన్నిటిలో ఉన్నది ఆత్మనే, వాటి ఆకారముల వల్ల వాటికి నామము లేర్పడినవి. రూప నామములను తీసివేస్తే అన్నిటిలో ఉన్నది ఆత్మనే, కనుక ప్రతి వస్తువు యొక్క రూపనామములను వదలి పెట్టిన వాటిలో మనకు గోచరించునది ఆత్మనే, ఈవిధంగా చూచుటకు నేర్పు, జ్ఞానము అవసరము. ఇట్టి నేర్పు జ్ఞానము సద్గురువులవల్ల పొందవలెను. ఆవిధంగా చూచుటవల్ల వ్యష్టిదృక్పథము నశించును. సమిష్టి భావముతో చూచినపుడు అన్నిటిలో ఆత్మనే గోచరించును. ఇదే అద్వైత స్థితి, సిద్ధి, బ్రాహ్మీస్థితి. ఆత్మజిజ్ఞాసియైనవాడు మనస్సును నిర్విషయముగా జేసినపుడు ఆత్మనే గోచరించును. అంటే మనస్సు ఆత్మ యొక్క ఆకారమును పొందును. అప్పుడే ఆత్మ సాక్షాత్కారము.

ఇంకా చెప్పాలంటే సృష్టిలోని ప్రతి వస్తువునందు బ్రహ్మము పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ రూపములో యున్నది. ఆవస్తువులు స్థూల రూపములో ఉండుటవల్ల వాటికి ఆయాపేర్లు పెట్టారు. అందుండు సూక్ష్మము ఆత్మయే. ఆ రూపమును దర్శించవలయునంటే నీబుద్ధిని నిరింద్రియముగాజేసి అనగా సూక్ష్మంగా జేసినప్పుడు సూక్ష్మముగానున్న ఆత్మ గోచరమగును. అప్పుడు అతడు ఇంద్రియ బద్ధమైన జీవితమును దాటును. ఇదే అద్వైతసిద్ధి. అప్పుడే జీవ బ్రహ్మైక్యము సిద్ధించును. ఇదే అమరత్వమునకు

దారి తీయును అని ఈమంత్రము నొక్కి చెప్పు చున్నది. ఈ విధముగా ఆత్మను దర్శించి, ఆత్మకు ఆవలిదైన పరిపూర్ణ బ్రహ్మమును అవలోకనము చేయుమంటుంది. జన్మరాహిత్యము గావించు కోమంటుంది. **ఆ॥ పుట్టు వారలెవరు? పుట్టినవారెవరు? పుట్టిగిట్టనట్టి పురుషులెవరు? పుట్టి పుట్టనట్లు బోధించి చూడరా! విశ్వదాభిరామ వినుర వేమ॥**



తా॥ ఆగామి, సంచిత, ప్రారబ్దములను కర్మత్రయము నాశనము కానంత వరకు జీవులు మళ్ళి మళ్ళి పుట్టుచుందురు. కర్మత్రయము నాశన మొనర్చు కొన్నవారికి పుట్టుక ఇక యుండ జాలదు. ఇప్పుడు పుట్టి యుండి పుట్టుక లేకుండ చేసుకొనుటకు పూర్ణ గురువుల నాశ్రయించవలయును. కర్తృత్వరహిత కర్మాచరణముగా సకల కర్మలు నిష్కామముగా చేసుకోనేవారికి ఆగామికర్మఫలముండదు. సర్వ కర్తయగు అఖండ యెరుక నెరిగి అది పరిపూర్ణ మందు పుట్టనేలేదని ఎరిగిన వారికి సంచిత రాశి యంతయు అఖండ జ్ఞానాగ్నిచే దగ్గ మగును. ఇక ప్రారబ్దము అనుభవముచే నశించగా కర్మత్రయము నాశనమై వేయించిన విత్తనము నందలి అంకురము నాశనమగునట్లుగా జన్మరాహిత్యము సిద్ధించును. అట్టి పరిపూర్ణ బోధయందు ప్రవేశించుమని వేమన ఉద్బోధించుచున్నాడు. ఈ లక్ష్యసాధనకై నడుము బిగించుమని చదువరులకు ఈ ఉపనిషత్తు ప్రబోధించుచున్నది.

**రెండవ భాగము సమాప్తము**

# కేనోపనిషత్తు

## మూడవ భాగము

1. బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే, తస్య హ
బ్రహ్మణోవిజయే దేవా అమహీయన్త।
త ఐక్షన్తా స్మాకమేవాయం విజయోఽ
స్మాకమేవాయం మహిమేతి॥

దేవేభ్యః = దేవతల కొరకు; బ్రహ్మ = బ్రహ్మము; విజిగ్యే = విజయమును సాధించెను; తస్య బ్రహ్మణః = ఆబ్రహ్మదేవుని యొక్క; విజయే = విజయమున; దేవాః = దేవతలు; అమహీయన్త = ఉప్పొంగిపోయారు, తే = వారు; ఐక్షన్త = భావించిరి; అస్మాకంఏవ = మనదే; అయం = ఇది; విజయం = విజయము; అస్మాకంఏవ = మనదే; మహిమ = ప్రభావము; ఇతి = అని

బ్రహ్మదేవుడు దేవతల పక్షాన యుద్ధంచేసి విజయం సాధించాడు. విజయం బ్రహ్మవల్ల కలిగిన, దేవతలు ఉప్పొంగిపోయారు. సంబరపడి మా మూలంగానే గెలుపు వచ్చింది. మాదేవిజయం, మాదేగొప్పతనం అని అనుకొన్నారు, ఉబ్బిపోయారు.

ఆత్మను గురించి సమగ్రంగా వస్తు నిశ్చయముగా జెప్పడానికి ఋషి పుంగవుడు కేనోపనిషత్తునందు మూడవ నాల్గవ అధ్యాయములలో ఒక చక్కటి కథను చెప్పియున్నారు. మూడవ భాగమున దేవాసురుల యుద్ధం, దాయాదుల మధ్య యుద్ధం. దేవతలు సత్వగుణ ప్రతీకలైతే, అజ్ఞానానికి రాక్షసులు ప్రతీకలు, ఉభయులు బద్ధశత్రువులు. వీరి మధ్య యుద్ధం అంటే మంచి చెడుకు నడుమ, జ్ఞానా జ్ఞానముల మధ్య మరియు చీకటి వెలుగుల నడుమ జరిగే పోరాటముగా వర్ణించబడింది. అయితే విజయము మాత్రము చెడుపైన మంచి, అజ్ఞానము పై జ్ఞానము యొక్క మరియు చీకటిపై వెలుగుకు విజయముగా మనము స్వీకరించవలసి యున్నది.

దేవతలు సత్వగుణ ప్రధానులైనను వారిలో ఉండే రజో తమోగుణముల విజృంభణ జరిగి ఒక్కొక్కప్పుడు అజ్ఞాన మొహ బంధాలలో చిక్కుకొని పోవుట కలదు. కాని ఈభ్రమ రాక్షసులను పీడించినంతగా దేవతలను పీడించదు. కొద్దిపాటి జ్ఞానాన్ని అందించేవారుంటే వారు తమ తప్పిదమును వెంటనే గ్రహిస్తారు. ఈకథలోని గెలుపును దేవతలలో ముఖ్యులైన వాయువు, అగ్ని, ఇంద్రులకు జ్ఞానాంధకారము ఆవరించుటవల్ల తమదే గెలుపుఅని, మేమేగెలిచాం అనె గర్వం అత్యధికంగా ఉండినది. ఈమహిమ ఈశ్వరునికి చెందును అని తెలియక మేమే విజయము సాధించినాము, ఆ విజయ ఫలాన్ని మేమే అనుభవిస్తాం అనే ధీమాలో నుండినారు.

**పరిపూర్ణ ప్రబోధామృతం :-**

సమస్త బల, మహిమ, ప్రాభవాలకు మూలమైన ఏక వస్తువును తెలుసుకొంటే మానవ జీవితం ధన్యమౌతుందని, అదే మోక్షమని అనుకొంటారు. అట్లుగాక అట్టి వస్తువును తెలుసుకొని, అదే తానై తన కన్యమైన **"ఆత్మాతీతం కేవలాత్మ"** అనే పరిపూర్ణ పరబ్రహ్మమును అపరోక్షము చేసుకొని జన్మరాహిత్యమును పొందడమే మానవ జీవిత లక్ష్యంగా గుర్తించవలయును.

2. తద్దై షాం విజజ్ఞౌ, తేభ్యోహ ప్రాదుర్భభూవ
తన్న వ్యజానత కిమిదం యక్షమితి.

ఏషామ్ = వీరికి; తత్ = ఈగర్వము; విజజ్ఞౌ = తెలుసుకొనెను; తేభ్యః = వారియందు; ప్రాదుర్భభూవ = అగుపించెను; తత్ = అది; న వ్యజానత = గ్రహించలేకపోయిరి; కిం = ఏమిటి; ఇదం = ఇది; యక్షం = అద్భుతశక్తి; ఇతి = అని.

దేవతల భావమును బ్రహ్మ గ్రహించినాడు. వారి ముందు యక్షుని రూపమున అవతరించినాడు. దేవతలు ఆయక్షుని గుర్తించలేకపోయిరి.

బ్రహ్మ యొక్క దివ్యమైన మహిమను తెలుపుట కొరకే ఈకథ చెప్పబడినదని మహిమాన్వితమైన బ్రహ్మము యొక్క శక్తి వల్లనే అగ్ని, వాయువు మరియు ఇతర దేవతలు

ప్రకాశమానమై యున్నవని తెలియజేయుట కొరకే ఈ కథ జెప్పబడినది.

బ్రహ్మము సర్వభూతాంతరాత్ముడు. గనుక వీరి మనస్సులో కలిగిన భావములను దర్శించినాడు. దానవుల బుద్ధివలననే దేవతల బుద్ధి కూడ మారిపోతున్నదని బ్రహ్మ గ్రహించినాడు. వారిని సరియైన మార్గమున నడిపించదలిచాడు. అతడు యక్షుని రూపములో వారిముందు ప్రత్యక్షమైనాడు. ఆరూపమున జూచిన దేవతలు ఆ ఆకృతి ఏమిటో వారు గ్రహించలేకపోయిరి.

ఆధ్యాత్మిక రంగంలో అహంకారమనునది మహామ్మారి వ్యాధి, మనస్సులో కదిలే ప్రతి సంకల్పమునకు, ప్రతి కర్మకు బ్రహ్మమే ఆధారము అధిష్ఠానము అనెడి జ్ఞానము సాధకునికి ఉండాలి.

**పరిపూర్ణ ప్రబోధామృతము :-**

బ్రహ్మము ప్రతి కర్మకు ఆధారము అధిష్ఠానము అయినందున ఈకథలో జెప్పిన బ్రహ్మము అధిష్ఠాన చేతన బ్రహ్మమేగాని, నిర్ద్వంద్వ, నిరపేక్షిక, సర్వలక్షణ విలక్షణమైన మరియు దేనికి ఆధారముగాని పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. పరిపూర్ణ పరబ్రహ్మము "నిశ్శక్తి నిర్మలం పూర్ణం" అని కొనియాడబడినది.

*3. తేఽగ్ని మబ్రువన్, జాతవేద; ఏతద్*
*విజానీహి కిమేతద్ యక్షమితి; తథేతి॥*

తే = వారు; అగ్నిం = అగ్నితో; అబ్రువన్ = పలికిరి; జాతవేదః = ఓజాతవేదుడా; ఏతత్ = ఇది; విజానీహి = బాగుగా తెలుసుకొనుము; కిం = ఏమి; ఏతత్ = ఇది; యక్షం = అద్భుతశక్తి; ఇతి = ఈవిధముగా; తథా = ఆలాగునే; ఇతి = అని. (అగ్ని అన్నాడు)

వారు అగ్ని దేవునితో అన్నారు. ఓజాతవేదుడా! సర్వము తెలిసిన వాడవు, ఆ యక్షుడు ఎవరై యుండునో తెలుసుకొనుమని అనగా అలాగే అన్నాడు అగ్ని దేవుడు.

యక్ష స్వరూపమును దేవతలు గాంచినారు. కలవరపడినారు. వారి ఎదుట నిలబడిన యక్షుడెవరో తెలుసుకొనవలెననెడి కాంక్ష ప్రబలింది. ఆముగ్గురిలో ఒకరు వెళ్ళి ప్రశ్నించాలని నిశ్చయించు కొన్నారు. అగ్ని దేవుణ్ణి ఈకార్యమునకు నియోగించినారు. **"జాతం శుభం అశుభం వేత్తి జాత వేదః"** శుభా శుభములను గ్రహించువాడు జాతవేదుడు అని భావము. కనుక అగ్నిదేవుడు సర్వజ్ఞుడు ఇట్టి జాతవేదుడు సరేనని ముందుకు నడిచాడు. తనలోగల దాహకశక్తి ఎక్కడి నుండి వచ్చిందో తెలియని అగ్నిదేవుడు అద్భుతమైన యక్షుని రూపము తెలిసి కొనుటకు ముందుకు సాగాడు.

*4. తదభ్య ద్రవత్ తమభ్యవదత్ కోఽసీతి, అగ్నిర్వా*
*అహమస్మీత్య బ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి॥*

తత్ = అది; అభ్యద్రవత్ = పరిగిడెను; తం = అతనిని; అభ్యవదత్ = అడిగెను; కఃఅసి = ఎవరునీవు; ఇతి= అని; అగ్నిః = అగ్నిదేవుడు; అహం = నేను; అస్మి = అయిఉన్నాను; అబ్రవీత్= మారుపలికెను; జాతవేద = సర్వజ్ఞుడు; వా = లేక; అహం=నేను; అస్మి = ఉన్నాను; ఇతి = అని.

అగ్నిదేవుడు పరిగెత్తి యక్షుని సమీపించెను. నీ వెవరవు? అని యక్షుడు అగ్నిదేవుని ప్రశ్నించెను. నేను అగ్నిని, నేను జాతవేదుడను అని అగ్ని దేవుడు బదులు చెప్పాడు.

అగ్ని యక్షుడెవరో తెలుసుకొనుటకు పరిగెత్తెనని ఋషి తెల్పు చున్నాడు. పరుగెత్తుట అనునది అతని తొందరపాటును తెలుపు చున్నది. తనకు తెలియనిదనెడిది ఉండదు అను అహంకారము గలవాడై వెళ్ళినాడు, అంత యక్షుడు అగ్నిని **"నీ వెవరవు"** అని ప్రశ్నించినాడు. నేను అగ్నినని చెప్పి ఆగక నన్ను జాతవేదుడని (సర్వము తెలిసిన వాడని) కూడ పిలుస్తారని అగ్ని ప్రత్యుత్తర మిచ్చినాడు.

అగ్నిదేవుని ప్రత్యుత్తరములో వచ్చి అహం భావము స్పష్టముగా వ్యక్తమౌతున్నది. అతడు తన ఆత్మస్తుతికి పాల్పడి నేను అగ్నిననిచెప్పి ఆగక నేను జాతవేదుడనని పరిచయము చేసుకొన్నాడు.

**పరిపూర్ణ ప్రబోధామృతము :-**

పరిపూర్ణబోధలో అహంకారమును, అభిమానమును వదులవలసి యున్నది. అహంకారమే **"ఎరుక"** "ఎరుకొక్కటుండె నేనియు ఎరుకే ఈవిశ్వరూప మేర్పడదాల్పున్" అన్నట్లు ఎరుక (నేననే భ్రాంతి) రహితమే మోక్షము **"భ్రాంతి యుడగిన బ్రహ్మంబు బట్టబయలు"** అని గ్రహించవలెను.

5. తస్మిం స్త్వయి కింవీర్య మిత్యపీదం సర్వం
దహేయం యదిదం పృథివ్యామితి॥

తస్మిన్త్వయి = ఆలాంటి నీలో; కిం వీర్యం = ఏ శక్తి ఉన్నది; ఇతి = అని; అపి = కూడ; ఇద = ఇదం; సర్వం = సమస్తమును; దహేయం = దహింపగలను; యత్ ఇదం = ఇది ఏదైనను; పృథివ్యా = భూమిమీద; ఇతి = అని.

జాతవేదుడవని చెప్పుకొనిన నీవు, నీలో ఏ శక్తి ఉన్నది అని యక్షుడు ప్రశ్నించెను. భూమిమీద ఉన్న సమస్తమును నేను తగుల బెట్టగలను అని అగ్నిదేవుడు యక్షునికి సమాధానమొసగెను.

6. తస్మై తృణం నిదధావేతద్ దహేతి
తదపప్రేయాయ సర్వజవేన తన్న
శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే నైత
దశకం విజ్ఞాతుం యదేతద్ యక్షమితి॥

స్వార్థము పాటించక సమిష్టి శ్రేయస్సు కొరకు చేయు కర్మఫలమే పుణ్యము. ఎరుకను విడిచిన స్వచ్ఛందులు వేదవేదాంత పద్ధతిగా కర్తృత్వరహిత కర్మాచరణ గావించెదరు. కనుక వారికి ఎరుక ననుసరించియుండు పాపములు పుణ్యములు అంటవు.

ఈమంత్రమున జెప్పిన ఫలశ్రుతిలో ఈఉపనిషత్తును తెలుసుకొన్నవాడు పాపములను పొగొట్టుకొని స్వర్గలోకమున బ్రహ్మమునందు ప్రతితిష్ఠితుడౌతాడని చెప్పబడింది. ఇట్లు జెప్పుట జీవ బ్రహ్మైక్యసిద్ధి. దీనివల్ల తన స్వరూపమే తెలిసి వచ్చింది. అందు ఇంకా నేను అనె ఎరుక మిగిలియున్నది. కనుక గురుముఖంగా ఈఉపనిషత్తును తెలుసుకొని బోధయందు దృఢత జెందిన వానికి ఆత్మ సాక్షాత్కారము పొంది ఆపైన తన కన్యంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుసుకొని తన్నుతాను వదిలిన వాడగును. అట్టి వానికి జన్మరాహిత్య మోక్షఫలము సిద్ధించును. ఇది ఈమహోన్నతమైన భావముతో చదువ వలయునని, అట్టి మహాత్ములకు తప్పక జన్మరహితమగునని ఆశిస్తున్నాను.

**శాంతిపాఠం**

ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రి యాణిచ సర్వాణి। సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మనిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్త్వ నిరాకరణం మేఽస్తు! తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తేమయిసన్తు తేమయి సన్తు"

ఓం శాంతిః శాంతిః శాంతిః

మహబూబ్‌నగరము జిల్లా, నవాబుపేట మండలం ఇప్పటూరు గ్రామ వాస్తవ్యులు కురువిణశెట్టి (జేంద్ర) వంశజులు (సిద్ధాంతముని) మెణుసు గోత్రికుడు మంత ఎల్లప్ప మంత చిన్నమ్మ పుణ్యదంపతుల ద్వితీయ పుత్రుడు శ్రీ మదచల ఋషి ప్రభోధానంద వెంకటార్య దేశిక ప్రభువుల ప్రియశిష్యుడైన మంత చిన్నయ్య చే 35 శ్లోకములకు అనువాదము, మరియు వివరములు కూర్పు చేయించబడిన కేనోపనిషత్తు సర్వం సమాప్తము.

**నాల్గవ అధ్యాయము సర్వం సమాప్తము**

సర్వం శ్రీగురు చరణారవిందార్పణ మస్తు.

శ్లో॥ బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తాత్ మహత్తత్వః మహత్తత్వాత్ మహదహంకారః మహదహంకారాత్ పంచతన్మాత్రాణి
పంచతన్మాత్రేభ్యో పంచభూతాని పంచమహాభూతేభ్యో అఖిలం జగత్॥

# బ్రహ్మాండ

| | | | |
|---|---|---|---|
| **బ్రహ్మము**<br>యొక్క<br>(కేవలజ్ఞానస్వరూపముగా<br>నున్నప్పుడు బ్రహ్మ<br>అహంవృత్తి లేనప్పుడు<br>పురుషోత్తముడు) | పరిణామము<br>**అవ్యక్తము**<br>యొక్క<br>(జ్ఞానాజ్ఞానములను<br>రెండు గుణములు<br>కలిగి నప్పుడు) | పరిణామము<br>**మహత్తు**<br>యొక్క<br>(త్రిగుణాత్మక శక్తి<br>విజృంభణలో సృష్టి<br>అంతయు జరుగును) | పరిణామము<br>**మహదాహంకారము**<br>యొక్క<br>(సమస్త సృష్టికి తానే<br>కర్తనని<br>అభిమానించినపుడు) |
| **నిజాంశము** | **నిజాంశము** | **నిజాంశము** | **నిజాంశము** |
| **ఆత్మ** ఆకాశము<br>వాయువు<br>అగ్ని<br>జలము<br>పృథ్వి | సదాశివుడు - ఆకర్షణ<br>ఈశ్వరుడు - తిరోధానము<br>రుద్రుడు - లయ<br>విష్ణువు - స్థితి<br>బ్రహ్మ - సృష్టికర్త<br>పంచాదిదేవతలు | హం వశీకరణము<br>యం ఉచ్చాటన<br>రం మారణ<br>వం మోహన<br>లం స్థంబన<br>పంచబీజములు | పరాశక్తి<br>ఆదిశక్తి<br>జ్ఞానశక్తి<br>ఇచ్ఛాశక్తి<br>క్రియాశక్తి<br>పంచశక్తుల |
| **దేవతలు** | **తత్వ విచారకులు** | **యోగాభ్యాసకులు** | **మతముల వారలు** |

**ఆత్మ** - సకల ప్రాణులయందు సమస్త వస్తువులందు నాస్తి, భిన్నంతరము లేకుండ వ్యాపించియున్నది ఆత్మయనివ్యుత్పత్త్యర్థము.
దేవ మానవ పశుపక్షి కీటకాది సకల చరాచర జంతువులను, పంచభూతములను చేయుటందు ఫల్గితనో, దేని సూత్రమాత్రము చేత జీవించుచున్నవో, మరల సర్వము దేనియందు ప్రవేశించి లయించునో ఆ వస్తువు బ్రహ్మము.

## పంచీకరణము

| | | | |
|---|---|---|---|
| అధిష్ఠాన దేవత =సదాశివుడు<br>గుణము = శబ్దము<br>శక్తి = పరాశక్తి<br>బీజము = అంబీజము<br>**ఆకాశము**<br>నిజాంశము = శోకము<br>వాయువుతోకలిసి= కామము<br>అగ్నితో కలసి = క్రోధము<br>జలముతో కలసి=మోహము<br>పృథ్వితోకలసి=భయము<br>ఆకాశము=శబ్దతన్మాత్రాంశము | సదాశివ ప్రత్యగాత్మప్రకాశము<br>భ్రూమధ్య స్థానమందు జేరి<br>శబ్ద తన్మాత్రతో కూడి<br>1/2 **జ్ఞానము** ఆయేను<br>ఈ జ్ఞానమునకు<br>అధిష్ఠానదేవత **కూటస్థుడు**<br>ఈ కూటస్థుడు జ్ఞానము<br>రెండు మిశ్రమమై<br>**సర్వమునుయెరుగును**<br>అంబీజము యొక్క<br>ప్రాణ చలనము జ్ఞానముతో<br>చేరి సర్వమును గుర్తెరుగును<br>భ్రూమధ్యము<br>**ఆకాశము భూతం** | సదాశివ ప్రత్యగాత్మప్రకాశము<br>కంఠ స్థానమందుజేరి<br>శబ్ద తన్మాత్రతో కూడి<br>1/8 **మనస్సు** ఆయేను<br>ఈ మనస్సునకు<br>అధిష్ఠానదేవత **చంద్రుడు**<br>ఈ చంద్రుడు మనస్సు<br>రెండు మిశ్రమమై<br>**సంకల్పవికల్పములు** చేయును<br>అంబీజ ప్రాణ చలనము<br>మనస్సుతోకూడి సంకల్ప<br>వికల్పములుచేయును<br>కంఠము<br>**వాయువు భూతము** | సదాశివ ప్రత్యగాత్మప్రకాశము<br>ముఖ స్థానమందుజేరి<br>రూప తన్మాత్రతో కూడి<br>1/8 **బుద్ధి** ఆయేను<br>ఈ బుద్ధికి<br>అధిష్ఠానదేవత **బృహస్పతి**<br>ఈ బృహస్పతి బుద్ధి<br>రెండు మిశ్రమమై<br>**నిశ్చయము** చేయును<br>అంబీజ ప్రాణ చలనము<br>బుద్ధితోకూడి నిశ్చయించును<br>ముఖము<br>**అగ్నిభూతము** |
| అధిష్ఠాన దేవత =ఈశ్వరుడు<br>గుణము = స్పర్శ<br>శక్తి = ఆదిశక్తి<br>బీజము = యంబీజము<br>**వాయువు**<br>నిజాంశము = పరుగెత్తుట<br>వాయువుతోకలిసి= దాటుట<br>అగ్నితో కలసి = తిరుగుట<br>జలముతో కలసి=చాచుట<br>పృథ్వితోకలసి= ముడుచుట<br>వాయువు<br>స్పర్శతన్మాత్రాంశము | ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము<br>నాభి స్థానమందు జేరి<br>1/8 శబ్దతన్మాత్రతో కూడి<br>**సమానవాయువు** ఆయేను<br>ఈ సమాన వాయువుకు<br>అధిష్ఠానదేవత **జయుడు**<br>ఈ జయుడు సమాన<br>వాయువు మిశ్రమమై<br>**పచనము చేయును**<br>యంబీజ ప్రాణచలనము<br>సమానవాయువుతో కూడి<br>**72వేల నాళ్లకు అన్నరసము**<br>పంచును<br>నాభి<br>**ఆకాశము భూతం** | ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము<br>సర్వాంగమందు జేరి స్పర్శ<br>1/2 తన్మాత్రలో కూడి<br>**వ్యానవాయువు** ఆయేను<br>ఈ వ్యానవాయువుకు<br>అధిస్థానదేవత **విశ్వయోని.**<br>ఈ విశ్వయోని<br>వ్యానవాయువు మిశ్రమమై<br>**స్పర్శ నెరుగును**<br>యంబీజ ప్రాణచలనము<br>వ్యానవాయువుతో కూడి<br>**స్పర్శ నెరుగును**<br>సర్వాంగము<br>వాయువుభూతం | ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము<br>కంఠ స్థానమందు జేరి<br>1/8 రూప తన్మాత్రలో కూడి<br>**ఉదానవాయువు** ఆయేను<br>ఈ ఉదానవాయువుకు<br>అధిస్థానదేవత **అజుడు**<br>ఈ అజుడు<br>ఉదానవాయువుతో కూడి<br>**పలికించును**<br>యంబీజ ప్రాణచలనము<br>ఉదానవాయువుతో కూడి<br>**పలికించును**<br>కంఠము<br>అగ్నిభూతం |

| | | | |
|---|---|---|---|
| ..వ దేవత = రుద్రుడు<br>..ము = రూపతన్మాత్ర<br>శక్తి = జ్ఞానశక్తి<br>..ము = రం బీజము<br>**అగ్ని**<br>..శము = ఆకలి<br>..వుతోకలిసి= నిద్ర<br>.. కలసి = దప్పి<br>..లతోకలసి=సంగమము<br>..తోకలసి= ఆలస్యము<br>..రూపతన్మాత్రాంశము | రుద్రతన్మాత్ర ప్రకాశము<br>చెవుల స్థానమందు జేరి<br>శబ్ద తన్మాత్రతో కూడి<br>1/8 **శ్రోత్రము** ఆయేను<br>ఈ శ్రోత్రమునకు<br>అధిష్ఠానదేవత **దిక్కులు**<br>ఈ దిక్కులు శ్రోత్రము<br>మిశ్రమమై<br>**శబ్దము** నెరుగును<br>రంబీజ ప్రాణచలనము<br>శ్రోత్రముతో చేరి<br>**శబ్దము వినును**<br>**చెవులు**<br>**ఆకాశము భూతం** | రుద్రతన్మాత్ర ప్రకాశము<br>చర్మ స్థానమందు జేరి<br>స్పర్శ తన్మాత్రతో కూడి<br>1/8 **త్వక్కు** ఆయేను<br>ఈ త్వక్కునకు<br>అధిష్ఠానదేవత **వాయువు**<br>ఈ వాయువు త్వక్కు<br>మిశ్రమమై<br>**స్పర్శ** నెరుగును<br>రంబీజ ప్రాణచలనము<br>త్వక్కుతో చేరి<br>**స్పర్శ నెగురును**<br>**చర్మము**<br>**వాయువు భూతం** | రుద్రతన్మాత్ర ప్రకాశము<br>కన్నుల స్థానమందు జేరి<br>రూప తన్మాత్రతో కూడి<br>1/2 **చక్షువు** ఆయేను<br>ఈ చక్షువునకు<br>అధిష్ఠానదేవత **సూర్యుడు**<br>ఈ సూర్యుడు చక్షువు<br>మిశ్రమమై<br>**రూపము** నెరుగును<br>రంబీజ ప్రాణచలనము<br>చక్షువుతో చేరి<br>**రూపము నెగురును**<br>**కన్ను**<br>**అగ్ని భూతం** |
| ..ాన దేవత = విష్ణువు<br>గుణము = రసము<br>శక్తి = ఇచ్ఛాశక్తి<br>..జము = వం బీజము<br>**జలము**<br>..ంశము = శుక్లము<br>..శముతో కూడి = సొల్లు<br>..యువుతో కలసి = చెమట<br>..తో కలసి = మూత్రము<br>..ముతో కూడి=శోణితము<br>..లము రసతన్మాత్రాంశము | విష్ణుప్రత్యగ్మా ప్రకాశము<br>చెవుల స్థానమందు జేరి<br>శబ్ద తన్మాత్రతో కూడి<br>1/8 **శబ్దము** ఆయేను<br>ఈ శబ్దము యొక్క<br>అధిష్ఠానదేవత **సదాశివుడు**<br>ఈ సదాశివుడు<br>శబ్దముతో కూడి<br>**ధ్వని** నెరుగును<br>వంబీజము యొక్క ప్రాణ<br>చలనము శబ్దమునందు చేరి<br>**ధ్వనించు**<br>**చెవులు**<br>**ఆకాశము** | విష్ణుప్రత్యగ్మా ప్రకాశము<br>చర్మ స్థానమందు జేరి<br>స్పర్శ తన్మాత్రతో కూడి<br>1/8 **స్పర్శ** ఆయేను<br>ఈ స్పర్శ యొక్క<br>అధిష్ఠానదేవత **ఈశ్వరుడు**<br>ఈ ఈశ్వరుడు స్పర్శ<br>మిశ్రమమై<br>**స్పర్శను** తాకును<br>వంబీజము యొక్క ప్రాణ<br>చలనము స్పర్శమునందుచేరి<br>**స్పర్శను తాకును**<br>**చర్మము**<br>**వాయువు భూతము** | విష్ణుప్రత్యగ్మా ప్రకాశము<br>కన్నుల స్థానమందు జేరి<br>రూప తన్మాత్రతో కూడి<br>1/8 **రూపము** ఆయేను<br>ఈ రూపము యొక్క<br>అధిష్ఠానదేవత **రుద్రుడు**<br>ఈ రుద్రుడు రూపము<br>మిశ్రమమై<br>**వర్ణము** నెరుగును<br>వంబీజము యొక్క ప్రాణ<br>చలనము రూపమునందుచేరి<br>**వర్ణము నెరుగును**<br>**కన్ను**<br>**అగ్ని భూతము** |
| ..ధిష్ఠాన దేవత = బ్రహ్మ<br>గుణము = గంధము<br>శక్తి = క్రియాశక్తి<br>బీజము = లంబీజము<br>**పృథ్వి**<br>..నిజాంశము = అస్తులు<br>..ఆకాశముతోకలసి నఖరోమములు<br>వాయువుతో కలసి = చర్మము<br>అగ్నితో కలసి = నరములు<br>..జయుతోకలసి = మాంసము<br>పృథ్వీగంధతన్మాత్రాంశము | బ్రహ్మప్రత్యగ్మా ప్రకాశము<br>నోరు స్థానమందు జేరి<br>శబ్ద తన్మాత్రతో కూడి<br>1/8 **వాక్కు** ఆయేను<br>ఈ వాక్కు యొక్క<br>అధిష్ఠానదేవత **అగ్ని**<br>ఈ అగ్ని వాక్కు<br>మిశ్రమమై<br>**వచనము** చేయును<br>లంబీజము యొక్క ప్రాణచలనము<br>వాక్కుయందు చేరి<br>**వచనము జేయును**<br>**నోరు**<br>**ఆకాశ భూతము** | బ్రహ్మప్రత్యగ్మా ప్రకాశము<br>చేతుల స్థానమందు జేరి<br>స్పర్శ తన్మాత్రతో కూడి<br>1/8 **పాణి** అయేను<br>ఈ పాణి యొక్క<br>అధిష్ఠానదేవత **ఇంద్రుడు**<br>ఈ ఇంద్రుడు పాణి<br>మిశ్రమమై<br>**దానము** చేయును<br>లంబీజము యొక్క ప్రాణచలనము<br>పాణియందు చేరి<br>**దానము చేయును**<br>**చేతులు**<br>**వాయువు** | బ్రహ్మప్రత్యగ్మా ప్రకాశము<br>కాళ్ళ స్థానమందు జేరి<br>రూప తన్మాత్రతో కూడ్<br>1/8 **పాదము** ఆయేను<br>ఈ పాదము యొక్క<br>అధిష్ఠానదేవత **విష్ణువు**<br>ఈ విష్ణువు పాదము<br>మిశ్రమమై<br>**గమనము** చేయును<br>లంబీజము యొక్క ప్రాణచలనము<br>పాదమందు చేరి<br>**గమనము చేయును**<br>**కాళ్లు**<br>**అగ్నిభూతము** |

| | | | |
|---|---|---|---|
| పరిణామము **పంచతన్మాత్రలు** యొక్క (సృష్టిలో కలుగు సుఖ దుఃఖములు చూచి తాను అది ఒక లీలగా భావించి ఆనందించి నప్పుడు ఏకరూపమునుందు బ్రహ్మకు వివిధదశలో నామములు కలుగుటమాత్రమేనని తెలియవలయును) | పరిణామము **పంచ మహా భూతములు** యొక్క (తమోగుణ ప్రధానమగు మూల మాయతో కూడిన ఈశ్వరుని నుండి పంచభూతములు సృష్టి కలిగెను) | పరిణామము **జగత్తు** యొక్క | పరిణామము **విరాట్టు** |
| **నిజాంశము** | **నిజాంశము** | **నిజాంశము** | **నిజాంశము** |
| శబ్దము (సర్పము)<br>స్పర్శము (ఏనుగు<br>రూపము (పతంగము)<br>రసము (చేప)<br>గంధము (తుమ్మెద)<br>పంచగుణములు | సునీలవర్ణము<br>ధూమ్రవర్ణము<br>అసితవర్ణము<br>తెలుపువర్ణము<br>ఎరుపువర్ణము<br>పంచవర్ణములు | అనాత్మ<br>(ఆత్మానాత్మలంటులేవు)<br>ఈ విషయము గ్రీకుల కంటే చాలాపూర్వమే భారతీయులు కనుగొన్నారని శ్రీ రాధకృష్ణపండితులు తెల్పినారు). | విశ్వ<br>రూపము<br>(సూర్యాకాశము, భూతాకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి |
| **భక్తులు** | **మంత్రోపాసకులు** | **మానవులు** | **తురీయము** |
| | | | |
| సదాశివ ప్రత్యగాత్మప్రకాశము నాభి స్థానమందు జేరి రస తన్మాత్రతో కూడి<br>1/8 **చిత్తము** ఆయేను<br>ఈ చిత్తమునకు అధిష్ఠానదేవత **క్షేత్రజ్ఞుడు**<br>ఈ క్షేత్రజ్ఞుడు చిత్తము మిశ్రమమై<br>**చింతనము చేయును**<br>అందీజము ప్రాణ చలనము చిత్తముతో కూడి చింతించును<br>**నాభి**<br>**జలభూతము** | సదాశివ ప్రత్యగాత్మప్రకాశము హృదయ స్థానమందు జేరి 1/8 గంధ తన్మాత్రతో కూడి<br>**అహంకారము** ఆయేను<br>ఈ అహంకారమునకు అధిష్ఠానదేవత **రుద్రుడు**<br>ఈ రుద్రుడు అహంకారము మిశ్రమమై<br>**అభిమాన పడునీ**<br>అందీజము ప్రాణ చలనము అహంకారముతో కూడి అభిమానించును<br>**హృదయము**<br>**పృథ్వీభూతం** | ఆధ్యాత్మికము<br>అధిదైవికము<br>అధి భౌతికము<br>స్థానము<br>భూతము | అంతరింద్రియములు<br>ఆకాశ పంచకము<br>(ధర్మద్వయములు ఏర్పడుగును) |
| ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము హృదయము స్థానమందు జేరి రసతన్మాత్రతో కూడి<br>**ప్రాణవాయువు** ఆయేను<br>1/8 ఈ ప్రాణవాయువు అధిస్థానదేవత **వశిష్ఠుడు**<br>ఈ వశిష్ఠుడు ప్రాణవాయువు కూడి<br>**ఉచ్ఛ్వాస నిశ్వాస చేయును**<br>యందీజ ప్రాణచలనము ప్రాణవాయువుతో కూడి<br>**ఉచ్ఛ్వాస నిశ్వాస చేయును**<br>హృదయము<br>జలభూతం | ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము గుడ స్థానమందు జేరి గంధ తన్మాత్రతో కూడి<br>**అపానవాయువు** ఆయేను<br>1/8 ఈ అపాన వాయువు అధిస్థానదేవత **విశ్వకర్త**<br>ఈ విశ్వకర్త అపాన వాయువు కూడి<br>**విసర్జన చేయును**<br>యందీజ ప్రాణచలనము అపాన వాయువుతో కూడి<br>**విసర్జన చయును**<br>గుదము<br>పృథ్వీభూతం | ఆధ్యాత్మికము<br>అధిదైవికము<br>అధి భౌతికము<br>స్థానము<br>భూతము | కర్మేంద్రియములు<br>వాయువు పంచకము<br>(ఉపానములు) |

| | | | |
|---|---|---|---|
| రుద్రతన్మాత్ర ప్రకాశము<br>నాలుక స్థానమందు జేరి<br>రస తన్మాత్రతో కూడి<br>1/8 **జిహ్వ** ఆయేను<br>ఈ జిహ్వకు<br>అధిష్ఠానదేవత **వర్ణుడు**<br>ఈ వర్ణుడు జిహ్వ<br>మిశ్రమమై<br>**రుచి** నెరుగును<br>రంబీజ ప్రాణచలనము<br>జిహ్వతో చేరి<br><br>**రుచి నెరుగును**<br>**నాలుక**<br>**జల భూతం** | రుద్రతన్మాత్ర ప్రకాశము<br>ముక్కు స్థానమందు జేరి<br>గంధతన్మాత్రతో కూడి<br>1/8 **ఘ్రాణము** ఆయేను<br>ఈ ఘ్రాణమునకు అధిష్ఠాన<br>దేవత **అశ్వని దేవతలు**<br>ఈ అశ్వని దేవతలు<br>ఘ్రాణము మిశ్రమమై<br>**వాసన** నెరుగును<br>రంబీజ ప్రాణచలనము<br>ఘ్రాణముతో చేరి<br><br>**వాసన నెరుగును**<br>**ముక్కు**<br>**పృథ్వి భూతం** | **ఆధ్యాత్మికము**<br>**అధిదైవికము**<br>**అధి భౌతికము**<br><br>**స్థానము**<br>**భూతము** | **జ్ఞానేంద్రియములు**<br>**అగ్ని పంచకము**<br>**(ప్రాణములు)** |
| విష్ణుప్రత్యగ్మా ప్రకాశము<br>నాలుక స్థానమందు జేరి<br>రస తన్మాత్రతో కూడి<br>1/2 **రసము** ఆయేను<br>ఈ రసము యొక్క<br>అధిష్ఠానదేవత **విష్ణువు**<br>ఈ విష్ణువు రూపము<br>మిశ్రమమై<br>**రుచి** నెరుగును<br>వంబీజము యొక్క ప్రాణ<br>చలనము రసమునందుచేరి<br><br>**రుచి నెరుగును**<br>**నాలుక**<br>**జల భూతము** | విష్ణుప్రత్యగ్మా ప్రకాశము<br>ముక్కు స్థానమందు జేరి<br>గంధ తన్మాత్రతో కూడి<br>1/8 **గంధము** ఆయేను<br>ఈ గంధము యొక్క<br>అధిష్ఠానదేవత **బ్రహ్మ**<br>ఈ బ్రహ్మ గంధము<br>మిశ్రమమై<br>**వాసన** నెరుగును<br>వంబీజము యొక్క ప్రాణచలనము<br>గంధమునునందుచేరి<br><br>**వాసన నెరుగును**<br>**నాలుక**<br>**జల భూతము** | **ఆధ్యాత్మికము**<br>**అధిదైవికము**<br>**అధి భౌతికము**<br><br>**స్థానము**<br>**భూతము** | **విషయేంద్రియములు**<br>**జల పంచకము**<br>**(భోగములు)** |
| బ్రహ్మప్రత్యగ్మా ప్రకాశము<br>లింగ స్థానమందు జేరి<br>రస తన్మాత్రతో కూడి<br>1/8 **గుహ్యము** ఆయేను<br>ఈ గుహ్యమునకు<br>అధిష్ఠానదేవత **బ్రహ్మ**<br>ఈ బ్రహ్మ గుహ్యము<br>మిశ్రమమై<br>**ఆనందించును**<br>లంబీజము యొక్క ప్రాణచలనము<br>గుహ్యమందు చేరి<br><br>**ఆనందించును**<br>**లింగము**<br>**జలము** | బ్రహ్మప్రత్యగ్మా ప్రకాశము<br>ముడ్డి స్థానమందు జేరి<br>గంధ తన్మాత్రతో కూడి<br>1/2 **గుదము** ఆయేను<br>ఈ గుదమునకు<br>అధిష్ఠానదేవత **మృత్యువు**<br>ఈ మృత్యువు గుదము<br>మిశ్రమమై<br>**మల విసర్జన** చేయును<br>లంబీజము యొక్క ప్రాణచలనము<br>గుదమందు చేరి<br><br>**మలవిసర్జన చేయును**<br>**ముడ్డి**<br>**పృథ్వి** | **ఆధ్యాత్మికము**<br>**అధిదైవికము**<br>**అధి భౌతికము**<br><br>**స్థానము**<br>**భూతము** | **కర్మేంద్రియములు**<br>**పృథ్వి పంచకము**<br>**(కర్మములు)** |

1. ఈ సాంఖ్య విచారణ వలన జీవ శుద్ధి కలుగును. జీవునకు అజ్ఞానావరణముకలదు. అందుకే జీవవస్తువు తెలియదు. ఈ అజ్ఞానమే జీవునికి దోషము. ఈ దోషము సాంఖ్య విచారణచే తొలుగును..

2. ఈ బ్రహ్మాండమునందు పురుషోత్తమ బ్రహ్మమే లేని మాయ. ఈ మాయ ఒక్కసారి సరస్వప్నవత్. ఒక సారి తెలివి, గుర్తు రూపములో నుండును. నిజము విచారించి తెలుసుకొంటే సుర స్వప్నవత్. ఈ రెండు సమానమే. ఇది లేనిదే, ఆదిరానిదే. ఇది పుట్టనిదే గిట్టనిదే, పుట్టలేదు.

K

# శ్రీ రాజయోగి పరబ్రహ్మణే నమః

## " కట్టులోనే వుండి నారండీ" (తత్వము)

రచన - కె. సుబ్బరాయుడు, అనంతపురం.

పరిపూర్ణ బోధ గ్ర

పల్లవి : కట్టులోనే వుండినారండీ - అజ్ఞానపరులు - కట్టుదాటెడు తెలువు గనబోకా

అనుపల్లవి : కట్టులోనే వుండినారని - బట్టబయలు వునికి దెలిపిన
"ఆత్మనోన్యం నకించన" యని ఆత్మయే మా కచలమందురు ॥కట్టు॥

**చరణములు :**

1) " అవాగ్మానస గోచరం" బనిరీ - ఆ పరబ్రహ్మం - బందుననిరీ శుద్ధ మనుసుకు
మనసు కందెడిదెట్లు బ్రహ్మము - మనవి చేయుదనిన పలుకక కోపమంతయు కూడగట్టుక -
కొట్టుటకు సంసిద్ధులగుదురు ॥కట్టు॥

2) మూడుపాదము లమృతంబనిరీ - ఆ పరబ్రహ్మం - బొక్కపాదము విశ్వమంచనిరీ
కొంతసత్యము కొంత మిధ్యగ - అంతటంతట పరిమితంబై
ఉండు బ్రహ్మం బచల మెట్లన - వున్న శృతికి భంగమౌనని ॥కట్టు॥

శ్రీమద

3) దీక్షితాచల సిద్ధాంత మున్నాదీ - సనాతనంబిది - దీని విన్నను జన్మలేదండి
సర్వ భ్రాంతుల కునికియైన - సాక్షి బ్రహ్మము కవలిబోధా
సత్యమిదియని మనవిజేసిన - చాలు మా కిది పోమ్మటందురు ॥కట్టు॥

4) సత్య మార్గము జనవిరోధంబూ - అసత్యమార్గమె - సర్వజన సంపూజ్యమానంబూ
ఆవరణ యెరుకయని నిరా - వరణము పూర్ణమనుచూ
వున్న బయులున సున్న ఎరుకని - ఉన్న సత్యము చెప్ప నమ్మరు ॥కట్టు॥

స

5) సికింద్రాపుర సీమయందునా - అనసూయనాధుడు రాజయోగీ గురువరేణ్యుండూ
సాక్షి రహితంబైన బోధను - చాటిచెప్పను వినుదురండను
సుబ్బరాయుని పిలుపు వినకను - మబ్బులోనే యుండువారలు ॥కట్టు॥

ఓం

శ్రీగురుభ్యోనమః

**పరిపూర్ణబోధామృత వచనములు**

1. గురువు లెందరెందరో వారందరికి వందనములు
గురువులందు మా గురువు వెంకటాచార్యులు మాకు లెస్స.

2. బోధ బోధకు భేదంబుగాంచ బోధపడును
బోధలన్నిటి యందు పరిపూర్ణ బోధామృతంబులెస్స

3. పంచతన్మాత్రలనన్నిటిని పదిలిమటుగా గట్టివైచి
మనస్సు స్వవశమైన నది ఆత్మసాక్షాత్కారమనుటలెస్స స్స

4. అదిపూర్ణం, ఇది పూర్ణం అంతా పూర్ణంగా నెరిగి
పూర్ణమున పూర్ణముడిగన వున్నది పరిపూర్ణమనుటలెస్స

5. ఉన్నపరిపూర్ణమును లేదు లేదందురు ఎందరెందరో
అది పున్నదంతట నిండి నిబడీ కృతమైనదనుటలెస్స

6. ఉన్నది వున్నదని గురుడు పరిపూర్ణమును దెల్పలెస్సగా
ఉన్నదని నమ్మి దానిని ఉండజూంచుకొనుట లెస్స

7. కలదు కలదన్నవారికి కలదు ఎరుక జగము
లేదు లేదన్న వారికి ఎరుక జగము లేదు లేదనుటలెస్స

8. లేని నేను వున్నానని భ్రమించుటకన్న
పరిపూర్ణమున లేని నేను లేనే లేననుట లెస్స
లేని నేను లేనేలేనని లేనెరుకను వదులుట లెస్స

9. నీ కలలోని ఆనందము నీవు వెదకిన దొరకదెట్లో
నీవు అశ్వాతము, నీ వునికి వుళక్కియనుట లెస్స

10. లే నెరుక పరబయలందు తానెట్లు జనించెనన్న
వియదబ్జ విధము స్వప్నానందము వంటి దనుట లెస్స

11. తన్నుతానెరుగుటకు మరుచుటకు కారణమేమన
అన్నిటిని ఎరిగి మరిచే ఎరుక కారణమనుట లెస్స

12. చర్మ చక్షువు శ్రోత్రములు పరమార్థ గమ్యము గాదని
జ్ఞాన చక్షువొక్కటే పరమార్థ గమ్యమనుట లెస్స

13. నా ఉనికి నేను ఉన్నాననుట నాకు బంధము
నేను లేననుకొని ఉండి లేకపోవుటయే మోక్షమనుట లెస్స